# మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు

## సబ్బు- ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్.
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్.







జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ




ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

### బాగాలేదు

4.2.83 తే. ముఖ చిత్రం కోతి బొమ్మను ఎత్తుకొని ఉన్న సుమలత చూడాలంటేనే బాధగా ఉంది. దయచేసి ఇంకొకసారి ఇటువంటి ముఖచిత్రం వేయకూడదు.

శివజ్యోతి (బెల్లంపల్లి)

### బాగుంది

సుమలత ముఖచిత్రం చాలా అందంగా వుంది. కథలలో హోం డిపార్టుమెంట్ కథ మాకు ఎంతో నచ్చి నవ్వులతో నింపింది.

అతి ముఖ్యంగా మహానటి సావిత్రి కుమార్తె తన తల్లిగారిని గురించి వివరించిన నిజాలు ప్రతి పాటకుని హృదయాన్ని ద్రవింప చేస్తుంది.

48 పేజీలోని మొదటి కార్టూన్ విద్యార్థినిలకు ఏం నచ్చదు. వ్యక్తిగతం శీర్షిక ఎంతోబాగుండి నూతన విషయాలను వ్యక్తుల పరిచయాలను తెలియచేస్తూ ఆకర్షణీయంగా వున్నది.

షేక్ మస్తాన్, ఇతరులు, ముమ్మలసానివారి పాలెం (రేపల్లె)

### ఉద్యోగం

28.1.83 సంచికలో "ఉద్యోగం"కథ నన్ను చాల ఆకట్టుకుంది. సంస్కారం ఉన్న శేషగిరి పాత్రను చక్కగా మలచారు రచయిత.

మాధవుడు (రాజమండ్రి)



### నిరాశావాదం

సంక్రాంతి ప్రత్యేక సంచిక ఆకర్షనీయంగా ఉన్నది. ఆ సంచికలో అచ్చయిన "ది లాస్ట్ డేట్" కథ ఈనాటి యువతరం నిరాశావాదానికి ప్రతీక. రాజ ఆశావాదిని అంటూనే పిరికివాడిలా జీవితాన్ని బలిచెయ్య దలచుకున్నాడు. చైతన్య పాత్ర ద్వారా ఈనాటి సమాజ పరిస్థితులను ఎత్తిచూపిన రచయిత, ఇప్పుడున్న పరిస్థితులకు "ఆత్మవంచన" సరైన సమాధానం అని పరోక్షంగా చెప్పారు. క్షానీశరత్‌లాగా స్వయంకృషితో నెగ్గ రావచ్చు అన్న విషయానికి ఎందుకు ప్రాముఖ్యతను ఇవ్వలేకపోయారు. బాగా ఆలోచిస్తే రచయిత నిరాశావాది అని తెలుస్తూన్నది. డిగ్రీచదివాను.అస్థాయిలో ఉపాధి చేపడతాను. అనుకుంటే ఎలా ఒక్కసారి ఆలోచించండి. ఎంతమంది తమ అర్హతలకు తగిన ఉద్యోగాలు చేస్తున్నారు. వాళ్లంతా చైతన్య, రాజ లాగానే వికలాంగులుగా మారడాన్ని ప్రయత్నిస్తున్నారా ?

ఘంటా విజయకుమార్ (నందిగామ)



కేంద్రంలో పోర్టుఫోలియోలేని కాబినెట్ మంత్రిగా నియమింపబడిన ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డిచేత జనవరి 29 న ప్రమాణస్వీకారం చేయిస్తున్న రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్.

### ఆ రోజులు వేరు

22—1—83 పత్రికలోని ఇచ్ఛాపురపు రామచంద్రంగారి "ఆ రోజులు వేరు" కథ చదివాక ఈఉత్తరం రాయాలనిపించింది. రచయిత కథలో చెప్పినట్లుగా ఈ రోజుల్లో ప్రొఫెసర్లు స్టూడెంట్సుకి భయపడడం లేదు. ఇప్పటికీ విద్యార్థులకి ప్రొఫెసర్లు అంటే భయం ఉంది. అంతే కాని పూర్వపు రోజులకి వ్యతిరేకంగా కాని, విరుద్ధంగా కాని ఏ విద్యార్థి ప్రవర్తించడం లేదు. పోనీ కథలో రాసినట్టుగా అలాంటి పరిస్థితులు కూడ ఆంధ్ర యూనివర్సిటీలో లేవు. పూర్వం లాగ ప్రొఫెసర్లంటే విద్యార్థులు భయపడక పోవచ్చు. అంత మాత్రాన వాళ్ళంటే గౌరవం,గురుభక్తి లేదని కాదు. కాని రచయిత కథలో స్టూడెంట్సుదే తప్పు ప్రవర్తనగా రాసారు. కథలో రాసినట్లుగా ఇప్పుడు (ఇంతకుముందు కూడ) హాస్టలు రూమ్సులో కూర్చొని పేకాట, త్రాగుడు లాంటివి నూటికి తొంభై అయిదు మంది చెయ్యనే చెయ్యరు. ఒకవేళ అలాంటివి చెయ్యాలనుకున్నా బయటికి పోతారే తప్ప రూముల్లో ఎవరూ చెయ్యరు. ఒకవేళ రచయిత రాసినట్లుగా అలాంటి పన్లు జరుగుతున్నాయంటే 'కారణం ఎవరు?' అని కూడ కాస్త ఆలోచించాలి కాని, విద్యార్థులు ఎంతోపాడయిపోతున్నారనడం హాస్యాస్పదంగా ఉంటుంది. వార్డెన్లుగా ఎవరో కాదు —లెక్చరర్లుకాని, ప్రొఫెసర్లు కాని ఉంటారు. అలాంటి అసభ్యకరమైన పనులు చేస్తున్నప్పుడు వాళ్లు చర్య తీసుకోవాలి కదా! అలాంటివి ఎవరూ పట్టించు కోరు. కనీసం వారానికి రెండుసార్లు అయినాకూడవార్డెన్సు,హాస్టల్సును సందర్శించరు.

ప్రొఫెసర్లు నిజాయితీగా ఉంటారు. కేవలం స్టూడెంట్సుదే తప్పు అంటూ కథలో రాసారు. ఎక్కడ జరిగే అన్యాయాలు అక్కడ జరుగుతూనే ఉన్నాయి ! విద్యార్థులలో చెడు ప్రవర్తన కల్గిన వాళ్ళుంటే ప్రొఫెసర్లలోనూ క్రూరంగా ప్రవర్తించే వాళ్ళుఉన్నారు. కాకపోతే విద్యార్థులు కొంచెం నిక్కచ్చిగా ఎదురు ప్రశ్నలు వేస్తే అది రచ్చకెక్కుతుంది. దాంతో "విద్యార్థులు ఎంత మారిపోతున్నారు? మన రోజుల్లో ఇలా ఉండే వాళ్ళమా?" అంటూ ముక్కు మీద వేలు వేసుకొనే వాళ్లు ఉన్నారు.

ఇహపోతే రచయిత కథలో రాసినట్లుగా ప్రొఫెసర్లు స్టూడెంట్సుకి ఎప్పుడూ భయపడరు. స్టూడెంట్సు ఎక్కువగా వచ్చిన సినిమాకి ఎంతమంది ప్రొఫెసర్లు, లెక్చరర్లు పోవడం లేదు? ఫలానాచోట స్టూడెంట్సు ఉన్నారు. ఫలానా చోటుకి స్టూడెంట్సు వస్తారు అనుకొని వెళ్ళడం మానేస్తే అసలు ఈ ప్రొఫెసర్లు, లెక్చరర్లు ఇల్లు దాటి ఎక్కడికీపోలేరు. ఇంకా అలాంటి రోజులు రాలేదు. బహుశా రావనే అనుకోవచ్చు.

జి. సాయికుమార్, ఆంధ్రా యూనివర్సిటీ (వాల్తేరు)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం : 25–2–'83
దుందుభినామ సం. అధిక ఫాల్గుణ శు. త్రయోదశి
*సంపుటము 75 : సంచిక 26*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 1–50 |
| ఆరుమాసాల చందా | రు. 42–90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 85–80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి రాధ
(ఫొటో : కాజాన్)



## ✻ లోకంపోకడ — ఊమెక ✻












# ఆయన ముందు భారతీయుడు

"నేను భారతీయుడిని, పార్శీనయినందుకు గర్వంగా ఉంది!"

ఈ మధ్యనే బొంబాయిలోని పార్శీలు బ్రాబోర్న్ స్టేడియమ్‌లో సమావేశమయి తమ వారిలో ప్రముఖులని కొందరిని సన్మానించారు. పార్శీలలో ప్రముఖులకి తక్కువలేదు. ఇంతదాకా వారికి ఎందుకు సన్మానం లభించలేదో అర్థంకాదు. పార్శీలలో ప్రముఖుల్ని ఇతర మతాల వారు ఇంత్ర కితమే సన్మానించారే! జె. ఆర్. డి. టాటా బ్రాబోర్న్ స్టేడియమ్‌లో హాజరయిన పెద్ద వారిలో ఒకరని వేరే చెప్పనక్కరలేదు. ఆయనని ఒక ఉపన్యాసం చెయ్యమన్నారు. ఆయన లేచి తమకి జరిగిన సన్మానం ఎంత గర్వకారణంగా ఉందో టూకీగా చెప్పి హటాత్తుగా తమ ప్రసంగాన్ని ఆపివేశారు ఆయన కూర్చునేముందు "నేను భారతీయుడిని, పార్శీనయినందుకు గర్వంగా ఉంది!" అన్నారు.

ఆయన ఏమన్నారో గమనించారా? తాము పార్శీ మతానికి చెందిన వారమని ఊరుకోలేదు నేను మొదట భారతీయుడిని, ఆ తరువాతనే పార్శీని — అని ఆయన




డాక్టర్ జంయ్ దుబాష

అన్నారు. ఇది నిజమే కదా! ఒక భారతీయుడిగా జె. ఆర్. డి. చాలా పెద్దవాడు. ఒక పార్శీగా ఆయన ఎందరిలోనో ఒకరు.

ఏదిఎలాగ ఉన్నా, జె. ఆర్ డి ఒక 'పార్శీ' అనుకునేవారు ఎవరూ ఉండరు. అసలు ఆయనే అనుకోరు కదా? దాదాభాయి నౌరోజీ, ఫెరోజ్‌షా మెహతా పార్శీలనుకునే వారెవరు? ఈ వర్గంవారి మొత్తం సంఖ్య 80000 ఉండవచ్చు; వీళ్ళందరినీ ఒక వంద సినిమా థియేటర్‌లలో కూర్చోపెడితే వాటిలో పడతారు. పార్శీలు లేని రంగం లేదు — రాజకీయాలలో పిలూ మోడీ; వ్యాపారంలో గోద్రెజి, టాటా; సైన్యంలో మానెక్‌షా: కుర్సెత్‌జీ, న్యాయవాది వృత్తిలో పాల్కీవాలా, సొరాబ్‌జీ, పత్రికా రచనలో మసానీ, లలితకళలలో ఖండాలావాల సంగీతంలో జుబిన్ మెహతా, క్రికెట్‌... జనీర్, కార్మిక సంఘాలలో హోమిదాజీ. ... గులరందు లేరని లేదు!

పార్శీలు చిన్న వ్యాపాగాలూ, కంపెనీల... పెద్ద ఉద్యోగాలూ అధికంగా చేస్తారు... అభిప్రాయం తప్పు. వాళ్ళు కష్టా... భయపడి ప్రభుత్వోద్యోగాల వంటి వాటికోస ఎగబడేవాళ్లు కానేకారు. ఎన్నో రంగాల... వాళ్లు మార్గదర్శకులు. సామ్రాజ్యవాద పేదరికానికి ఒక ముఖ్యమయిన కారణం అ... యదార్థాన్ని గ్రహించిన వారిలో మొద... మేధావి దాదాభాయి నౌరోజీ. జమ్‌షెడ్... టాటా నల్లమందు, పత్తి వ్యాపారం చేస్తూ ఉండేవాడు. ఒక హోటలు ఏదో పెట్టుకు సుఖంగా కాలక్షేపం చేసుకుని ఉండవచ్చు ఆయన; కాని, ఆయన ఆ పని చెయ్యలేదు నాగపూర్‌లో ఒక బట్టలమిల్లు స్థాపించాడు భారతదేశంలోని మొదటి బట్టలమిల్లు ఇదే. జమ్‌షెడ్‌పూర్‌లో ఒక ఉక్కు పరిశ్రమ నెలకొల్పాడు. ఇవి కాకుండా ఎన్నో పరిశ్రమలని దేశంలో మొదటిసారిగా ఆయ... స్థాపించాడు. బొంబాయి దగ్గర ఒక పెద్ద...

## ఇరాన్ - భారతదేశం -

అనాదిగా ఇరాన్ నుంచి వచ్చినవారు భారత దేశంలో స్థిరపడి పోతూనే ఉండి ఉండాలి. వారిలో అత్యధిక సంఖ్యాకులు "హిందువులు"గా కలిసిపోయి కూడా ఉండాలి. నేటి పార్శీలు మాత్రం జరాథుష్ట్ర మతాన్ని అవలంబిస్తూ వేరుగా ఉండి పోయారు.

సుమారుగా క్రీ. శ. 800 ప్రాంతంలో కొందరు ఇరాన్ దేశంవారు మహమ్మదీయుల నుండి తప్పించుకోవటానికి గుజరాత్ వచ్చి అక్కడ సంజాన్‌లో స్థిరపడి పోయారని కిస్సా— ఇ — సంజాన్ అనే పారశీక కావ్యం (రచయిత బహమన్ కయికోబాద్) చెబుతుంది. ఈ వలస జరిగింది క్రీ. శ. 716లో అని దస్తూర్ అస్సన్ దియార్జీ కందిన్ అనే అతను 1826 లో రాశాడుట. హోడీవాలా అనే పార్శీ చరిత్రకారుడు ఈ తేదీలని నమ్మరు. ఇరాన్‌నుంచి వలస వచ్చిన తేదీ క్రీ. శ. 992 అని ఆయన అభిప్రాయం.

జరాథుష్ట్ర మతం ఎప్పటిది? సుమారుగా బుద్ధుడి కాలానిదే అనే వారు చాలా మంది చరిత్రకారులు. ఇటీవలే (1973) సుప్రసిద్ధ సంస్కృత పండితుడు థామస్ బర్రో వివిధ సాక్ష్యాలని పరిశీలించి జరాథుష్ట్ర కనీసం క్రీ. పూ. 1200 ప్రాంతం వాడనీ, ఇంకా పాతవాడయి ఉండవచ్చుననీ నిర్ణయించారు. పంజాబు నుంచి టర్కీదాకా ఒక రకం భాష మాటలాడే ఆర్యులు ఉండేవారనీ క్రీ. పూ. 1000—2000మధ్య ఇరాన్ ఉత్తర ప్రాంతం నుంచి దక్షిణాదిగా వచ్చిన మతమే జరాథుష్ట్రుడిదనీ ఆయన అభిప్రాయం. ఇది 'మాగు' లనబడే అర్చకుల మతం అంటారు. జరాథుష్ట్ర మతంలో అగ్నిదే ప్రథమ స్థానం. ప్రాచీన ఇరాన్ మతం వైదిక మతానికి దగ్గరగా ఉంటుందన్న సంగతి చాలా కాలంగా గుర్తింప బడినదే. కాని దేవాసురులలో అసురులే "మంచి" వారు ఇరానీలకి!

అగ్నిని కాని, భూమిని కాని పంకిలం చెయ్యరాదనే ఉద్దేశంతో జరాథుష్ట్ర మతం వారు శవాలని తగల పెట్టరు. పాతిపెట్టరు. కుక్కకి చూపించి ఒక బావివంటి దానిలో పడేస్తారు. పక్షులు వాటిని తినేస్తాయి.

శ్రీమతి గాంధి భర్త ఫిరోజ్ గాంధి పార్శీ, కాని ఆయనని వైదిక కర్మల ప్రకారం దహనం చేశారు. శవాలని పారవేసే బావి పేరు

జలవిద్యుత్ కేంద్రం లేదా హైడ్రో ఎలెక్ట్రిక్ కేంద్రం పెట్టాడు ఆయన, అది ఇంకా బాగా నడుస్తోంది, దేశంలో కెల్లా పెద్దవాటిల్లో ఒకటి గోద్రెజి కూడా ఇటువంటి విజయాలు ఎన్నో సాధించాడు. ఆయన లాంటి పార్శీలు ఇంకా ఉన్నారు. వీళందరూ బ్రిటిషు వాళ వ్యతిరేకతకి ఓర్చి తమ విజయాలు సాధించేవారు – పార్శీలు మళ్ళీ బ్రిటిషు వాళ్ళతో స్నేహంగానూ ఉండేవాళ్ళు। జమ్‌షెడ్‌జీ తాతా బొంబాయి గవర్నరుతో చదరంగం ఆడుతూ ఉండేవాడు. ఆ గవర్నరుకి ఇష్టంలేని జాతీయ కార్యక్రమాలలో పాలుగొనేవాడు

ఒక సమాజంలో మీరు మార్గదర్శకులనుకోండి. మీకు ఆ సమాజం మీద నమ్మకం లేకపోతే మార్గదర్శకులుగా ఉండగలరా ? నమ్మకమే కాదు మీరు ఆ సమాజంలో పూర్తిగా ఇమిడిపోయి ఉండాలా లేదా ? అప్పటి రోజులలో కొందరు భారతీయులు నల్లదొరలుగా చెలామణి అయ్యేవాళ్ళు జమ్‌షెడ్‌జీ తాతా, గోద్రెజీలు ఇంతపనే చేసివుండవచ్చుకాని చెయ్యలేదు. చేసివుంటే, వాళకి ఎన్నో ప్రయోజనాలు కలిగి వుండేవి అయితే, వాళ్ళు ఆ పని చెయ్యలేదు. తమ సమాజంలోని వాళ ప్రేమాభిమానాలని మించిన ప్రయోజనం ఏమి వుంటుంది ? జమ్‌షెడ్‌జీ తాతా లాగే జె. ఆర్. డి తాతా కూడా ముందు భారతీయుడు, ఎప్పుడూ



జె ఆర్ డి తాతా

భారతీయుడే భారతదేశంలో నివసిస్తున్న పార్శీలలో ఒకాయన ఆయనకి ఒక పార్శీగా వుండటం ఎంత గర్వకారణమో భారతీయుడుగా వుండటం అంత గర్వకారణమే. ఇంకొకదేశంలో అయితే పార్శీ మతానికి చెందటం భారతదేశంలో లాగ గౌరవ చిహ్నంగా పరిగణింపబడదు. పార్శీగా ఉంటే "బయటివాడు"గా పరిగణింప బడతారు అలాంటివాళ్ళు.

భారతదేశంలో బయటివాళ్ళే లేరు – తాము బయటి వాళ్ళమనుకునే వాళ్ళు తప్ప. ఈ దేశంలో మహమ్మదీయులు వెనుకబడి వుండటానికి ఒక కారణం ఇదే; వాళ్ళు సమాజానికి దూరంగా వుండిపోయారు. పార్శీలు ఇలాగ దూరంగా వుండిపోలేదు ఒక సమాజానికి విడంగా వుంటూ అభివృద్ధి చెందటం ఎలాగ ? భారతదేశంలోని మహమ్మదీయులు తాము భారతీయ మహమ్మదీయులమంటారు. ఇది అర్థంలేని పేరు. పార్శీలు తాము భారతీయ పార్శీలమంటారా ? అనరు. తాము భారతీయులమంటారు. అంతే.

పార్శీలు వందేమాతరం పాడేవాళ్ళ ఊరేగింపులని అపుతారా ? అపరు. హిందువుల విగ్రహాలని విరక్కొట్టి తమ ఆలయాలు కట్టుకుంటారా ? కట్టుకోరు. అరబ్బుదేశాలు కొన్నింటి నుంచి చాటుగా తెచ్చిన ధనంతో బీదవారిని మతం మార్చటానికి ప్రయత్నిస్తారా ? ప్రయత్నించరు. తమ మతానికి ఏదో అపాయం కలుగుతోందని ప్రధానమంత్రికి మహజరులు పెట్టుకుం

(64 వ పేజీ చూడండి)

# అసురులు - దేవుళ్ళు (౯)

"దఖ్మ". ఒకప్పుడు ఇరాన్‌లో జరాధుష్ట్రులు సంపూర్తం దహనం చేసేవారని "దఖ్మ — దహన —" నిరూపిస్తుందని కొందరి నమ్మకం. దర్యనాష్ (ఇంగ్లీషులో డేరియస్) మొదలయిన ఇరాన్ సమ్రాట్‌లు జరాధుష్ట్రమతం వారే కాని వారిని ఖననం చేసే వారు ! వేదాలలో శవాలని దహనం, ఖననం, చెట్లలో భద్రపరచటం, జంతువులు — పక్షులకి వెయ్యటం సరయిన పద్ధతులే అని చెప్పబడి ఉందిట. అర్జునుడు శవాకారంలో పాశుపతాస్త్రాన్ని దాస్తాడు కదా ? )

వరాహమిహిరుడు, బాణుడు, మయూరుడు మొదలయిన వారు మాగ బ్రాహ్మణులు. అంటే ఇరాన్ నుంచి వలస వచ్చిన వారి సంతతి వారుట ! శ్రీ కృష్ణుడు తన కొడుకు సాంబుడిని కుష్టు రోగిని కమ్మని శపించినప్పుడు. సాంబుడు రోగం పోగొట్టుకొనటానికి సూర్యుడికి ఆలయం కట్టించాలనుకున్నాడుట. మామూలు బ్రాహ్మణులు ఎవరూ అతనికి సాయం చెయ్యలేదుట.

అప్పుడు కొందరు మాగ బ్రాహ్మణులు తోడ్పడి నేటి ములుస్తాన్ (పాకిస్తాన్‌లో ఉంది)లో ఒక సూర్యాలయం కట్టించారుట.

కొందరు చరిత్రకారుల సిద్ధాంతాల ప్రకారం పంచపాండవుల పేరులు కొన్ని ఇరాన్ తెగలవే— ఆ తెగలకి చెందిన వారు కొందరు తమ పేరులు భారతంలోకి ఇరికించుకున్నారుట ! మహాభారత యుద్ధానికీ ఈ పేరులు కలవారికీ సంబంధం లేదుట! క్షత్రియ కులంలో వాడుకలో ఉన్న పూరి, సలూజా మొదలయిన పేరులు కూడా ఇరానీవేనని ఇటువంటి సిద్ధాంతాలు చెప్పే వారు అంటారు.

ద్రావిడులు, ఆర్యులు కూడా ఇరాన్ ఉత్తర ప్రాంతం నుంచి వచ్చినవారేనన్న సిద్ధాంతానికి మంచి ప్రాచుర్యం ఉంది· దక్షిణ భారతదేశంలో ఎక్కువగా, ఉత్తరాదిలో కొంచెం తక్కువగా కనిపించే, రాక్షసిబండలనబడే ప్రాచీన సమాధులు ఇరాన్ ఉత్తరాన ఉన్న 'సియాల్క్' అనే చోటునుంచి విస్తరించాయని కొందరు పురాతత్వ శాస్త్రవేత్తలు అంటున్నారు. (కొమర్రాజు లక్ష్మణరావు గారు ఆర్య, ద్రావిడ భాషల సంబంధాన్ని గురించి చేసిన వూహలకి ఈ సిద్ధాంతం చక్కగా కుదురుతుంది! ) ఆంధ్రులు ఇంద్రోపాసకులయిన ఇరాన్ వారని ఒక వాదం... శ్రీ



# పెంకుటిల్లు

కుమారి యం. సుదర్శన బాయి

మధ్యాహ్న సమయము. వేసవికాలము మే నెల ఎండ ఉధృతముగా ఉంది. భోజనము ముగిసిన గుర్తుగా విశ్వనాధరావు గారు పైమీది కండువాతో మొహం తుడుచు కుంటూ వచ్చి కూర్చున్నారు. అద్దాలు సరి చేసుకుని ఉదయమే హెడ్డింగులు చదివి వదిలేసిన దినపత్రిక ఎత్తుకున్నారు

"ఏమండోయ్ ఇద్ది కాస్త చదవరూ" అంటూ వచ్చి కుర్చీపక్కనే నేలమీద చతికిల పడింది అర్ధాంగి పార్వతమ్మ.

ఆమె చేతిలోని కవరు చూస్తూనే అర్థమైంది రావుగారికి అది సుపుత్రుడు ఉదయ్ కుమార్ నుంచి వచ్చినదని అందు లోని సారాంశము అతనికి కంఠతాయే. అందు కునే ప్రయత్నము చేయక నిర్లిప్తముగా ఉండిపోయేరు.

"ఇదిగో చదవండి" అంది ఉత్సాహముగా ఆమె.

"ఊఁ" అని నిట్టూర్చి పత్రిక పక్కన పెట్టి కవరందుకున్నారు విశ్వనాధరావుగారు.

"గట్టిగా చదవండి" అంది శ్రద్ధగా పార్వతమ్మ

"అలాగే" అని కొంచెము గొంతు పెంచి గట్టిగా చదివేది మొదలు పెట్టారు ఆయన.

పూజనీయులు నాన్నగారికి,

మీ అబ్బాయి ఉదయ్‌కుమార్ నమస్క రించి వ్రాయునది దేవుని కృపవలన అమ్మా మీరు క్షేమమే ననుకుంటున్నాను. ఇక్కడం దరూ క్షేమమే! ఉత్తరము వ్రాసినా పాప బారసాలకు మీరు రాలేదు. మీ కోడలు చాల బాధపడింది. ఎన్నిసార్లు వ్రాసినా ఆ పెంకు టిల్లును మీరు వదలి రారా? మీతోపాటు అమ్మ ఇంకెన్నాళ్ళు కష్టపడుతుంది. ఈ వయసులో మీకు అక్కడ చేయాల్సిన పను లేమున్నాయి? మీరు త్వరలో రావాలి. ఎప్పుడు వస్తారో వ్రాస్తే నేను వచ్చి రిసీవ్ చేసు కుంటాను. బాబు, శ్యామల మిమ్మల్ని, అమ్మను ఎప్పుడు తలుస్తూ ఉంటారు. అమ్మకు మీ కోడలు నమస్కారందచేయ మంది. ఇదే టెలిగ్రామ్‌గా భావించి ఉత్త రము వ్రాయండి, అమ్మకు నమస్కారములు.

ఇట్లు
—ఉదయ్‌కుమార్"

చదవడము ముగించి కవర్ టేబుల్ మీద పడేసారు రావుగారు. ఆయన మొహమంతా గంభీరంగా ఉంది. మళ్ళీ దినపత్రిక అందు కుని చదవడములో మునిగిపోయారు.

పార్వతమ్మ "ఏమండీ" అంది.

"వాడు ఇప్పటికి ఎన్ని ఉత్తరాలు వ్రాస్తు న్నాడు. బారసాలకు కూడా వెళ్ళలేదు" అంది.

"........."

ఆమె అసహనముగా "మీకేమి పట్టదు. కాని, ఒక్కగానొక్క కొడుకు వాడు నాకు చూడాలని వుంది. మీ వుద్దేశమేమిటో నాకు

అర్థముకావడం లేదు. జీవితాంతము ఈ పెంకుటిల్లునే అంటిపెట్టుకునే వుండాలా" అంది ఆవేశముతో.

"పా..ర్వ..తి" రావుగారి కంఠము ఖంగుమంది. తనేమి అందో అర్థమైంది. ఆమెకు.

ఆమె తీర్మానిస్తున్నట్లు "అక్కడే వుండిపోవాలని నా వుద్దేశము కాదు. ఉదయ్‌ని చూసి ఎన్నేళ్ళయిందో మీకు తెలియంది కాదు. వాడా రాలేదు. మీరు రిటైర్ అయిపోయేరు. ఇక్కడ వుండి చేసేదేవుంది మంచి ముహూర్తము అడిగేసి వస్తాను..." అంటూ పక్కింటి శాస్త్రి ఇంటికి దారితీసింది.

కొడుకు పెంకుటిల్లు అని వ్రాసినందుకే బాధగా వుంది. రావుగారికి భార్య అదే అనడంతో గుండె పట్టేసినట్టయింది. ఆమె నిర్ణయము హతాశుణ్ణి చేసింది. తన బాధ ఎవరికి చెప్పినా మూర్ఖత్వం క్రింద కొట్టేస్తారు ఎలా చెప్పాలి ఆమెకు? ఇక్కడనుండి కదలాలంటే ససేమిరా మనసు ఒప్పుకోవడంలేదు. ఈమె చూస్తే ప్రయాణము కాందే వదిలేటట్టులేదు. ఇప్పటికే చాలమంది అడగనే అడిగారు "మేష్టారూ ఒక్కగానొక్క కొడుకు దగ్గటికి వెళ్ళి హాయిగా వుండక ఈ వయసులో ఇక్కడెందుకు? ఇల్లు అమ్మేసి వెళ్ళిపోండి" అని.

భార్యకు మల్లే తనకూ కొడుకును చూడాలనే వుంది కాని ఈ ఇంటిని వదిలేసి తనూ ఒక్క నిమిషము గడపలేదు. అలాంటిది శాశ్వతముగా అమ్మేసి వెళ్ళిపోవడమా? ఉహుం తను వెళ్ళలేడు. మనవలతో కలసి చిన్న పిల్లాడిలా ఆడుకోవాలని వుంది. తను చెమటోడ్చి పైసా, పైసా జమచేసి కట్టిన ఆ ఇంటిని, అందులో తన చేతులతో నాటిన ప్రతిచెట్టు, తీగలకు దూరంగా ఒక్క క్షణమైనా నిలవలేడు. అందుకే ఆయన వెళలేడు. కొడుకుకు వచ్చేదానికి వీలుకాదు. పోనీ భార్యనైనా పంపుదామంటే ఆమె ఇంత వరకు ఒక్కర్తీ ప్రయాణము చేయలేదు. ఒప్పుకోదుకూడ. ఈ విధముగా సాగిపోతున్నాయి ఆయన ఆలోచనలు.

ఎప్పుడు వచ్చిందో "ఎల్లుండి దివ్యంగా ఉందట ఆ రోజు వెళ్దామండి" అని చాప పరిచి "విశ్రాంతి తీసుకోండి నాకు పనుంది" అంది.

"ఇప్పుడేమిటి పని" రావుగారు ఆశ్చర్యంగా చూశారు.



మనవి

డాక్టర్ సలహాలు, ప్రశ్నావళి శీర్షికలకి ప్రశ్నలు పంపేవారు తాము పంపే శీర్షిక పేరు రాసి కేరాఫ్ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగర్, విజయవాడ – 520003 అన్న చిరునామాకి పంపాలి. రాసిన వారి పూర్తి పేరు, చిరునామా యివ్వడం ఎంతైనా అవసరం. —సం.

# పెంకుటిల్లు

ఆమె బుగ్గమీద కుడిచేయి ఆనించి "పిల్లలున్న ఇంటికి ఉత్త చేతులతో వెళ్తారా? ఏమిటి?" అని నవ్వుకుంటూ లోపలికి వెళ్లింది.

ఎలాగైనా ఆమెకు నచ్చచెప్పాలి అనుకుంటున్న రావుగారికి ఆశాభంగమైంది. ఆయన మనసులాగే ఎండ చిటపటలాడుతోంది.

కొడుకును, కుటుంబాన్ని చూడబోతున్నాను అనే ఆనందము కంటే మళ్లీ ఈ ఇంటిని, చెట్లను ఎప్పుడు చూడబోతానో కదా అనే దిగులుతో! కళ్ళు మూసుకున్నారు బలవంతముగా.

సాయంత్రము అయిదయింది.

ఎండ తీవ్రత కొది కొద్దిగా తగ్గుతోంది ఇంతవరకు తన ప్రతాపాన్ని చూపిన ప్రభాకరుడు ఇంకా పూర్తిగా అదృశ్యమైపోలేదు. మునగ చెట్టు క్రింద నిలబడి ఉన్నారు రావుగారు. పొద్దుటనుండి కాసిన ఎండకు చెట్లన్ని వాడిపోయి కళావిహీనమైనాయి. వరుస క్రమములో ఉన్న రోజాలన్ని రాజు ముందు సైనికుల్లా తల వంచేసుకున్నాయి ఆ స్థితిలో ఉన్న ఆ మొక్కలు 'మమ్మల్ని విడచి నీవు వెళ్ళిపోతున్నావా?' అని ప్రశ్నిస్తున్నట్టు భ్రమ కలుగుతోంది ఆయనకు ప్రతి చెట్టు ఆకులను, పూలను, తీగలను పరామర్శిస్తూ తిరుగుతున్నారు రావుగారు ఆ తిరగడంలో సమయమెంత గడిచిపోతూందో ఆయన గమనించడమేలేదు. కళ్ళులేని కబోది తన రక్తం పంచుకుపుట్టిన పిల్లలను ఎలా తడిమి, తడిమి చూస్తారో అలా చూస్తున్నారు. మళ్లీ మునగచెట్టు క్రింద వచ్చి నిలబడి సుదీర్ఘంగా ఇంటికేసే చూస్తూ నిలబడ్డారు.

ఇంట్లో నుండి పార్వతమ్మ ఓ చేతో చిన్న స్టీల్ ప్లేట్‌ను, ఇంకొక చేతో మంచి నీళ్ళగ్లాసును పట్టుకువచ్చి "తీస్కోండి" అంది కుడి చేతిని ముందుకు చాచి.

నాలుగు రకాల పిండి వంటలనీ సంభ్రమంగా చూస్తూ "ఇవన్నీ ఎప్పుడు చేసేవు" అన్నారు.

"ముందు మీరు తీసుకోండి" అంది ఇంకాస్త చేయిని చాపి. అపుడు అర్థమైంది, మధ్యాహ్నము ఆమె 'ఏమండి' అని లోపలికి వెళ్లిపోయిన సంగతి.

అలాగే నిలబడిన ఆయనతో చిన్న చాప ముక్క పరిచి "కూర్చొని తినండి ఎలా వున్నాయో" అంది.

ఆయన ఇంకా తినకనే "నీవు చేసినవి బావుండక పోవడమా! అద్భుతంగా వుంటాయి" అన్నారు మనస్ఫూర్తిగా.

భర్త ఆ చిన్న పొగడ్తకే పొంగిపోయింది పార్వతమ్మ. మళ్లీ గుర్తు చేసింది తినమంటూ;

అవితిని రుచి చూసే ఓపిక లేకపోయినా కూర్చొని అందులో వున్న మైసూర్‌పాక్ ముక్క కొద్దిగా తుంచి తిన్నారు. ఇంకొక వంట కొద్దిగా రుచి చూసి పళ్లెము పక్కన పెట్టేసి గ్లాసెత్తి నీళ్ళు త్రాగి కండువాతో పెదాలు అద్దుకుని మళ్లీ పూర్వపు ఆలోచనలో పడిపోయారు.

లోపల దీపం పెట్టివచ్చి "అయ్యో ఏమి తినలేదే మీరు" అంది నొచ్చుకుంటూ.

"వచ్చేవయసా పోయేవయసా" అన్నారు.

ఆమె మరేం మాట్లాడక ప్లేటు, గ్లాసు తీసుకుని వెళ్ళిపోయింది.

రిటైర్ అయ్యేక అతనికి ఆ చెట్లు, తీగలు, పూల మొక్కలే స్నేహితులు. ఆయనకు వాటిమధ్య తిరుగుతూవుండటమే కాలక్షేపము. ఎప్పుడూ నీళ్ళుపోస్తూ, గొప్పులు తీస్తూ 'ఇదే నా ప్రపంచం' అన్నట్లు తిరుగుతూ వుంటారు. ఈ రోజెందుకో మరీ ఎక్కువైపోయింది వాటి మీద ప్రేమ.

బాగా చీకటి పడిపోయింది. ఇంకా అలాగే పూల చెట్లలను చూస్తూ కూచుని వున్నారు. ఏ, ఏ మొక్కలను ఎప్పుడెపుడు నాటారో, అవే విధముగా వృద్ధిలోకొచ్చాయో గుర్తు చేసుకుంటున్నారు.

పార్వతమ్మ వచ్చి నిల్చున్నా అతనీలోకంలోకి రాలేదు "భోంచేద్దురు లేవండి ఎనిమిదయింది" అంది.

ఆయన లేచే ప్రయత్నం చేయలేదు.

మధ్యాహ్నము గమనించలేదు కాని అతనిలో ఏదో మార్పు వచ్చిందని గ్రహించింది పార్వతమ్మ. "అసలేమిటి మీ బాధ" అంది.

"ఏం లేదు పార్వతి మనం వెళ్ళాక నీళ్లెవరు పోస్తారా అనే ఆలోచిస్తూంట" అన్నారు

ఏదో పిచ్చి ప్రశ్న విన్నట్టు నవ్వింది పార్వతమ్మ. "మన పద్మా లేదూ, ఇంతేనా లేవండి...లేవండి అన్నం చల్లారిపోతుంది" అంటూ లోపలికి దారితీసింది.

(60వ పేజీ చూడండి)

# వారఫలం

–1983 శుక్రవారం మొదలు
–1983 గురువారం వరకు

♈ **మేషం:** 'చాలమంది ఈరాశి వారు, తమ అంచనాలు తారుమారు అయినాయి' అనుకొంటారు. పెద్దల అనుభూతి సంపాదించుటకు, గ్రామంలో, పట్టణంలో పెద్దరికం పొందుటకు అవకాశ మున్నది. స్త్రీలకు: ధనాదాయం, వృత్తియందభివృద్ధి చేకూరుతుంది.

♉ **వృషభం:** మీ కార్యక్రమం కుంటు పడకుండా జరిగి పోతుంది ధనాదాయ మున్నది. కలవారి సంబంధం కలుపుకోవాలని ఉబలాటం ఉంటుంది. ఉత్సాహంతో వ్యాపార నిమిత్తం ప్రయాణించ గలరు. అవకాశ వాదులకు తావివ్వకండి. స్త్రీలకు: వృత్తియందభివృద్ధి, ధన వృద్ధి గలవారం.

♊ **మిధునం:** చాల విలువైన వస్తువులు సేకరించుకొని గలుగుతారు. ప్రయత్న లోపం లేకుండే ధన లబ్ధికి అవకాశం గలదు. గ్రామ పెద్దరికంలో పేరు తెచ్చుకొనే అవకాశ మున్నది. అభివృద్ధి అన్ని రంగాలలో కనిపిస్తుంది. స్త్రీలకు: చాలమంది ఉద్యోగ రీత్యా కావించిన ప్రయత్నాలు ఫలవంతం కాగలవు.

♋ **కర్కాటకం:** వృత్తి రీత్యా మీకు మేలు సమకూడుతుంది. మతి మరపు వలన పోగొట్టు కొనిన వస్తువులను మరలా సేకరించుకొన గలుగుతారు. ప్రతిష్ఠ హెచ్చే అవకాశ మున్నది. నల్గురలో పేరు ప్రతిష్ఠ లుంటాయి. స్త్రీలకు: ఆదాయం, ఉద్యోగంలో నూతన మార్పు.

♌ **సింహం:** చుట్టు ప్రక్కల వారితో గొడవలు రాకుండా చూచుకోవాలి. యథా ప్రకారం మీకు అయివోజు సమకూరుతుంది. మీ ఆలోచనలు సత్ఫల దాయకాలు కాగలవు. ఈరాశివారు చాల మంది ఆరోగ్య విషయంలో ఎంతో జాగరూకత వహించాలి. స్త్రీలకు: ప్రయాణాల హడావుడితో కాలం జరుగుతుంది. ఉద్యోగ మార్పు చేకూరుతుంది.

♍ **కన్య:** ధనాదాయ మున్నది. దాయాదుల వలన మిత్రుల మూలాన ఏదైనా ఘర్షణ రావచ్చు, జాగ్రత్త. చాలమందికి రాజకీయంగా బాగుండ గలవారం. చేసిన ప్రయత్నాలు ఫలితానికి రాగలవు. స్త్రీలకు: ఉద్యోగ సంబంధంగా నూతన ప్రయత్నాలు ఫలితానికి రాగలవు. అవకాశ వాదులు చుట్టు చేరుతారేమో, జాగ్రతగా గమనించాలి.

♎ **తుల:** మీలో పిరికితనం ఏర్పడ వచ్చు. చేసిన ప్రయత్నమే మరలా చేయవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి. ఆదాయం క్రమంగా అభివృద్ధి పంద గలదు. ఏడున్నర సంవత్సర 'శని' ప్రభావితులు కావటం మూలాన కొన్ని వ్యవహారాలు నెత్తికి వస్తాయి. స్త్రీలకు: ఆదాయం, వృత్తి యందు అభివృద్ధి చేకూరుతుంది.

♏ **వృశ్చికం:** చాల మంది యింటిని అభివృద్ధి చేయటమో, నూతన నిర్మాణాలకు దిగటమో, యత్నింప గలరు వృత్తి ఉద్యోగాలందు మీకు పేరు ప్రతిష్ఠలు రాగల సన్నివేశా లుంటాయి. స్త్రీలకు: అప్రయత్నంగా ధనాదాయ మున్నది. ఒకానొక విషయం సులభంగా నెరవేర గలదు.

♐ **ధనుస్సు:** వ్యాపారంలో యథా ప్రకారానికి ఎలాంటి లోటు లేదు. నూతన వ్యవహారాలలో జోక్యం ఉంటుంది. నూతన వ్యాపారానికి ప్రయత్నాలు జరుగుతాయి. కొందరకు సభా గౌరవానికి, పత్రికా గౌరవానికి అవకాశం ఏర్పడనున్నది. స్త్రీలకు: ఆరోగ్య విషయంలో జాగ్రత్త పడాలి. వస్తు వాహనాలు కొనుగోలు చేస్తారు.

♑ **మకరం:** ధన లోపం లేదు గాని, అధిక వ్యయానికి గురి కావలసి వస్తుంది. నూతన ప్రయత్నాలు ఫలిస్తాయి. గమనించి మెలగండి. అవసరాలకు అప్పుసప్పులు చేయవలసి రావచ్చు. స్త్రీలకు: అన్ని ముఖ్య రంగాలలో సదవకాశాలు లభింప గలవు. కొందరకు ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి.

♒ **కుంభం:** సులభంగా మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మీలో కొందరకు ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన ప్రయత్నాలు ఫలవంతం కానున్నవి. గ్రహించి జాగ్రత్త వహించాలి. స్త్రీలకు: నాలుగు రంగాలలో మీకు ప్రసిద్ధి రాగల అవకాశాలుంటాయి.

♓ **మీనం:** చాల మంది చేసే ఉద్యోగ ప్రయత్నాలు ఫలితానికి రాగలవు. నూతన వ్యవహారాలలో జోక్యం కలుగ జేసికో గలరు. కొందరకు కళా సాహిత్య రంగావకాశాలు లభిస్తాయి. కొందరు ఉద్యోగంలో ప్రమోషన్ ఆశింప దగిన వారం. స్త్రీలకు: సాహిత్య కృషి సత్ఫల దాయకం కాగలదు. ఉద్యోగాభివృద్ధి కనిపిస్తుంది.

— *విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి* ★

# వ్యక్తిగతం



అనిల్ శ్రీకృష్ణ కాళెపోలియో వల్ల కాళ్లు పడిపోయిన పది సంవత్సరాల చిరంజీవి. ఇతను తనతో ఆడుకుంటున్న చిరంజీవి సోనాలీగాంధీని సమీపించిన ఒక విషపు పాముని తను నడవటానికి వాడే కర్రతో కొట్టి చంపేశాడు. అతని ధైర్య సాహసాలకి మెచ్చి ప్రధానమంత్రి శ్రీమతి గాంధీ అనిల్‌కృష్ణకి జాతీయ బహుమతి ఒకటి ఇచ్చారు. అనిల్‌కృష్ణ ఊరు మహారాష్ట్రలోని తాలెగాంవ్.



స్టెఫీగ్రాఫ్ చాలా పెద్ద టెన్నిస్ క్రీడాకారిణి కాగలదని వ్యాఖ్యాతలే కాదు ఆమె తలిదండ్రులు కూడా నమ్ముతున్నారు. పశ్చిమ జర్మనీలోని మాన్‌హెయిమ్‌కి చెందిన ఈ అమ్మాయికి తరిఫీదు ఇవ్వటానికి నెలకి 5000 మార్కులు (ఒక మార్కు సుమారు నాలుగు రూపాయలు అనుకోవచ్చు) కర్చు అవుతోందిట ...



ఫ్రాన్సు దేశపు సినిమా తార బ్రిజిత్‌బార్డో తన పిల్లిని ఒకవ్యక్తి అమ్మే వనిత చంపిందని కేసు పెట్టింది. ఆ సందర్భంలో కోర్టుకి హాజరయినప్పుడు తీసిన ఫోటో. 'సెక్స్' చిహ్నంగా పేరు పొందిన ఈమె జంతువుల హింసని బాగా ప్రతిఘటిస్తూ ఉంటారు. తమ వివాహం చెడిపోవటానికి పత్రికలలో అతి ప్రచారం జరగటమే కారణం అని ఆమె అభిప్రాయంట ...




**4**

*(గత సంచిక తరువాయి)*

ఆ రాత్రి ఎంతో ప్రేమతో నీరజను దగ్గరగ తీసుకున్నాడు. నీరజకు ఇన్నాళ్ళు పడ్డ శోకమంతా మాయమైంది.

"మీ నాన్నగారు పోయేరని తెల్సి నేను, అమ్మ ఎంతో విచారించేము. అమ్మ వెంటనే వద్దామనుకుంది కాని ఇక్కడ నాకు చేసే వాళ్ళుండరని మానివేయ వల్సి వచ్చింది."

"అన్నట్లు— మీ కాలు నొప్పి ఎలాగుందండి?"

"ఇప్పుడు ఆ బాధ లేదు. ఏదో కాస్త నొప్పిగా ఉంటుంది తొందరగ నడుస్తే, లేకపోతే ఆ బాధే ఉండదు."

"పాపం ఎంత బాధ పడ్డారో !"

"కాలుజారి పడితే అంతే మరి"

తరువాత తన మామగారు ఎలా పోయింది అన్ని వివరాలు తెల్సుకున్నాడు ఎంతో సానుభూతితో. అట్లాంటి సహృదయుడైన భర్తను వేరే విధంగ అనుకోవడంలోని తన తెలివి తక్కువ తనానికి నొచ్చుకుంది. జీవితంలో తనకు మరేలోటు ఉండదనుకుంది. తండ్రిలేని లోటును భర్త తీరుస్తాడను కుంది.

అత్తగారు నీరజ వచ్చిన ఆ వారమంతా ఎంతో సానుభూతితో ప్రవర్తించింది. వియ్యంకుడు పోయినందుకు తను ఎంతగ దుఃఖించిందో వివరించింది.

"అబ్బాయి ఎంతో బాధ పడ్డాడు. అవాళ వీధి గుమ్మం దిగుతుంటే కాలుజారి పడ్డాడు. కాలు బెణికిపోయి ఇంత వలం వాచిపోయింది. ఏ వెధవలో వీధి మెట్లమీద నీళ్ళు పోస్తేరు. పాపం ! రెండు రోజులు ఆఫీసుకు వెళ్ళలేక పోయేడు. రోజూ అనే వాడు 'నీరజ అక్కడ ఏం యిబ్బంది పడ్తోందో,' అని."

"మా నాన్నగారి ఆరోగ్యం మా అమ్మ పోయిన నాటి నుండి అంతంత మాత్రమే. నా పెండ్లి అయే వరకు ఎలాగో ఆ ప్రాణాన్ని నిలబెట్టుకున్నారు. ఆ తరువాత అతనికి ఏ కాంక్ష లేకపోయింది. ఆ ఒంటరి జీవితం బాధాకరమే. నాకు తండ్రి లేడని నేనెక్కువ బాధ పడడం లేదు — తల్లిలా మీరు ఆదరిస్తుంటే నాకాలోటే తెలియడం లేదు."

"అంతేనమ్మ," అని పొడిగ అనేసి సుబ్బాయమ్మ ఏదో పనిమీద పెరటిలోకి వెళ్ళింది.

నీరజ కాస్సేపు గదిలో అలాగే కూర్చుంది. చటుక్కున నీరజకు ఏదో తట్టింది. తన పెట్టె తాళం తీసి, పెట్టె తెరిచి భర్త మోహనరావు తనకు వ్రాసిన లేఖను తీసి చదివింది. అందులో ఈ అంశాన్ని మళ్ళీ చదివింది.

"రెండు రోజుల క్రితం నేను నూతి వద్ద జారిపడ్డాను. కుడిపాదం బెణికి చాల వాచిపోయింది," అని మోహనరావు వ్రాసేడు.

అత్తగారేమో వీధి మెట్లమీద జారిపడ్డాడు అంటూంది. ఇంతకీ ఎవరు నిజం చెప్పేరు? వెంటనే గుండె ఆగినంత పనయింధి— "లేక ఇద్దరూ అబద్ధ మాడుతున్నారా— ఎందుకని ?" మళ్ళీ సందేహాలు, అనుమానాలు నీరజను ఆవరించేయి. నీరజ తిరిగి వచ్చి వారం రోజులైంది.

ఆ రాత్రి గదిలో భర్తతో చేరినప్పుడు గోముగ అంది ఎడమ పాదం ఒత్తుతూ, "ఇంకా పాదం కాస్త వాపుగ ఉన్నట్లుంది. అమృతాంజనం వ్రాద్దునా ?" మోహనరావు చిరునవ్వుతో— "ఏం ఒద్దులే— ఇప్పుడేమి బాధలేదు," అన్నాడు. నీరజకు ఇంకా సందేహం వదలక— "ఎడమ పాదం ఒక్కటేనా లేక ఈ కుడిపాదం కూడ నొప్పి చేసిందా," అని కుడిపాదం కూడ నిమిరింది.

"లేదు ఆ ఎడమ పాదమే. పిచ్చిదాన నీకు నా మీద ఎంత ప్రేమ !" అని తన గుండెమీదకు నీరజను లాక్కున్నాడు. నీరజకు ఆ హృదయం మీద హాయి కల్గలేదు. ఆ రాత్రి సరిగ నిద్ర కూడ పట్ట లేదు. మోహనరావు ఎందుకు అబద్ధం ఆడేడు ? తనను మభ్యపెట్టవల్సిన అవుసరం ఏమొచ్చింది ?

---

**జరిగిన కథ—2:** నీరజ తండ్రి పురుషోత్తం. తల్లి పాము కాటుకు గురై మరణిస్తుంది. నీరజ ఇంటర్ వరకు చదివి ఆపైన స్తోమత లేక ఆపేసింది. వున్న ఒక్క అన్నా మిలటరీలో చేరిపోతాడు. తండ్రి చేస్తున్న స్కూలు టీచరు ఉద్యోగంలోంచి రిటైరవుతాడు. నీరజకు వచ్చిన సంబంధాల్లో తండ్రికి నచ్చక కొన్ని జాతకాలు కలవక ఒకటి తప్పిపోతాయి. చివరకి దూరపు బంధువొకాయన సహాయంతో ఓ రెండో పెళ్లి వాడితో నీరజ పెళ్లి చేయుటానికి నిశ్చయించుకొంటాడు ఆమె తండ్రి. నీరజ పెళ్లి మోహన్ రావ్‌తో జరిగిపోతుంది. ఆ తర్వాత ఆమె తండ్రి మరణిస్తాడు.

---

మొదటిసారిగ మోహనరావుపై తనకున్న గాఢ నమ్మకం కాస్త సడలింది. అంతలోనే మనస్సును సమాధానపర్చుకుందుకు ప్రయత్నించింది. బహుశా అతనికి వేరే ముఖ్యమైన పనులుండి వెదురుపాడు రాలేకపోయుండొచ్చు. తను బాధ పడతానని ఆ విధంగ చెప్పి ఉండొచ్చు. ఏమైన కంట్లో చిన్న నలక పడ్డట్టే.

* * *

"ఏమోయ్ ఏమా కలలు ? నేను రావడమే గమనించలేకున్నావు," అని అప్పుడే డ్యూటీకి వచ్చిన కాంతం నీరజను కుదిపింది.

గోడకు చేరబడి కండ్లు మూసుకుని తన గత జీవితాన్ని నెమరు వేసుకుంటున్న నీరజ గతుక్కుమని కండ్లు తెరచి కాంతాన్ని చూచింది.

"ఏమీ లేదే— ఏదో అలా నిద్ర ముంచుకొచ్చింది. టైమెంతయిందేమిటి— లేక ఇవాళ తొందరగ వచ్చేసావా ?"

కాస్త కాస్త బిడియపడూ నవ్వింది కాంతం

"పదకొండుపావు— పదిహేను —నిముషాలు మాత్రమే లేటు. మరోలాగనుకోకు."

"పదిహేను నిముషాలేగా— ఏమంత పెద్ద లేటు కాదులే. ఇంతకీ మరోలాగనుకోవడం ఏనాడో మానుకొన్నాను."

"పోవోయి— నువ్వెప్పుడూ ఇంతే," అని సన్నగ నవ్వింది.

"అన్నట్టు— కాంతం. ఇవాళ రెండు కొత్త కేసులు వచ్చేయి. రెండూ సీరియస్ కేసులే. పాత కధే— ఆడది కాఫీ కాస్తుంటే స్టౌ మంటలు చీర నంటుకుని శరీరాన్ని కాల్చేయి. ఆమెను రక్షించబోయి ఆమె భర్త ఒళ్ళు కాల్చుకున్నాడు. అదిగో ఆ నాలుగో నంబర్ బెడ్ మీద ఉన్న ఆవిడే. ఆవిడపేరు వసుమతి. అతడు అదిగో ఆ మేల్స్ వార్డులో ఏడో నంబరు బెడ్‌మీదున్నాడు. అతడి పేరు బాబ్జి. ఆమెకు ఈ రాత్రి గడవడం కష్టం. ఆమె చచ్చిపోయేముందు తెలివివస్తే ఏమైన చెప్తుందేమో కనిపెట్టుకుని ఉండు. అతడు ఫరవా లేదు. ఈ హాస్పటల్‌లో ఓ వారం రోజులుంటే కోలుకొంటాడులే. ఈ రాత్రికి వాళ్ళకి మరే మందు లివ్వనవుసరంలేదు. ఇంతే సంగతి. మరి నే వెళ్తాను కాంతం, నిద్ర వస్తూంది," అని నీరజ వస్తూ ఒకసారి ఆ యువతి వద్దకు వెళ్ళి జాగ్రత్తగ చూసి వెళ్ళిపోయింది రెస్టు రూములోనున్న తన భోజనం కారియర్ను, తన హేండుబాగును తీసుకుని.

నీరజ ఉంటున్న ఇల్లు హాస్పటల్‌కి ఓ ఫర్లాంగు దూరములో ఉంది నాలుగు వీధుల అవతల. సాధారణంగ నీరజ నడచుకునేపోతుంది ఇంటికి. ఆ రాత్రి మనస్సు అదోలా ఉండి రిక్షాలో పోయింది.

ఇంటికి చేరి పక్క సర్దుకుని పడుక్కుందుకు యత్నించింది. ఓ గంట గడిచినా నిద్ర రాలేదు. లేచి బీరువాలోని రెండు సోనారిల్ టాబ్లెట్లను తీసి వేసుకుంది. కాస్సేపటికి మెల్లగ నిద్రలోకి జారుకుంది.

నిద్దట్లో ఓ కల వచ్చింది నీరజకు.

ఆ పెద్దావిడ హడావుడిగ హాస్పిటల్‌కి వచ్చింది. నీరజ డ్యూటీలో ఉంది. రాగానే వెంటనే వార్డులోకి వెళ్ళి డ్యూటీలో ఉన్న నర్సు నీరజను అడిగింది —

''మా అబ్బాయి బాగున్నాడా ? మా కోడలు ఎలాగుంది ?'' నీరజ గాభరాపడింది.

''పెద్దమ్మగారు ! మీరు గుండెను గట్టి చేసుకుంటే మీకో దుర్వార్త చెప్పాలి.''

''ఏమా వార్త – నా కోడలు చనిపోయిందా ? పాపం అప్పుడే పోతుందనుకున్నాను. పోనీ మరేం చేస్తాం. మరో కోడల్ని తెచ్చుకుంటాను, ఆమె లేని లోటును భర్తీ చేయడానికి. ఏదీ దాని శవం, తీసుకుపోతాను. అబ్బాయి ఏం చేస్తున్నాడు ?''

''అది కాదండి – మీ అబ్బాయే చనిపోయేడు. మీ కోడలు బ్రతికిపోయింది. అదిగో మీ కోడలు వస్తూంది.''

ఆమె కోడలు ఒళ్ళంతా కాలి మసిబారి నల్లగ ఉంది. నవ్వుతో వస్తూంది. ఆమె చేరువ కాగానే పెద్దావిడ భోరుమని ఏడవడం మొదలెట్టింది.

''అత్తగారు ! ఏడవకండి. పోయేవాళ్ళ కోసం యేడుస్తు కూర్చుంటే మన బ్రతుకెలా సాగుతుంది. అతనికి ఆయుష్షు చెల్లిపోయేడు. మీరు మరోలా గనుక్కోకపోతే నేను మళ్ళీ పెండ్లి చేసుకుని మీకు కొడుకు లేని లోటుని తీరుస్తాను. మీరు నా తరువాత భర్తకి తల్లిగా వ్యవహరించవచ్చు. అలాగైన మీ దుఃఖాన్ని మీరు పోగొట్టుకోవచ్చు – ఏమంటారు ?''

ఆ పెద్దావిడకి కోపం వచ్చింది –

''నీ మొగుడు నాకు కొడుకెలా అవుతాడే ముండా. నువ్వే మా వాడ్ని చంపేసావు. ఏడీ నా కొడుకు ?'' అని ఆ కోడలుమీద విరచుకుపడింది.

''ఏవండి – ఇది హాస్పిటల్, మీరలా కేకలు వేయకూడదు. మాట్లాడకుండ ఇలా రండి. మీ అబ్బాయి శవం చూపిస్తాను,'' అని నీరజ ఆవిడ్ని తీసుకుని హాస్పిటల్ వెనుక వరండాపై గుడ్డకప్పి ఉన్న శవాన్ని చూపింది.

ఆ పెద్దావిడ ఏడుస్తు శవంమీద పడింది. కోడలు ఆ దృశ్యాన్ని చూస్తుందేగాని ఏడవటంలేదు. ఇంతలో హాస్పిటల్ పెద్దడాక్టరు మధుసూదనరావు గారువచ్చి – ''మీరు త్వరగ తీసుకుపొండి శవాన్ని. ఇక్కడ పెద్దగ ఏడుపులు, కేకలు వినబడితే లోన బ్రతికే పేషంట్లు బెదరిపోతారు,'' అని చెప్పేరు.




''డాక్టరుగారు ! మీ హాస్పిటల్ వెనుక నున్న నది ఒడ్డున ఈ శవ దహనాన్ని చేస్తాం మీరు అనుమతించాలి,'' అని పెద్దావిడ బ్రతిమాలింది.

''సరే. నీరజ ! మన పెరటి కాంపౌండు గేటు తెరిపించు. నువుకూడ వెంట వెళ్ళి ఆ శవం బూడిద అయ్యేవరకు చూసి నాకు రిపోర్టివ్వు'' అని చెప్పేసి పెద్దడాక్టరు మధుసూదనరావు వెళ్ళిపోయేడు.

శవాన్ని నది ఒడ్డున పడుకోబెట్టి కర్రలు పేరుస్తున్నారు ఇద్దరు కూలీలు. ''అమ్మా ! ఈ సీసాలో కిరసనాయిలు అయిపోయింది. కిరసనాయిలు ఉంటేగాని ఈ కర్రలు అంటుకోవు. డబ్బివ్వండి ఓ సీసాడు కొనుక్కువస్తాను,'' అన్నాడు ఓ కూలీవాడు.

''అయ్యో ! నా బుద్ధి పాడుగాను. డబ్బు తెచ్చుకోడం మర్చిపోయేను. కోడలుపిల్లా ! నీ దగ్గరుందా ?''

''బోలెడంత ఉందండి. ఓరే అబ్బీ ! ఒక

సీసాతో ఇతడు కాలడు, కనీసం నాలుగు సీసాలుండాలి. ఇంద ఈ డబ్బు తీసుకునివెళ్ళి నాలుగు లీటర్లు కొనితే. త్వరగా రా. నేను మళ్ళీ మా ఊరుకు పోవాలి,'' అంది వసుమతి.

ఈ మాట వింటూనే ఆ శవం లేచి కూర్చున్నాడు. ఆ బొబ్బి కోపంగ అందర్నీ చూసేడు.

''అమ్మా ! నేను చావలేదే — ఈ నర్సు, ఆ ముండ కల్సి నన్ను చంపేసేరే. ఏమే నర్సూ — హంతకురాలా నీ పని చెప్తానుండు,'' అని కోపంగ నర్సు నీరజమీదకు ఉరికి ఆమె గొంతు గట్టిగా నొక్కి ఆమెను ఆ నదిలోకి విసిరేసేడు.

నది ప్రవాహం యెక్కువగావుంది. నీరజ నీళ్ళు మింగేస్తోంది. తెలివి తప్పుతూంది. దాహం యెక్కువయిపోయింది. ఎన్నినాళ్ళు త్రాగిన దాహం తీరటంలేదు. ఈలోగా ఉక్కిరిబిక్కిరౌతోంది.

అప్పుడు చటుక్కున నీరజకు తెలివి వచ్చింది.

పాడు కల ! ఎంత భయపెట్టింది. నీరజ లేచి తన గదిలోని లైటు వేసి టేబిలుపైనున్న వాచీలో టైమ్ చూసింది. తెల్లవారుఝాము నాలుగున్నర అయింది. దాహంగానే ఉంది. బహుశా ఆ మాత్రల ప్రతాపమయుంటుందని కూజాలోని నీళ్ళను గ్లాసులో పోసుకుని త్రాగింది. లైటుని అలాగే ఉంచుకుని వెళ్ళి మంచంమీద వ్రాలింది. మరి నిద్రపోలేదు. మళ్ళీ ఆమెను మెల్లగ ఆలోచనలు ముసురుకున్నాయి.

తన భర్త మోహనరావు తనని ప్రేమగ చూచుకునేవాడు. క్రమేపి తనకి అతడియందు పూర్తిగ నమ్మకం కుదరజొచ్చింది. ఏ చీకూచింత లేకుండ మరో నెల గడిచింది. నీరజకు నదిలో స్నానం చేయడమంటే బహు సరదా. చిన్నప్పుడూ అంతే. తన గ్రామం నుంచి తండ్రితోను, తల్లితోను రాజమండ్రి వచ్చినప్పుడల్లా గోదావరిలో స్నానం చేస్తుండేది. వెదురుపాడులో నీరజ ఇంటికి పరిసరంలోనే ఓ చిన్న ఏరు పారుతుండేది. వేసవిలో అది పూర్తిగ ఎండిపోయినా, వర్షాకాలంలో ఏటినిండా నీళ్ళుండేవి. అక్కడే నీరజ చిన్నప్పుడు గ్రామ పిల్లలతో ఆడుతూ, పాడుతూ ఈత నేర్చుకుంది.

స్నానం చేయడానికి నదికి వెళ్ళింది. ఏనాం ఊరుకు వెనుకనే గోదావరి ప్రశాంతంగ పారుతుంది. మంచినీళ్ళు తేవడానికి చేతిలో బిందెను పట్టుకుని వెళ్ళింది. తనుంటున్న వీధిలోని, ఆ ప్రక్క వీధిలోని పరిచయమైన ఆడవాళ్ళు కొందరు ఆ రేవులో

## జీవిత సమరం

స్నానం చేస్తున్నారు. చిరునవ్వులతో వాళ్ళని పలకరించినాక తను కాస్త దూరంలో స్నానం చేయనారంభించింది.

నీరజను చూసేక ఆ స్త్రీలు మెల్లగ మాట్లాడుకుంటున్నారు నీరజ పేరు ఎత్తకుండానే.

''కొందరు మొగాళ్ళు ఎలాగ తిరిగిన పెండ్లాం ముందర ఎంతో ప్రేమగ ప్రవర్తిస్తారు వదినా. ఆ నేర్పు అందరికి అబ్బదు.''

''అవును మరదలా, మా తమ్ముడు నీతో అన్ని ధైర్యంగ చెప్పేస్తాడా ?'' పక్కనున్న స్త్రీలు నవ్వుకున్నారు. దాంతో మొదటి స్త్రీ మరింత రెచ్చిపోయింది.

''నా మొగుడికి ఊరిమీద పడవల్సిన అవుసరం లేదు. ఆ వంకరబుద్ధి అందరికి ఉండదు.''

''అవును మరి చిరుతిళ్ళకు అలవాటుపడిన వాళ్ళకు ఇంట్లో నిండుగ భోజనం చేయబుద్ధి అవదు.''

''ఇంతకీ రాజ్యం ఎవరి గురించి మాట్లాడుతున్నావు ?''

''పేరెందుకులే తల్లీ. నిజం చెప్పిన నిష్ఠూరంగ ఉంటుంది.''

''ఇంతకీ జరిగిందేమిటి.''

''ఏముంది — కొందరి మొగాళ్ళకు ఇంట్లో ఆకలి తీరదు. అది తీర్చుకుందికి ఊరి మీద పడ్తారు లేకపోతే హోటళ్ళకు పోతారు,'' అంది ఓ పెద్దావిడ.

''అవును అందుకే మా మామ ఇల్లు కదిలేవాడు కాదు,'' అందో చిన్నది. అందరూ మళ్ళీ నవ్వుకున్నారు. ఆ పెద్దావిడ చెయ్యెత్తు మనిషి. పొడవుకి తగ్గ లావు ఉంది. ఆవిడ భర్త కాస్త పొట్టిగ ఉండి సన్నగా గాలి వీస్తే ఎగిరిపోయేటట్లుండేవాడు. అతడు అరవై యేళ్ళొచ్చాక దగ్గుకుంటూ రెండేళ్ళ క్రితం చనిపోయేడు. గిట్టని వాళ్ళు ఆ పెద్దావిడ ధాటికి తట్టుకోలేక చనిపోయేడంటారు.

''రాజ్యం ! సంగతేమిటే ?''

''ఒక పెద్దమనిషి పెండ్లయి సంవత్సరమేనా కాలేదు. రంభలాంటి పెండ్లాం పుట్టింటికి వెళ్ళగానే తనకు తెల్సిన ముండని సాయంత్రాలు ఇంటికి తెచ్చుకుని రాత్రి రెండో ఆట సినిమా వదలగానే 12 గంటలకు ఆ జనంతో పంపించేసేవాడు.''

''మరి ఆ ఇంట్లో తల్లి, తండ్రి, అక్కలు, చెల్లెళ్ళు, అన్నలు ఎవరూ లేరా — వాళ్ళంతా ఊరుకునేవారా ?''

''అతగాడు ఉద్దండుడట ఎవర్నీ ఖాతరు చేయడట. ఆ తల్లి కూడ అలాంటి మనిషేనట.''

''అయ్యో ! ఎంత నీచపు ప్రవర్తన—కలికాలం మనుష్యులు !''

''పదండర్రా పోదాం — ఎవరి పాపం వాళ్ళది. ఆ భార్యకు ఇవాళ కాకపోతే రేపైనా తెలీక మానదు. ఆవిడే తన సంసారాన్ని చక్క దిద్దుకుంటుందిలే — పదండి,'' పెద్దావిడ అలా హెచ్చరించగానే ఆవిడతో పాటు స్నానాలయిన స్త్రీలు పోవడానికి బయలుదేరేరు.

నీరజకు అనుమానం కల్గకపోలేదు వాళ్ళు తనని ఉద్దేశించిగాని మాట్లాడేరా అని. మళ్ళీ అనుకుంది ఆ ఊర్లో తనొక్కతే కాదుగా పెండ్లయి సంవత్సరం లోపున కాపురం చేస్తున్నవాళ్ళు. ఇంతకీ తన భర్త, తన అత్తగారి గురించి అట్లా అనుకుందికి ఏ ఆస్కారం లేదు. వాళ్ళు ఉత్తములు. వాళ్ళు తన గురించే అనుకుంటే తను లేనప్పుడు అనుకుని ఉండాలి గాని తన ముందుర ఎందుకనుకుంటారు ? దానివల్ల వాళ్ళకు కలిగే ప్రయోజనమేముంది ?

ఏమైన మనస్సు కాస్త కలతచెంది ఇంటికి వచ్చింది నీరజ నీళ్ళ బిందెతో. అపరికి మోహనరావు అతడి తల్లితో ఏదో గొంతుక తగ్గించి మాట్లాడుతున్నాడు. నీరజ పెరటి ద్వారం గుండా వచ్చి వంటింట్లో నీళ్ళబిందె పెట్టి వసారాలోకి వచ్చింది. గదిలో గుసగుసలు వినిపించేయి. నీరజ గది గుమ్మం వద్దకు వెళ్ళింది. ఆ మాటలు తక్కున ఆగిపోయేయి.

''అమ్మా ! నేనలా బజారుకు వెళ్ళొస్తా,'' అని లేచేడు మంచం మీద. ద్వారం వద్ద తలుపు నానుకుని నించున్న నీరజ అత్తగారు కోడలు వైపు తిరిగింది.

''ఏమే — బజారునుండి ఏమైన కావాలా ?'' అని అడిగింది.

నీరజ తేరుకుని ''రెండు నిమ్మకాయలు పట్టాండి,'' అంది. వెంటనే వంటగది ప్రక్కనున్న తన గదిలోకి వెళ్ళింది బట్టలు మార్చుకుందికి.

నీరజ కాపురానికి వచ్చిన కొత్తలో తనపెట్టెని ఆ పడక గదిలో పెట్టుకుని అక్కడే బట్టల్ని మార్చుకోడం చేస్తుండేది.






# అలసట చేత ఇంట్లో చదవ లేవా?



# గ్లూకోన్-డి ®

ఇది మీరు నమ్మిన
గ్లాకోస్ జ్-డి యొక్క
కొత్త పేరు

**ఆదనపు శక్తికోసం—అలా**
**అతనికి కావలసినప్పుడు**

సేద తీర్చడానికి, చల్లదనానికి శక్తినిచ్చే గ్లూకోన్-డి. గ్లాక్సో కంపెనీ నుంచి వచ్చిన విటమిన్-డి మరియు కాల్షియం ఫాస్ఫేటులతో బలపరచబడిన అసలైన గ్లూకోజ్ పౌడరు. దాన్ని ఏ పానీయం లోనైనా సరే కలపండి–పళ్లరసం, పాలు, టీ, కాఫీ, నీరు. లేకపోతే దేనితో కలపకుండా అలానే తీసుకోండి. శక్తి అలా ఉరకలు వేస్తూవచ్చే అనుభూతిని పొందండి.

అందరికీ పరిచయమున్న
అదే ఆకుపచ్చ ప్యాక్‌లో
దొరుకుతుంది.






**గ్లూకోన్-డి ®** నమ్మకంగా తిరిగి శక్తి నిచ్చే **గ్లాక్సో** వారి తయారీ

HTB-GLL-7200-TG

ఒకనాడు అలాగే స్నానంచేసి వచ్చి గదిలో బట్టలు మార్చుకుంటున్నది కర్టను ద్వారానికి వేసుకుని. కర్టను వెనుక నున్న ఒక తలుపు గాలికి కర్టనుకు దగ్గరగ పడిపోయింది. ఆ టైమప్పుడు మోహనరావు వచ్చి కర్టను తొలగించబోయి వెనుక నున్న తలుపుని చేతితో గుద్దుకున్నాడు. లోపలికి వెళ్ళి నీరజను చూసేడు. చాల చికాకుపడ్డాడు.

"ఏమిటి నీరజా ఇది ? పడక గది చాల నీటుగ ఉంచాలి. ఆడదానివి, చదువుకున్నదానివి ఆపాటి తెలియదా ? ఆ తడిబట్ట క్రిందవేసి నేలంతా తడి మయం చేసేవు ఛీ ! ఛీ ! గదంతా మకిలిచేసేవు. వంటగది ప్రక్కగదిలో బట్టలు మార్చుకోకూడదు. ఈ కర్టన్ను వేసుకోడాలు, ఈ తలుపుల్ని గుద్దుకోడాలుండవు."

"నా పెట్టె నా బట్టలు ఇక్కడున్నాయని, చాకింటి బట్టలు తీసుకుని ఇక్కడే మార్చుకుంటు న్నానండి. గాలికి ఆ తలుపు రెక్క పడుంటుంది. నేను కర్టను మాత్రమే వేసేను."

"ఓ పని చెయ్యి. వంటగది పక్కగదిలో ఒక్క కుట్టుమిషను మాత్రమే ఉంది. మా అమ్మ రాత్రి మంచం వాల్చుకుని పడుక్కుంటుంది. పగలంత ఎవ్వరు ఆ గదిలోకి పోరుగద. నీ పెట్టె, నీ బట్టల స్టాండు అక్కడ పెట్టుకో. అక్కడే నువ్వు బట్టలు మార్చుకోవచ్చు అలా స్నానంచేసి వచ్చి. నా బట్టలు, అవి ఇక్కడే బీరువాలో ఉంటాయి. గది నీటుగ ఉంటుంది."

"అలాగేనండి. అలాగే చేస్తా," అని ఊరుకుంది.

నీరజ మనస్సులో ఎన్నో ప్రశ్నలుద్భవించేయి.

"ఏం మీరు స్నానం చేసివచ్చి ఇక్కడ బట్టలు మార్చుకుంటే ఈ గది కాస్త తడవదా ?"

"నేనే కదా మీ తడిబట్టల్ని తీసుకుని వెళ్ళి పెరట్లో తీగమీద ఆరవేసి వస్తున్నాను. అట్లాంటిది నా బట్టలుంటే తప్పేమిటి ?"

"మీ బట్టలిక్కడ — నా బట్టలు వంటింటి ప్రక్క గదిలోనా ?" కాని నీరజకు తెల్సు ఆ సమయంలో ప్రశ్నలువేస్తే మోహనరావుకి కోపం వస్తుందని. ఆ మధ్యాహ్నమే తన పెట్టెను, బట్టల స్టాండుని వెనుకవైపు ఉన్న గదిలోకి మార్చేసింది. మోహనరావు బట్టల్ని బీరువాలోని హేంగర్సుకి పెట్టేసింది. నిజమే ఇపుడు గదికాస్త విశాలంగ ఉంది అనుకుంది. అయినా చిన్న మబ్బు తెర మనస్సును క్రమ్మింది.

## 5

సాయంత్రం అయిదు గంటల సమయం— ఆదివారం. మోహనరావు ప్రొద్దున ఓ రెండు గంటలు అలా ఊరులోకి వెళ్ళి వచ్చేడు. మధ్యాహ్నం అరటికాయ బజ్జీ చేసింది నీరజ. ఫలహారమైంది, కాఫీలు త్రాగడమైనాయి.

"అబ్బాయి ! సినీమాకి వెళ్దాం ముగ్గురం కలసి. పదిరోజు లైనాయి సినీమా చూసి."

"నాకు అర్జంటు పనుంది. ఒక స్నేహితు డింటికి వెళ్ళాలి. బ్యాంకు విషయాలు మాట్లాడాలి. వాడు మా యూనియన్‌కి సెక్రటరి. నువ్వు కోడలిని తీసుకు వెళ్ళు. మీరు ఒక తాళంచెవి తీసుకుని వెళ్ళండి. నా దగ్గర రెండోచెవి ఉంటుంది. ఎవరు ముందు వచ్చిన ఇబ్బంది ఉండదు."

"మీరు కూడ రాకూడదు. సరదాగా వెళ్దాం







'అందమైన అనుభవం' సినిమా చాలా బాగుంటుంది. దానికి వెళ్దాం. యూనియన్ విషయాలు రేపు మాట్లాడుకుంటేనేం. పోనీ మధ్యాహ్నం ఇంట్లో పడుక్కునేబదులు అలా వెళ్ళి మాట్లాడుకుని వచ్చుంటే పోనుకదా.''

''అదినరే కాని వాడికి మధ్యాహ్నం వేరే పని ఉందట, సాయంత్రం ఏడింటికి రమ్మన్నాడు.''

''పోనీ మీరు వచ్చేక రాత్రి ఆటకి పోతేనేం?''

''రాత్రి సరిగా నిద్ర ఉండదు, పైగా రేపు నేను తొమ్మిది గంటలకే బాంకుకి వెళ్ళాలి. మా అమ్మకు రాత్రి ఆట పడదు.''

అత్తగారికి చిరుకోపం వచ్చింది.

''పోనీ అమ్మా నాతో రావడానికి నీకు ఇష్టం లేకపోతే పోనీ. నువ్వింట్లోనే ఉండు. అబ్బాయి! నన్ను సినిమా హాలువద్దకు దిగబెట్టు.''

''అది కాదండి— నేను మీతో రాననలేదు, అతను కూడ వస్తే బాగుంటుంది అన్నాను. అతను రాలేనన్నారుకదా మనమే వెళ్దాంలెండి.''

అత్తగారు విజయ గర్వంతో కొడుకు వైపు చూచింది. సాయంత్రం ఆరు గంటలకి మోహనరావు ముస్తాబై బయటకు పోయేడు, ఆరుంపావుకి నీరజ అత్తగారితో సినిమాకి బయలుదేరింది. సినిమా హాలులో నీరజకు తెల్సిన ఒక అమ్మాయి కల్సింది. ఆ అమ్మాయి పేరు కమల. నీరజ వుంటున్న వీధిచివర ఇంట్లో ఉంటూంది తల్లి, తండ్రితో కలసి. ఆ అమ్మాయి కింకా పెండ్లి కాలేదు. మహా గడుసరిది. శరీరసౌష్ఠవముంది కాని రూపసి కాదు. ఆమె ప్రవర్తనమీద ఏవేవో పుకార్లున్నాయి. ఎవడితోనో లేచిపోయి వారం రోజులు రాజమండ్రిలో గడిపి తండ్రి తీసుకునివస్తే గుట్టు చప్పుడు లేకుండా తిరిగొచ్చిందని. కాని ఆ అమ్మాయి చాల మంచిగా, స్నేహంగా ఉంటుంది నీరజతో. నీరజకు ఆ అమ్మాయంటే అభిమానం. ఆమెతో చనువుగా ఉంటుంది. నీరజ కంటే ఒక సంవత్సరమే చిన్నది. కాని మాట, ప్రవర్తన మరీ చిన్నదానివిగా ఉంటాయి.

''నీరజక్కా! బావగారు రాలేదేమి?''

''అతనికి ఏదో ఆఫీసు పనుందట.''

''ఇవాళ ఆదివారం, పైగా రాత్రివేళ పనేమిటి?'' అని నవ్వింది కమల.

''అదికాదే వాళ్ళ యూనియన్ సెక్రటరితో ఏదో అర్జంటుగా మాట్లాడాలని వెళ్ళేరు.''

''వాళ్ళ బాంకు యూనియన్ సెక్రటరి అంటే ఆ నరసింహం యేనా!''

''అవును. నీకెలాతెల్సే ఆ బ్యాంకు విషయాలు?''

''మా పెద్దనాన్న కొడుకు ఆ బాంకులోనే కదా పని చేస్తున్నాడు.''

''అలాగా''

కమల దగ్గరగా జరిగి నీరజ చెవిలో చెప్పింది—

''మీ ఆయనకు పేకాటంటే చాల సరదా — నీకు తెల్సునా అక్కా? బహుశా పేకాటకే బావగారు వెళ్ళుంటారు.''

''నీకెలా తెల్సునే కమలా ఈ విషయాలన్నీ.''

''మా పెద్దనాన్న కొడుకు ఈ ముఠాలోని వాడే. అప్పడప్పుడు డబ్బులు తగలేసుకుని ఇంటి కొచ్చి వాళ్ళ నాన్నచేత చివాట్లు తింటుంటాడు. నీకు తెలుస్తే నువ్వు చివాట్లు పెడతావని బావగారు నీకు చెప్పుండరు.''

''అవునే కమలా — నీకు చాల విషయాలు తెల్సునే. ఇంకేం సంగతులు తెల్సునో?'' అని నీరజ మెల్లగ గిల్లింది కమల్ని.

''పోవే —'' అని నవ్వేసింది కమల.

వాళ్ళ గుసగుసల్ని వింటున్న అత్తగారు చికాకు పడింది.

''ఏవర్రా సినిమాకు వచ్చింది మాట్లాడుకో డానికా?''

''అదికాదు అత్తయ్యా — సినిమా మొదలవ గానే మానేస్తాం. మా ఇద్దరికి మాట్లాడుకుందికి ఇప్పుడేగా తీరుబాటయింది,'' అంది కమల.

సుబ్బాయమ్మ ఏదో ఘాటుగ, ''నీకు మొగుడా, పిల్లా, పీచుకా? ఏ బాదరబందీ లేని పిల్లవు నీకు తీరుబాటు లేకపోవడమేమిటి?'' అందామనుకుంది గాని అప్పుడే సినిమా మొదలెట్టేరు. నీరజ, కమల మాటలు మానేసి శ్రద్ధగా సినిమా చూడడం మొదలెట్టేరు.

సినిమా సగమయింది. ఇంటర్వెల్ ఇచ్చేరు. సుబ్బాయమ్మ బాతురూము వైపు వెళ్ళింది. కమల హఠాత్తుగ అంది నీరజతో—

''నీరజా! నీ మొగుడు అంత మంచివాడు కాదు తెలుసా?'' ఆ మాటతో నీరజ నిర్ఘాంత పోయింది. కాస్సేపువరకు మాట రాలేదు.

''నువ్వు బాధపడతావని ఇన్నాళ్ళు నీకు నేనేమి చెప్పలేకపోయేను. కాని నీ చెయ్యిజారిపోకుండ పరిస్థితులను అదుపులోకి తెచ్చుకుంటావని చెప్పా.''

అప్పటికి నీరజ తెప్పరిల్లింది. వణకే బలహీనమైన స్వరంతో నీరజ అడిగింది —

''కమలా! అతను మంచివారు కాదంటే ఏ ఉద్దేశం? మరి దాచకుండ చెప్పవే. నీ మేలును మరిచిపోను.''

''మరేం లేదు అక్కా — బావగార్కి కాకినాడలోని ఓ అమ్మాయితో స్నేహముంది. ఆ అమ్మాయి కాకినాడలో ఏదో లారీల ఆఫీసులో టైపిస్టుగ పని చేస్తుందట. బాంకు లావాదేవీలలో ఆ అమ్మాయికి మీ ఆయనకు స్నేహమయిందట. మీ అత్తగార్కి బాగా తెల్సు. నువ్వు పుట్టింటి కెళ్ళినప్పుడు ఆ అమ్మాయి సరాసరి మీ ఇంట్లోనే తిష్ఠవేసిందిట. సాయంత్రం బస్సులో వచ్చి తెల్లవారుఝామున మొదటి బస్సులో వెళ్ళిపోయేదట.''

''హరి భగవంతుడా! ఎంత ఘోరం!!''

''అంతేకాదు ఆ యూనియన్ లీడరు నరసింహంతో కలసి త్రాగుతాడుట కూడ. వాడితో పేకాట ఆడి డబ్బు తగలేసుకుంటాడట. మా పెద్దనాన్న కొడుకు అదే బాంకులో పని చేస్తున్నాడు కదూ. వాడే మా ఇంట్లో చెప్పేడు.''

నీరజకు తల తిరిగిపోయింది. కుర్చీ మీంచి క్రిందకు పడిపోకుండ గట్టిగ కుర్చీని పట్టుకుంది. గట్టిగ కండ్లు మూసుకుంది. అప్పుడు జ్ఞాపకానికి వచ్చింది నది ఒడ్డున అమ్మలక్కలు ఆడుకున్న మాటలు. మరి అనుమానంలేదు. ఆ మాటలన్ని తనని ఉద్దేశించినవే. ఇంకా ఏమేమో కమల్ని అడిగి తెల్సుకుందామనుకుంది ఇంతలో నీరజ అత్తగారు వచ్చేసింది. సినిమా కూడ మొదలైంది. ఏమి చూస్తున్నదో నీరజకు తెలియటంలేదు. ఆమె బుర్రలో అనుమానాలు, సందేహాలు ముసురుకొని రొద చేస్తున్నాయి.

సినిమా అయిపోయింది. ''వెళ్తానక్కా,'' అని చెప్పి దొంగకు తేలు కుట్టినట్లు మెల్లగా జారుకుంది కమల. నీరజ, అత్తగారు మెల్లగ బయటకు వచ్చి ఇంటి వైపుకు నడక మొదలెట్టేరు. నీరజ నిర్లిప్తతను సుబ్బాయమ్మ కనిపెట్టింది.

''ఏమే అలా ఉన్నావు?''

''ఏమీలేదత్త — నాకు తలనొప్పి వచ్చింది. ఆ మ్యూజిక్ కొంత గోలగ ఉంది. దాంతో నా తల నరాలు కదలిపోయేయి.''

సుబ్బాయమ్మ అప్పుడు సుళువుగా గాలి పీల్చుకుంది.

## జీవిత సమరం

ఇంటికి చేరేసరికి ఇంటి తలుపు గడియపెట్టి ఉంది. సుబ్బాయమ్మే ముందు ఇంటి మెట్లెక్కి తలుపును తట్టింది — "అబ్బాయీ!" అని పిలుస్తూ. మోహనరావు చిరునవ్వుతో వచ్చి తలుపు తెరచేడు. పువ్వుల లుంగీ కట్టుకుని ఉన్నాడు. పైన శాండో బనియన్ వేసుకున్నాడు. తల్లీ, భార్య వసారాలోకి రాగానే అడిగేడు.

"ఎలాగుంది సినిమా?"

"బాగానే ఉంది," అని క్లుప్తంగ అని తన హేండ్‌బ్యాగు బీరువాలో పెట్టుకుందికి గదిలోకి వెళ్ళింది. గదిని నిశితంగ చూచింది. మంచంమీద దుప్పటికాస్త నలిగి ఉంది. దానికేం! మోహనరావు పడుక్కొని ఉండొచ్చు. చుట్టూ చూసింది. చేతి గాజు ముక్కలుగాని నలిగిన పూలరెక్కలుగాని లేవు. ఇంతలో మోహనరావు గదిలోనికి వచ్చేడు.

సాధారణంగ సినీమా చూసివచ్చేక నీరజ ఆ సినీమాలోని సన్నివేశాల గురించి, వాళ్ళ నటన గురించి, పాటల గురించి వ్యాఖ్యానాలు చేస్తుంది చాల సేపటివరకు. అట్లాంటిది ఇవాళ మాట మంతీ లేకపోయేసరికి మోహనరావు కాస్త అనుమానించేడు.

"ఏం నీరజ అలా ఉన్నావు?"

"ఏమిలేదండి. ఆ సినీమా చూసేక తలపోటు వచ్చింది. అమృతాంజనం రాసుకుంటే తగ్గిపోతుంది లెండి," అని ముభావంగ చెప్పేసి బీరువాలో బ్యాగు పెట్టేసి తన గదిలోకిపోయింది బట్టలు మార్చుకునేందుకు.

ఒక్కవిషయం మాత్రం నీరజకు రూఢిఅయింది. మోహనరావు విస్కీ త్రాగున్నాడు. ఆ గది విస్కీ వాసన కొడ్తూంది ఊదొత్తులు వెలిగించినప్పటికీ. ముఖ్యంగ మోహనరావు దగ్గరగ నించుని మాట్లాడుతున్నప్పుడు అనుమానమేలేదు. ఎంతో కష్టంమీద నీరజ తనని తాను అదుపులో పెట్టుకుంటూంది. ఎంతో కష్టంమీద అడుగుతీసి అడుగువేయగల్గుతూంది.

సుబ్బాయమ్మ సినిమాకి వెళ్ళేముందే బంగాళ దుంపకూర, చపాతీలు చేసిపోయింది, ఆనాడు ఆదివారం గనుక. ఆ చపాతీలను కంచాలలోపెట్టి కొడుకుని, కోడల్ని పిలిచింది. కొడుకు వెంటనే వచ్చి కూర్చున్నాడు. నీరజ గదిలోంచే జవాబు చెప్పింది—

"అత్తయ్యా! నాకు ఆకలిగ లేదు, పైగా ఈ తల బాధొకటి." నిజంగానే ఆ సరికి నీరజ తల బాధతో పగిలిపోతూంది.

"ఏమీ తినకపోతే ప్రొద్దున్నయే సరికి నీరసించిపోతావు. ఏపని చేయలేవు రా," అని అత్తగారు గట్టిగ అనేసరికి చేసేదేమిలేక వచ్చి ఎలాగో అతి కష్టంమీద ఒక రొట్టె తిని, గ్లాసుడు మజ్జిగ త్రాగింది. ఆ రాత్రి ఆమెకు భర్త ప్రక్కన పడుక్కోడానికి ఏ విధంగా కూడ మనస్కరించడం లేదు— గాని ఎలా భర్తకు చెప్పడమా అని ఆలోచిస్తుండగా తనకా బాధ లేకుండ భర్త మోహనరావు అన్నాడు—

# కొత్త గొంతులు

## టి.యల్. కాంతారావు

"ఈ ప్రపంచంలోకి ప్రస్థానం ఇష్టం
గుండెలో అగ్ని పర్వతాలు బద్దలైనా
నవ్వడం మరీ ఇష్టం
స్మశానంలో వెంగళ్ళలు
పుట్టించడం కోర్కె
అయోమయంలో లయమవుతున్న
ఈ ప్రపంచం మారాలంటే
ప్రతి మనిషి ఒక అగ్నికణం కావాలంటుంది
ఈ నిప్పురవ్వ" — భైరవయ్య

తను చెప్పదల్చుకున్న విషయాన్ని సూటిగానూ, స్పష్టంగానూ, చదువరి హృదయం తాకేట్టుగానూ, ఏ భేషిజం లేకుండా చెప్పిన భైరవయ్య దిగంబర కవుల్లో ఒకడు. దిగంబర కవులంటే బట్టలుండని కవులా? అని వెక్కిరింతగా అడిగినవాళ్ళు ఉన్నారు ఆ రోజుల్లో. అట్లాంటి వారికి సరైన సమాధానం భైరవయ్య కవిత్వంలో దొరుకుతుంది. దిగంబర కవితకు అతను కరెక్టు నిర్వచనం ఇచ్చాడు.

"మనిషిలో అట్టడుగున బురదగుంటల్లో
పడి ఉన్న మనిషిని లేవదియ్యడం
ఎముకల లోతుల్లో ధ్వనించే
స్వచ్ఛమైన గీతాల్ని ప్రతిధ్వనించడం
కళ్ళ వెనుక దాగి ఉన్న
సిసలైన కన్నీళ్ళను ప్రసరించడం"

స్థూలంగా ఇది దిగంబర కవిత లక్ష్యం. దీంతోపాటు అది వాస్తవిక దృక్పథం, అరాచక మనస్తత్వం కొంత భైరవయ్యలో ఉన్నప్పటికీ ఈవ్యవస్థ సంపూర్ణంగా మారవలసిన ఆగత్యాన్ని గుర్తించాడు. అతనికి— ఈ తరానికున్న సహనం మీద, ఆడ మగా కాని మనస్తత్వం మీద, నిస్తబ్దంగా ఉన్న బ్రతుకుమీద, నిర్లిప్తంగా జీవిస్తున్న అమాయకతమీద, తాము విలువునా దోపిడీ చెయ్యబడుతున్నామని ఇంకా తెలుసుకోలేని అజ్ఞానంమీద, కృతజ్ఞత అనే ముసుగులో బ్రతుకుతున్న సేవక భావంమీద పరమ అసహ్యం ఏ స్థాయిలో ఉన్నదో ఆ స్థాయిని అతని కవిత శక్తిమంతంగా ప్రతిధ్వనించింది.

అణు యజ్ఞం ఖండిక వర్తమాన వ్యవస్థలోని జుగుప్స కంతటుకూ ప్రతీక. ఆధునిక నాగరికతా వైఫల్యం యొక్క సమగ్ర స్వరూపావిష్కరణ అణు యజ్ఞంలో కనబడుతుంది. ఉండవలసిన స్థితికీ, ఉన్న స్థితికీ మధ్య వ్యత్యాసం ఈ ఖండికలో ప్రస్ఫుటంగా దృశ్యీకరించడం జరిగింది. వెన్నెల మనోహరంగా చల్లగా ఉండాలి. కాని 'కొడిగట్టిన చుట్టనుసి'లా 'ముసుగేసుకొన్న విధవ'లా ఉందనడం నేటి వ్యవస్థ యొక్క వికృత రూపాన్ని ధ్వనింపచెయ్యడమే. ప్రపంచమే హోమగుండం; చరాచరాలు హవిర్భాగాలు; భేతాళుడు ఋత్విజుడు; కాలం ఘృతం; స్మశానం యాగ పురుషుడు; భూతాలు వేదపండితులు; పిడికెడు భస్మం యాగ ఫలం. ఇది ఆధునిక అణుయుగ లక్షణం. పాఠకునికి ఇది వెనుక చూపుగా కనిపించినా కటిక సత్యం. 'తిరుగులేని నిజం' ఖండికలో ఈనాటి కవిత్వం నిర్వహించవలసిన పాత్ర అభ్యుదయ యుగ సంధ్యలో మరోమారు జ్ఞప్తిచెయ్యటం జరిగింది. మగత ఆవరించిన మానవ మేదస్సు మేల్కొంచి కవిత్వమనే ఆయుధంతో ఈ అసమానత మీద, అమానుషత్వం మీద యుద్ధం ప్రకటిస్తుందని చెబుతున్నాడు భైరవయ్య.

"మగత విడిచిన మానవ మేధల్లో
జూలు దులిపిన కవిసింహం
గళం విప్పి గర్జనలు చేస్తూ
రేవు—తూర్పు దిక్కుని బద్దలు చేసి
మింట పొడిచే మార్తాండునికి
నేడు — ఆహ్వానంగా
బ్రెన్ గన్ను పేలుస్తున్నదన్నది
తిరుగులేని నిజం"

'పాపం నీ ఎడ్రస్ దొరకటం లేదు' ఖండిక కవిత్వంపై భైరవయ్యకు గల అభిప్రాయాల ఆవిష్కరణకు కవితాత్మక రూపం. గత కాలపు కవిత్వమంతా రాజుల పొగడ్తలకు, వారి ఉంపుడు కత్తెల సౌందర్య వర్ణనకు పరిమితమై ప్రజలకు, వారి జీవితానికి దూరమైనదన్న వేదన ఈ కవితలో తీవ్ర రూపాన్ని పొందింది. ఈ తరంలో కూడా కవులు నిజాన్ని విస్మరించి, అబద్ధాన్ని, ఆత్మాశ్రయత్వాన్ని వలసినంతగా సరఫరా చేస్తున్నారని భైరవయ్య ఆవేదన. చైతన్యం లేని చేతనా వర్షాలు, ఋతుచక్రాలు, విరిగిన వజ్రాయుధాలు పగిలిన శంఖారావాలు అనటం దారితప్పిన కొంతమంది నేటికవులను భంగ్యం తరంగా హేళన చెయ్యటమే. ప్రజాకవిత్వం, కళలూ, ప్రజల్లోంచేపుడతాయి. కవిత్వానికి కాలపరిధి ఒకటే ఉంటుంది. దాన్ని దృష్టిలో పెట్టుకుంటే నన్నయలోనో, తిక్కనలోనో మార్క్సిజం లేదని ఈనాడు మనం విచారించం. ఈనాటి కవులే వెనక్కి నడుస్తున్నప్పుడు నిన్నటి కవులను అనవలసిన పనిలేదు. తిరుగుముఖం పట్టిన ఈనాటి కవులకు బాధ అనిపించని చురకలు ఈ ఖండికలో బాగావేశాడు భైరవయ్య. కోట్లాది జనం గుండెల్లో మంటల్ని, వారికళ్ళలో కొడిగడుతున్న ఆశల్ని గమనించి గుర్తించకుండా స్వప్రయోజనం పేరిటో, శుద్ధ కళావాదం పేరిటో వ్యక్తిగత పైత్యాన్ని కవిత్వం పేరిట దిగుమతి చెయ్యటం జాతిజాతిని ఖూనీ చెయ్యటమే.

"తమ ఉనికి తాము తెలుసుకోలేక
విశ్వరూపం దాల్చిన నిన్ను పోల్చుకోలేక
మారుతున్న కాలాన్ని గుర్తించలేక
తాము విసర్జించిన కశ్మలంలో
తమ భావిని పూడ్చుకుంటూ
పిచ్చికేకలు పెడుతున్న వీళ్ళకి
పాపం నీ ఎడ్రస్ దొరకటం లేదు"

అని కవిత్వాన్ని రక్షిస్తున్నామనుకుంటున్న కాపలా కవులను ఎద్దేవా చేశాడు భైరవయ్య.

దిగంబర కవులందరికూ సామాన్య లక్షణమైన ప్రస్తుత వ్యవస్థా నిరసన భైరవయ్యలోనూ ఎక్కువ మోతాదులోనే ఉంది. 'రా' సంకలనం అతని కవిత్వ తత్వానికి ఉదాహరణ. దాని ప్రారంభంలో "ఈ దేశం బాగుపడటానికి నేడు ఉన్న ఈ వ్యవస్థ మొత్తం మారాలి. దీన్ని అన్ని వైపులనుంచీ యువతరం ఎదుర్కోవాలి. ఈ వ్యవస్థలో ఉన్న ఛండాలాన్నంతటినీ పూర్తిగా నాశనం చెయ్యాలి. అందుకు యువతరాన్ని సిద్ధం కమ్మనమనీ, నేడు జరుగుతున్న సర్వతోముఖ పోరాటంలో పాల్గొనమని ఆహ్వానిస్తున్నాను" అన్నాడు భైరవయ్య. దిగంబర కవితానంతరం కవిత్వపరంగా కొన్నాళ్ళు అజ్ఞాతంగా ఉన్నా మళ్ళీ ఇప్పుడు 'అద్వైం భైక్' సామూహిక నామంలో ఒక నామంగా ఈ జడత్వం లోంచి కలాన్ని, గళాన్ని దులిపిస్తున్నాడు భైరవయ్య. ★





"చూడు నీరజ. నీకు తలనొప్పిగా ఉంటే నువ్వు సరిగ్గా నిద్రపోవు అలా దొర్లుతూనే ఉంటావు. నాకేమో నిద్ర ముంచుకొస్తుంది. నువ్వు కదులుతుంటే నాకు నిద్రాభంగ మవుతుంది. అందుకే ఈ రాత్రికి నువ్వు ఆ వెనుక గదిలోనే ఆ మడత మంచం వాల్చుకుని పడుకో— ఏం ?"

బతికిపోయా ననుకుంది నీరజ. ఈ తలనొప్పి బాధలో ఆ విస్కీ వాసన కూడ కలిస్తే తనకి నరకమయిపోతుంది రాత్రంతా.

"అలాగేనండి," తన గదిలోకి పోయింది. ఆ రాత్రి ఆ గదిలో ఆ పెద్ద మంచం మీద పడుకున్నందుకు అసహ్యము, రోత కూడ కల్గింది. ఆ మంచంమీద ఇంకెవరైనా పడుకున్నారేమోనన్న అనుమానం తీరలేదు నీరజకు. నీరజ అప్పుడప్పుడు అంటే తనకి తలకాయ నొప్పిగానున్న, మోహనరావుకి తలనొప్పైన తను విడిగ ఆ వెనుక గదిలో పడుకోవడానికి నాంది ఆనాడు. అలా తీరని వ్యధ ననుభవిస్తు అటు నుంచి ఇటు, ఇటు నుంచి అటు దొర్లి ఎప్పుడో ఒక కునుకు తీసింది.

(ఇంకా వుంది)

# అడ్డదారులు

**టి. ఎస్. ఎ. కృష్ణమూర్తి**

పెద్దకథ ప్రారంభం!

**రాధ మెడలో తాళిబొట్టు కట్టేశాడు వరుడు. వారిమీద అక్షింతల వర్షం కురుస్తోంది.**

**నాకు బాగా వెనుకగా నిలబడ్డవాళ్ళు వేస్తున్న అక్షింతలు నా తలమీద కూడా పడ్తున్నాయి కొద్ది కొద్దిగా.**

**నా చేతిలోని అక్షింతలు మూడు పర్యాయాలుగా రాధవైపు విసిరి, జేబురుమాలుతో చేతికి అంటిన పసుపును తుడిచేసుకుంటూ లలిత ఎక్కడుందా అని కళ్ళతోనే వెతకడం మొదలుపెట్టాను.**

మనుషులు అటూ, ఇటూ కదలడం **మొదలుపెట్టారు. అందువల్ల నా అన్వేషణ** చప్పున ఫలించలేదు.

ఐదు నిముషాలపాటు శ్రమపడి చివరికి ఎలాగైతేనేం ఆడవాళ్ళ మధ్యన ఎవరో స్నేహితురాళ్ళతో కాబోలు మాట్లాడుతూ కూర్చుని వున్న లలితను కనిపెట్టేశాను. అయితే లలిత నేనున్నవైపు చూడలేదు. అసలు ఆవిడ ధ్యాసే ఈ వైపులేదు.

లలిత చాల మారిపోయింది. మునుపు ఎరుపు రంగుతో సన్నగా వుండేది. ఇప్పుడు బాగా తెల్లగా, లావుగా నిండుగా కన్పిస్తోంది. బుగ్గలు నునుపెక్కడం వల్ల కాబోలు ముఖం చంద్రబింబంలా కన్పిస్తోంది పెద్దపెద్ద కళ్ళతో అందంగా.

ముహూర్తానికి కేవలం పదినిముషాల ముందుగా ఇక్కడికి చేరుకోగలిగాను. కనీసం ఓ అరగంట ... గంట ముందుగా వచ్చివుండినా లలిత దగ్గరగా, తనతో కబుర్లు చెప్తూ కూర్చుని వుండేవాణ్ణేమో ?

అంతమంది మీదుగానూ ఓ లాంగ్ జంప్‌చేసి లలిత ప్రక్కన దూకాలనిపించింది నాకు. నా కోరిక నాకే నవ్వు తెప్పించగా చిన్నగా నవ్వుకుని లలితను తదేకంగా, ప్రేమగా చూడసాగాను. ఇంతలో మళ్ళీ పందిట్లోని మనుషులు అటూ ఇటూ తిరుగుతూ నా చూపులకు అడ్డుపడ సాగారు. విసుక్కుంటూ మండపంవైపు చూశాను. వధూ వరులను ప్రక్క ప్రక్కగా కూర్చోబెట్టి చదివింపులు ప్రారంభించాడు పురోహితుడు.

రాధ పెళ్ళి పత్రిక పోస్టలువాళ్ళ పుణ్యమా అని నిన్న మధ్యాహ్నం అందింది. వెంటనే శెలవు పెట్టినా మరికొన్ని ముఖ్యమైన పనులుండడం వల్ల అవన్నీ ముగించుకుని స్టేషను చేరుకునేసరికి రాత్రి పది దాటింది. తిరుమలా ఎక్స్‌ప్రెస్ వెళ్ళిపోయింది అప్పటికే. పదకొండు గంటలకు ఫిఫ్టీఫోర్ ఎక్కాను. గూడూరులో తిరుమలాను క్యాచ్ చేయవచ్చను కున్నాను. అయితే దురదృష్టవశాత్తు దాదాపు రెండు గంటలు ఆలస్యంగా ఉదయం ఆరున్నరకు చేరింది ఫిఫ్టీఫోర్ ఎక్స్‌ప్రెస్ గూడూరుకు. వెంటనే బస్టాండుకు వెళ్ళి ఆర్. టి. సి. బస్ పట్టుకుని మూగవాడు అమ్మా అన్నట్లు ముహూర్తం సమయానికి పది నిముషాలు ముందుగా ఇక్కడికి చేరుకున్నాను. ఈ హడావుడి ప్రయాణంలో ప్రజెన్‌టేషన్ పట్టుకువచ్చే అవకాశం ఏది ? అందువల్ల మళ్ళీ తల లలిత కూర్చున్నవైపు తిప్పాను.

లలిత కబుర్ల మధ్య గలగలా నవ్వుతోంది ఆనందంగా... అందంగా... అటూ ఇటూ చూడకుండా.

నాకు కొద్దిగా చిరాకనిపించింది. నేను ముఖ్యంగా ఇక్కడికి రావడం లలితను కలుసుకోవడం కోసమే. లలితను కలుసుకుని మూడు సంవత్సరాలు దాటిపోయాయి. రాధ పెళ్ళిపత్రిక అందగానే ఎంతో ఆనందంగా పరిగెత్తుకు వచ్చేశాను.

లలితతో మాట్లాడాలని నా మనసు ఎంత తహతహ లాడుతోందో అంతకు రెట్టింపుగా మనుషులు అడ్డుకుని వున్నారు మా మధ్యన సందులేకుండా.

నా భుజంమీద చేయిపడింది. వెనక్కి తిరిగి చూశాను. ట్వీడ్ సూటులో మెరిసిపోతూ దినేష్.

"ఒరేయి మన రాజిగాడురా !" అని అరుస్తూ కొంచెం దూరంగా నిలబడివున్న మా మిత్రులను పిలిచాడు. లలితనే అన్వేషించడంలో నేను మరెవర్నీ గమనించలేక పోయాను మగవాళ్ళలో.

రామ్మూర్తి, రంగస్వామీ, విజయ్ ముగ్గురూ మా దగ్గరకు వచ్చేశారు. అంతలోనే నా కళ్ళు మరెవరో మూశారు. ఆ స్పర్శ ఎన్ని జన్మలెత్తినా మరచిపోలేనిది.

"ఒరేయి వదులురా ! డేవిడ్ అని తెలుసుకోలేని అవివేకిని కాను !" అన్నాను ఆనందంగా. వాడు నా ప్రాణంలో ప్రాణం.

డేవిడ్ నా కళ్ళను కప్పిన చేతులను వెనక్కి తీసుకునేసి నవ్వుతూ నా ముందుకు వచ్చాడు. ఆలోగా దినేష్ కూడా వచ్చి మాతో కలిశాడు.

"ఒరేయి ఎక్కడున్నావు? ఏం చేస్తున్నావు??" అని అడిగాడు. విజయ్ టై సవరించుకుని నలిగి పోయిన నా దుస్తులను పరీక్షగా చూస్తూ. వాడికీ నాకూ మధ్యన ఎప్పుడూ ఉత్తరాలు లేవు.

"బెజవాడలో వుంటున్నానురా. పబ్లిక్‌హెల్తులో టెంపరరీ ఉద్యోగం చేస్తున్నాను. అది పర్మనెంట్ కాదు... ఊడిపోదు. ఒంటెద్దు బండి నడకనుకో!" అన్నాను తేలికగా నవ్వేస్తూ.

"జీతం ఎంత వస్తుందిరా ?"

"ఐదు వందలు !"

"అంతేనా ? పై సంపాదన ఏదయినా వుంటుందా ?"

"ఛ... ఛ... నేను అలాంటివి ఆశిస్తానని ఎలా అనుకున్నావురా ? వచ్చేదానితో సంతోషంగా గడిపేస్తున్నాను. అడ్డదారులు త్రొక్కడాన్ని నా మనసు ఎట్టి పరిస్థితులలోనూ అంగీకరించదు" అన్నాను గర్వంగా.

అయితే నేను ఎక్స్‌పెక్ట్ చేసిన భావాలు ఎక్స్‌ప్రెస్ చేయలేదు నా మిత్రులు.

"ఏడిచావుపో ! బెజవాడలో ఐదు వందలతో,

ఎలా గడుపుతున్నావురా ? ఈ చిన్న ఊర్లో ఏడు వందలు జీతం కాక ఇంకా సంపాదిస్తూ అది అంతా చాలక నేనే బాధ పడుతున్నాను.''

అన్నాడు దినేష్ నన్నో పురుగును చూసినట్లు చూస్తూ. వాడి చూపులు నాకు గగుర్పాటును కలిగించాయి. వాడు అలా చూడాల్సిన అవసరం ఏమొచ్చిందా అని ఆశ్చర్యపోయాను.

''నీవు తీసుకోదలుచుకుంటే పై ఆదాయం ఉంటుందా నీకు ?'' అడిగాడు రంగస్వామి.

''అలా తీసుకోదలచుకుంటే నా జీతానికి రెండురెట్లు ఎక్కువగా కూడా సంపాదించుకోవచ్చు నేను సులభంగా. బట్ ఐ డోంట్ లైక్ టు గెట్ దట్ బ్లడీ ఇన్‌కం ఎండ్ ఐ డోంట్ వాంట్ దట్ ఇన్‌కం !''

నా ఈ మాటలు కూడా డేవిడ్‌ను తప్ప మరెవర్నీ ఇంప్రెస్ చెయ్యలేక పోయాయి.

''వీడు చెడే గాడిద ! వీడికి బాగుపడే లక్షణాలు ఎప్పుడూ లేవు. ఏం చేస్తాం ?'' అంటూ మా దగ్గర్నుండే కదిలి వెళ్లిపోయాడు రామ్మూర్తి. మరో ఐదు నిముషాలలో రంగస్వామి, విజయ్, దినేష్ ముగ్గురూకూడా వెళ్లిపోయారు మా దగ్గర్నుండీ... మూడు సంవత్సరాల తరువాత కన్పించిన నాపై పెద్ద ఆసక్తిని కనబరచకుండా.

డేవిడ్ నేను మిగిలాము.

''ఐతే నీవేమీ మారలేదన్నమాట ! అందుకేరా నీవంటే నాకు ప్రాణం అయినా నిన్ను నాలుగు తన్నాలిరా ! నీకు ఎక్కడ ఎలా ప్రవర్తించాలో తెలియదు'' అన్నాడు డేవిడ్ నా బుజంమీద చేయివేసి నన్ను తన దగ్గరగా తీసుకుంటూ.

''ఏడిచావు ! అయినా నేనేం చేశానురా?'' అన్నాను.

''అదంతా తరువాత మాట్లాడుకుందాం కానీ లలిత లేచి నిలపడుతోంది చూడు... వెళ్లు... వెళ్లి మాట్లాడుతూ వుండు. నేనలా వెళ్లి ఇప్పుడే వచ్చేస్తాను !'' అన్నాడు డేవిడ్ నా భుజంమీద నుండీ తన చేయి తీసేస్తూ.

నేను కళ్లతోనే వాడికి కృతజ్ఞతలు తెలిపేసి లలితవైపు దూసుకు పోయాను గబగబా.

*   *   *

''బి. ఎ. మూడు సంవత్సరాలూ మేం కలసి చదివాము. నా డియరెస్ట్ ఫ్రెండ్ రాజారావు !'' అంటూ ఆనందంగా పరిచయం చేసింది, లలిత తన స్నేహితురాళ్ళకు.

పరిచయాలయ్యాక తన మిత్రురాళ్ళవద్ద తాత్కాలిక శెలవు పొంది లలిత నావెంట పెళ్ళి పందిరి వెలుపలికి వచ్చింది. లలిత చేతిని నా చేతుల్లోకి తీసుకోవాలన్న కోరికను కష్టంమీద అణచుకున్నాను చుట్టూ వున్న మనుషులను చూసి.

''ఎలా వున్నావు లలితా ? ఆరు నెలలుగా నాకు ఉత్తరాలు వ్రాయకుండా మానేశావు. నేను ఏమయిపోవాలని అనుకున్నావు ?''

అని అడిగాను తన అందమైన నల్లని కళ్ళలోకి ప్రేమగా చూస్తూ.

లలిత నవ్వింది. భారీ వర్షం తరువాత నీరెండలో స్వచ్ఛంగా, క్రొత్తగా కన్పించే ప్రకృతి సౌందర్యంలా ఆమె ముహంలో నవ్వు మెరుస్తోంది. ఆ అందమైన నవ్వే నేను ఆమెను ప్రేమించేలా చేసిందని చెప్పవచ్చు మొదట్నుండీ.

''చూస్తున్నావుగా... బాగోలేనా ? నీవు మాత్రం ? మూడు సంవత్సరాలు దూరంగా వుండిపోయి నన్ను తప్పపడుతున్నావా?... ఈ మధ్యన నీకు ఉత్తరాలు వ్రాయకపోవడాన్కి ముఖ్యమైన కారణం ఏమిటో తెలుసా ? యం. ఎ. అయిపోగానే పి. హెచ్. డి. చేస్తున్నాను. శ్రీకృష్ణదేవరాయలు గారినాటి అడ్మినిస్ట్రేషన్ మీద రిసెర్చి చేస్తున్నాను. బుక్స్ సేకరించుకోవడానికే సమయం చాలలేదు ఇంతకాలం... చాల హర్రీగా, బిజీగా వున్నాను నిజానికి. మూడు నాలుగేళ్ళలోపే డాక్టరేట్ పొందాలని ప్రయత్నిస్తున్నాను. ఆ ! అన్నట్లు ఈ పర్యాయం ఎలా వ్రాశావు యం. ఎ. పరీక్షలు ? ఈ పర్యాయం అయినా పోస్టుగ్రాడ్యుయేటువి అవుతావా ? కావా ?''

''ఉద్యోగ నిర్వహణలో క్షణం తీరికలేకుండా వున్నాను లలితా ! ఎక్కడ చదివాను ? అందుకే ఈ పర్యాయం పరీక్షలే వ్రాయలేదు. వ్రాసి మళ్ళీ పోయిందనిపించుకోవడంకన్నా మానెయ్యడం నయం అనిపించింది. లలితా ! నాలో ఓపిక నశిస్తోంది ! జీవితంలో థ్రిల్ తగ్గిపోతోంది ఏం చేయను ?'' అన్నాను నీరసంగా, కొద్దిగా ఇన్‌ఫీరియర్‌గా ఫీల్ అవుతూ.

ఆర్గండీ శారీలో అందంగా, నిండుగా నిలబడ్డ లలిత మొట్టమొదటిసారి నావైపు కాస్త తేలిక భావంతో చూసింది.

''నీవు ఇంత అసమర్థుడుగా తయారవుతావని అనుకోలేదు రాజా ! ఓపికను పెంచుకో థ్రిల్ అదే వస్తుంది. నీవు ముసలివాడువు కాదుకదా ?'' అంది.

''నేను అసమర్థుడుగా మాత్రం తయారవను లలితా ! నాలో ఓపిక పెరగాలన్నా, నా జీవితానికి నిండుదనం రావాలన్నా, నా జీవితంలో థ్రిల్లింగ్ పెరగాలన్నా నీవు నా జీవితాన్ని పంచుకోవాల్సిందే ! నీవు నా అర్ధాంగివి అయిన నాడు నేను ఎంత ఎత్తుకైనా ఎదిగి పోగలను !'' - అన్నాను నమ్మకంగా, దృఢంగా.



"రాజా ! నీ జాబ్ పర్మనెంట్ అయిందా ?"

"లేదు లలితా ! ఇప్పట్లో అవుతుందన్న నమ్మకమూ లేదు. అవవచ్చు, అవకపోవచ్చు !"

"ఇప్పుడు జీతం ఎంత వస్తోంది ?"

"ఐదు వందలు !"

"అంతేనా ?! చూడు రాజా, బెజవాడలో ఐదు వందలు మాత్రం సంపాదిస్తూ, తాత్కాలిక ఉద్యోగం చేస్తున్నావు నీవు. ఇప్పుడు మనం పెళ్ళి చేసుకోవడం ఎలా సాధ్యమౌతుందంటావు ? ఎలా సుఖంగా బ్రతకగలం ?? పెళ్ళయిం తరువాత కూడా మనం పెద్దవాళ్ళ మీద ఆధార పడవల్సిందేనా ?"

"ఓహ్ అదా నీ భయం ? లలితా ! నీవు మాష్టర్ ఆఫ్ ఆర్ట్సువి, పి. హెచ్. డీ. చేస్తున్న దానివి. విజయవాడలో నీకో నాలుగువందల రూపాయల వచ్చే ఉద్యోగం దొరకకపోదు" అన్నాను ఉత్సాహంగా.

"పెళ్ళయాక ఉద్యోగం చెయ్యడమా ? సారీ రాజా నాకు ఇష్టం లేదు. పెళ్ళయాక నేను హాయిగా కాలం గడపాలనుకుంటాను తప్ప ఉద్యోగం మొదలైన వేవీ చేయదలచుకోలేదు. నాకు వడ్డించిన విస్తరిలాంటి జీవితం కావాలి. నన్ను క్షమించు ఇంత నిర్మోహ మాటంగా చెప్పేస్తున్నందులకు !"

"అలా అయితే ఒక పని చేయవచ్చు మనం. మనం పెళ్ళి చేసుకునేద్దాము. నీ పి. హెచ్ డీ. అయిపోయే వరకూ నేను జాబ్ చేస్తాను ఆలోగా నాకు ప్రమోషన్ రావడమో, మరో మంచి జాబ్ దొరకడమో జరగకపోతే నీకు డాక్టరేట్ రాగానే మనం మా పల్లెకు వెళ్ళిపోదాము. ఎంత ప్రశాంతంగా, అద్భుతంగా వుంటుందో తెలుసా మా పల్లె ? మన జీవితాలు అంతకన్నా ప్రశాంతంగా గడచిపోతాయి.

నా భాగానికి వచ్చే భూమిని దగ్గర వుండి సాగు చేయించుకుంటే చాలు గెజిటెడ్ ఆఫీసరు కన్నా ఘనంగా బ్రతకవచ్చు నేను. విలేజిలో నీతో నా జీవితం పీస్‌ఫుల్ లైఫ్ విత్ బ్యూటిఫుల్ వైఫ్... ఆ !" అని దీర్ఘం తీశాను.

"ఐ యాం సారీ రాజా ! విలేజి లైఫ్ అంటే నాకు పరమ బోర్ !"

"లలితా ! లలితా !!" అని అనగారిగాను నీరసంగా.

"నీ ఉద్యోగం ఎదుగూ బొదుగూ లేనిది. ఇంతకాలంగా అక్కడ నీవేం చేశావు ? ఆ ఉద్యోగాన్నే పర్మనెంట్ చేయించు కోవడమో, లేదా మరో పర్మనెంట్ ఉద్యోగం మంచిది వెతుక్కోవడమో చేయలేక పోయావా ? ఇంతకూ ఇంత కాలంగా నీవేం సంపాదించావు ?"

లలిత ప్రశ్నల ధోరణి నాకు కొద్దిగా చీకాకును కలిగించింది. దాదాపు మూడు సంవత్సరాల తరువాత కలుసుకున్న మామధ్య సంభాషణ ఇలా సాగుతుందని నేను కలలో కూడా అనుకోలేదు. అయినా, ఓపికగా జవాబులు చెప్పాను లలిత ప్రశ్నలకు.

"లలితా ! ఇంత కాలంగా నేనేం చేశానా ? ఇంటి దగ్గర్నుండి ఒక్క రూపాయి అయినా తెప్పించుకోకుండా స్వతంత్రంగా యం. ఏ. చేశాను ప్రయివేటుగా... ఉద్యోగం చేస్తూనే !. డిగ్రీ పొంద లేక పోయాననుకో అది వేరే విషయం.

లైఫ్‌లో ఎన్నిరకాల కష్టాలు వుంటాయో,

# అడ్డదారులు

వాటిని ఎలా అధిగమించవచ్చో ప్రాక్టికల్‌గాకూడా నేర్చుకున్నాను. రోజుకు ఎంత మినిమమ్ ఖర్చుతో మెయిన్‌టెయిన్ అవగలమన్నది కూడా అవసరం వచ్చినప్పుడంతా ప్రాక్టీసుచేసి తెలుసుకున్నాను. పరిస్థితులకీ, పరిసరాలకీ ఎలా అనుగుణంగా సర్దుకు పోవాల్సిందీ కూడా తెలుసుకున్నాను.

కాకితో కబురంపినా వందలూ, వేలూ నవ్వుతూ పంపగల అన్నయ్యా, తల్లిదండ్రులూ వున్నా ఎవరినీ ఏమీ అడగకుండానే ఈ మూడేండ్లు హ్యాపీగా గడిపివెయ్యగలిగినందుకు గర్వంగా కూడా వుంటుంది నాకు. ఇది అందరికీ సాధ్యం అయే పనికాదు లలితా! ఇలాంటివి నేర్చుకోవడాన్కి, ఇంప్రూవ్ చేసుకోవ డాన్కి ముందు మైండ్ వుండాలి, ఊహ, ముందు చూపు వుండాలి. ఏది మంచిది అని తెలియడమే కాదు, దానికోసం ఆ మంచిదారిలో నడవగలగాలి అనే తపనకూడా వుండాలి. ఇలా ప్రతి ఒక్కరూ నేర్చుకున్ననాడు ప్రపంచంలో నిరుత్సాహం, నిరాశ, బాధ మొదలైనవి ఉండకపోవచ్చని నా నమ్మకం. నిజం చెప్పాలంటే ఈ మూడేండ్లలో ఎంతో నేర్చుకున్నాను నేను. అయినా ఇంకా ఎంతో నేర్చుకోవాల్సిందికూడా వుంది.

ఇక ఉద్యోగం ఎందుకు పర్మనెంట్ చేయించుకో లేదు అంటావా ? రూల్సు న్యూస్ పేపర్లలో, గవర్నమెంటు ఆర్డరు కాగితాలనబడే జి. వో. లలో ఇరుక్కుని వుంటాయి తప్ప చిన్న చిన్న ఉద్యోగుల వరకూ వాటంతట అవి రావు. బరువులు పెట్టి లేదా ఇన్‌ఫ్లూయన్స్ ఉపయోగించి ఆ రూల్సును నాకు దగ్గరగా తెప్పించుకుని పనిచేయించుకోవడం అనేది నా వ్యక్తిత్వానికి విరుద్ధమైన విషయం. అందువలన నా జాబ్ పర్మనెంట్ కాలేదు. ప్రమోషన్లు అంతకన్నా రాలేదు.

ఇక... ఇంకో పర్మనెంట్ ఉద్యోగం ఎక్కడ సంపాదించుకోను ? ప్రస్తుతం ఇండియాలో ఉద్యోగాలు కుప్పలు తిప్పలుగా పడివుండడంలేదు. నేను ఇంతకాలంగా సంపాదించింది ఏమిటంటావా ? మంచివాడు, నిజాయితీపరుడు, సిన్సియర్ అండ్ హానెస్ట్ పర్సన్ అన్న పేరు. నాకా తృప్తి చాలు." అన్నాను.

రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడచిపోయాయి.

"తృప్తి చాలు బాగానేవుంది. కానీ రాజా, ఈ మంచిపేరు వల్ల ఏమిటి లాభం ?" అంది లలిత కాస్త నిరుత్సాహంగా.

'లలితా... లలితా... లలితా... నీవేనా ఇలా మాట్లాడుతున్నది ?' అని అనుకున్నాను.

దాదాపు నాలుగు సంవత్సరాల క్రితం, కాలేజి వార్షికోత్సవంనాడు స్టేజి ఎక్కి 'దేశ రక్షణ — మన కర్తవ్యం' అన్న అంశంమీద 'నిజాయితీ' అన్న విషయాన్ని ఆధారం చేసుకుని అరగంటపాటు అనర్గళంగా మాట్లాడిన నా మెడలో పూలహారం వేసి స్టేజిమీద, అన్ని వందలమంది విద్యార్థుల ముందు నన్ను కౌగలించుకున్నంత పని చేసిన లలిత రూపం మెదిలింది నా మనసులో.

ఆ ఇంప్రషన్ అంతా ఏమయిపోయిందో ? నా మనసు సుత్తిదెబ్బలు తిన్నట్లుగా తయారయింది.

గత రోజు బెజవాడలో బయల్దేరి వప్పటినుండి వుండిన ఉద్రేకమూ, ఊహలూ తారుమారయి పోతున్నట్లనిపించింది నాకు.

రైలు ఎక్కే ముందూ, ప్రయాణం చేస్తున్నంతసేపూ రకరకాల ఊహలతో మునిగి తేలాను 'రైలు దిగగానే లలితను కలుసుకుంటాను. తను నా చేయి పట్టుకుని అలా పార్కులో మరెక్కడికో తీసుకెళ్ళి కూర్చోబెట్టి బోలెడు కబుర్లు చెబుతుంది. ఆపై లలిత ఒడిలో తల పెట్టుకుని కాసేపు పడుకోవాలి. తరువాత చెట్టా పట్టాలేసుకుని వెళ్ళవచ్చు రాధ పెళ్ళికి...' ఇలా సాగాయి నా ఊహలు.

'అబ్బ ! ఊహలు ఎంత అద్భుతంగా వుంటాయి?' అనుకున్నాను, వాస్తవంలో లలిత సమక్షంలో అలాంటి ఆనందం పొందలేక పోయిన నేను.

"అయితే మన పెళ్ళి యింకా..." అంటూ ఏదో చెప్పబోతున్నాను. కాని నా మాట మధ్యలోనే తుంచేసింది ఆమె.

"ముందు జీవితంలో స్థిరపడు రాజా ! ఆపై ఆలోచిస్తాము !"

"ఒకవేళ... జీవితంలో స్థిరత్వం అని నీవను కుంటున్న దాన్ని నేను సంపాదించుకో లేకపోతే ?"

"నేనేం చేయను రాజా ?"

"లలితా నా ప్రేమ...కాదు మన ప్రేమ..." అనబోతున్నాను. అంతలోని కొంపలు మునిగినట్లు పరిగెత్తుకొచ్చిన లలిత మిత్రురాళ్లు ఆమెను పెళ్లి పందిట్లోకి లాక్కుపోయారు గబగబా.

నా మాటలు నా గొంతులోనే అణగారి పోయాయి.

నిరుత్సాహంగా లోపలికి అడుగులేస్తున్న నాకు చిన్న పొడిదగ్గు విన్పించింది ప్రక్కగా. నీరసంగా తల త్రిప్పి చూశాను.

ప్రక్కనున్న బెంచీమీద కూర్చుని వున్నాడు చిరునవ్వుతో డేవిడ్ !

డేవిడ్ చిరునవ్వు నవ్వితే చాల బావుంటాడు. వాడి నల్లటి ముఖంలో మెరుపులా మెరిసే తెల్లని, చక్కటి పలువరసా, వాడి అందమైన కర్లింగుల హెయిర్ స్టయిలూ ఎలాంటి వారినైనా ఆకర్షించి ఆకట్టుకుంటాయి.

"నీవో ఇడియట్‌విరా !" అన్నాడు వాడు నవ్వుతూనే —

"నీకేమొచ్చిందిరా ... ? నన్ను చివాట్లతో సహస్ర నామార్చన చేస్తున్నావు కన్పించిన దగ్గర్నుండీ" అంటూ వాడి ప్రక్కన కూలబడ్డాను.

"చెపుతాను. అయితే ఇక్కడకాదు, భోజనం చేసేశాక మా ఇంటికి వెళ్దాము. అప్పుడు చెపుతాను" అన్నాడు డేవిడ్.

"భోజనం అయిన తరువాత నేను లలితతో చాలసేపు మాట్లాడాలిరా !"

"ఏడిచావు. లలిత నీకా అవకాశం ఇప్పుడే ఇచ్చేటట్లు లేదులే !"

"ఎందుకురా ? ఏమిటి కారణం ?" అన్నాను కొంచెం గాభరాగా.

డేవిడ్ ఏదో చెప్పబోయాడు. ఇంతలో అతన్ని ఎవరో పిలిచారు వెలుపల్నుండీ.

"ఉండరా బాబూ, పది నిముషాలలో వచ్చేస్తాను!" అంటూ వెళ్ళాడు డేవిడ్.

నేను ఓ సిగరెట్ వెలిగించుకుని చుట్టూ చూశాను.

కొంచెం దూరంలో రామ్మూర్తి, విజయ్ నిలుచుని నీట్‌గా డ్రెస్ చేసుకునివున్న యువకులతో ఏదో చర్చిస్తున్నారు. ఇంకో దగ్గర రంగస్వామి ఎవరో ఇద్దరు అమ్మాయిలతో ఉత్సాహంగా కబుర్లు చెపుతున్నాడు. వధూవరులు కూర్చున్న చోటికి కాస్త వెనుకగా లలితా, ఇంకో ఇద్దరమ్మాయిలూ, దినేష్, ఇంకో యువకుడూ నిలబడి ఏదో విషయం మీద వాదోపవాదాలు చేసుకుంటున్నారు. రాధ తన జీవితాన్ని పంచుకోవడం ప్రారంభించిన భాగస్వామి వైపు ఓరగా చూస్తోంది ... చిరునవ్వుతో, సగం సిగ్గుతో.

ఎక్కడ చూసినా ఉత్సాహం, ఆనందం, తృప్తి తాండవిస్తున్నాయి.

హఠాత్తుగా నా మనసు శూన్యంగా తయారయింది. అంతమంది మధ్య నేను ఒక్కణ్ణే వంటరివాడుగా, ఎవరికీ ఏమీ కాకుండా చీకటిలో నిలిచిపోయిన బికారివాడుగా అనిపించసాగింది నాకే. ఈ వంటరితనం, నిరుత్సాహం నాకు క్రొత్త కాదు. ఏ కారణంచేతో కొద్దికాలంగా ఏ ఫంక్షన్‌కు వెళ్ళినా, ఏ డిన్నర్‌కు వెళ్ళినా, ఏ పెళ్ళికి వెళ్ళినా, ఇలాంటి అకేషన్‌కు దేనికి వెళ్ళినా నా పరిస్థితి ఇంతే! ఎన్నో విషయాలలో ఎన్నో విజయాలను సాధించిన నేను ఈ ఫీలింగ్‌ను మాత్రం ఎందుకో జయించలేకపోతున్నాను.

అయితే నేను ఎప్పుడూ దీన్ని గూర్చి పట్టించుకునేవాణ్ణి కాను. కానీ, ఈ అకేషన్ వేరు.

రాధ పెళ్ళికుమార్తె స్థానంలో ఉంది కాబట్టి ఆమెకు ఎవర్ని గూర్చీ పట్టించుకునే అవకాశమూ; కంపెనీ ఇవ్వగల సమయమూ లేదు.

కానీ తక్కిన వాళ్ళు ?

యూనివర్శిటీలో చాలామంది స్టూడెంట్లు "విత్అవుట్ రాజారావ్ దేర్ ఈజ్ నో దినేష్‌బాబు!" అనేవాళ్ళు ఆ రోజులలో. నన్ను వదిలి దినేష్ ఒక్క నిముషం గడిపేవాడు కాడు. భోజనం, టిఫిన్, కాఫీ, సిగరెట్ ఏదయినా కలసి తీసుకోవాల్సిందే. కాలేజీకి, సినీమాలకు, షికార్లకు ఎక్కడికైనా కలసి వెళ్ళాల్సిందే! ఒకే కంచంలో తిని, ఒకే మంచంలో పడుకునే స్నేహం అంటారే... అదే!

యూనివర్శిటీ కల్చరల్ అసోసియేషన్‌లో ప్రముఖ స్థానాలలో, ఎప్పుడూ కలిసే వుండేవాళ్ళం నేనూ రామ్మూర్తీ. ఏ నాటకం జరిగినా, ఏ చర్చ జరిగినా అందులో మా పాత్రలూ, మా ఉపన్యాసాలూ వుండి తీరాల్సిందే. ప్రతి అకేషన్‌లోనూ మా ఇద్దరికీ ఏదో ఒక స్పెషలైజ్‌డు వర్కు వుండి తీరేది. ఎన్నో సందర్భాలలో మా ఇద్దరికీ కలిపి ఒకే బహుమతిని ఎన్నోసార్లు ఇచ్చారు యూనివర్శిటీ వాళ్ళు. అంత దగ్గర సంబంధం వుండేది మా మధ్యన!

ఇక స్పోర్ట్సు విషయంలో నేను లేనిది విజయ్ లేడన్నమాటే. నేను లేకపోతే ఏ గేంలోనూ తను అడుగు పెట్టేవాడే కాదు విజయ్!

రంగస్వామికి నేను పర్మనెంట్ పి. ఏ. ఆ రోజులలో. వాడి ప్రియురాలు జానకికి లవ్ లెటర్స్ వ్రాసి ఇవ్వడం నా మొదటి డ్యూటీ. వాటిని వాడు కాపీచేసి ఆమెకు పంపుకునేవాడు. వాడు ఆమెను ఎక్కడ, ఎప్పుడు, ఎలా కలుసుకోవచ్చో, ఎలా ఆమె ప్రేమను సంపాదించుకోవచ్చో మొదలైన వాటినంతా చూడాల్సిన బాధ్యత నా రెండవ డ్యూటీగా వుండేది. ఆ ఏర్పాట్లన్నీ ఎంతో సిస్టమాటికల్‌గా చేసేవాణ్ణి ఆ రోజులలో. నా కృషి లేకపోతే జానకితో వాడి పెళ్ళి జరిగేదే కాదని అందరూ అన్నారు కూడా వాడి పెళ్ళినాడు. అది నూటికి నూరుపాళ్ళూ నిజం కూడా!

లలిత... నా ప్రాణేశ్వరి, నా హృదయేశ్వరి, నా సర్వస్వం... లలిత... లలిత కూడా ఆ రోజులను మరచిపోయిందా? కాలేజి టూర్ వెళ్ళినప్పుడు... యమునానది ఒడ్డున, వెన్నెట్లో చెట్టాపట్టా లేసుకుని చేసిన షికార్లనూ, అజంతా గుహల వెలుపల కళ్ళతోనే చెప్పుకుని, చూపులతోనే తెలుపుకున్న నిర్ణయాలనూ తను మరచిపోయిందా?

కాలేజి ఆక్టివిటీస్‌లో నేను చూపిన ప్రతిభ, పొందిన ప్రశంసలు ... అప్పుడు తన కళ్ళలోని మెరుపులూ, తను ఇచ్చిన ప్రోత్సాహం ... డిగ్రీ అయిపోగానే నేను జీవితంలో థ్రిల్లింగ్‌ను వెతుక్కుంటూ బయల్దేరే ముందు ... అంటే మేము విడిపోయేముందు చేసుకున్న నిర్ణయాలూ ... అన్నీ మరచిపోయిందా!

"అసంభవం!" అంటూ పైకే గట్టిగా అనేశాను, ఆలోచనలలో మునిగిపోయి నన్ను నేను మరచిపోయి.

చుట్టుప్రక్కల ఉన్నవారిలో చాలమంది నాకేసి విచిత్రంగా చూశారు.

సిగ్గుపడిపోయి తలవంచుకున్నాను కొద్దిక్షణాలు.

# ఇ'వేమన'పద్యాలు




అల్ప సుఖము నెల్ల వాసించు మనుజుండు
బహుళ దుఃఖములను బాధపడును
పర సుఖంబు లెఱిగి బ్రదుకంగ వలెనయా
విశ్వదాభిరామ వినుర వేమ.




డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**కె. కె. — అనకాపల్లి**

నా వయస్సు 21 సం॥లు. అవివాహితను. 2 సం॥ల క్రితం టి. బి. వచ్చింది. అప్పటి నుండి నెలనెలా బహిస్టు రావడంలేదు. రెండుసార్లు మాత్రలు వాడాను. నా కంప్లైంట్‌కి బహిస్టు నెలనెలా రాకపోవటానికి సంబంధం ఏదైనా ఉందా!

★ క్షయ రోగం గర్భాశయానికి వచ్చిన వారికీ, క్షయ రోగంవల్ల అనీమియా శరీర క్షీణత్వం ఎక్కువగా ఉన్నవారికి ఇలా జరిగే అవకాశం ఉంటుంది. అనీమియా ఉన్నదీ లేనిదీ రక్తంలోని హిమోగ్లోబిన్ శాతం పరీక్షించటంవల్ల తెలుస్తుంది. ఉన్నట్లయితే ఇనుప ధాతువుగల మాత్రలు కొన్నాళ్ల పాటు వాడవలసి ఉంటుంది. మీ రోగానికి తగిన మందులు తీసుకొంటే బహిస్టు అవటం కూడా దానంతట అదే సర్దుకుంటుంది.

**పి హెచ్.డి.పి. విజయవాడ.12**

కళ్ళజోడు పెట్టుకునే వాళ్ళకు కళ్ళ దగ్గర కాయలు ఏర్పడుతున్నది. కళ్ళజోడు పెట్టుకోవలసి వస్తే కాయలేర్పడకుండా ముందు జాగ్రత్తలు ఏమి తీసుకోవాలి?

★ కళ్ళజోడు పెట్టుకొనే వాళ్ళందరికీ కాయ లేర్పడటం జరుగదు. కళ్ళజోడు ఫ్రేం వత్తిడికి కీలాయిడ్స్ ఏర్పడేతత్వం ఉన్న వారికి మాత్రం ఇలా జరుగుతాయి.

ఈ తత్వం ఉన్నవారు కాన్‌టాక్ట్ లెన్సులు వైద్యుల సలహా ప్రకారం వాడవచ్చును.

**కె. బి. కె. - బెర్‌హంపూర్**

రాత్రి పడుకొనే ముందు పసుపు త్రాగితే మంచిదా లేక చెడుపా? పసుపునీరు రోజూ త్రాగితే జాండిస్ వస్తుందా?

★ పసుపు ఎందుకు త్రాగాలో నాకు అర్థం కావటం లేదు. పసుపు నీరు త్రాగటానికీ జాండిస్ రావటానికీ సంబంధం లేదు.

**ఎ. కె కె. — టంకిపాడు**

నాకు ఎడమ కాలిమీద గోధుమవర్ణపు మచ్చ లేర్పడ్డాయి. 4 సం॥ అయినది. 1 సం॥ నుండి బెట్‌నోవేట్ ఎన్. క్రీము వాడాను. దురద మాత్రం తగ్గింది. మచ్చ పోలేదు.

★ ఫంగస్ ఇన్‌ఫెక్షన్‌వల్ల ఏర్పడిన మచ్చలు కొంతవరకు మాత్రమే రంగు తగ్గే అవకాశం ఉంటుంది. పూర్తిగా మానటానికి మందులు వాడటం అనవసరం. పై పూతగా కొన్ని రోజుల పాటు బెంజాయిక్ యాసిడ్ వాడిచూడండి.

**ఆర్ ఆర్. - యలమంచిలి**

నాకు ఓపెన్‌హార్ట్ ఆపరేషన్ చేశారు. 1 సం॥ అయింది. ఆపరేషన్ చేసిన దగ్గర కొయ్య కండ పెరిగింది. తగ్గటానికి ఏమయినా టాబ్లెట్సుగాని, ఆయింట్‌మెంట్‌గానీ ఉంటే చెప్పండి?

★ ఈ కొయ్య కండలను కీలాయిడ్స్ అని అంటారు. వీటిని పోగొట్టడానికి మందులుగాని ఆయింట్‌మెంట్లుగాని లేవు. ఏదైనా చేస్తే ఇంకా పెరిగే అవకాశం ఉంటుంది. ●

---

'ఇది అణుయుగం. ఇందులో ఎన్నో వింత మార్పులు సంభవిస్తున్నప్పుడు మానవుల మనసులలో వచ్చే మార్పులు ఏపాటి?' అనుకున్నాను భారంగా నిశ్వసిస్తూ.

"భోజనాలకు రండి!"

ఎవరో వచ్చి అందర్నీ పిలుస్తున్నారు. అందరూ గుంపులు గుంపులుగా భోజనాలు పడ్డింపబడుతున్న ప్రదేశానికి వెళ్తున్నారు. నన్ను ఎవరూ పిలువలేదు. నాకూ వంటరిగా అంతమంది మధ్యకు వెళ్ళాలనీ అన్పించలేదు. వంటరితనంతో, శూన్యమైన మనసుతో బాధపడ్తూ ఈ ఇన్‌ఫీరియారిటీ ఫీలింగ్‌ను అధిగమించడం నేర్చుకోవాలి' అనుకుంటూ కూర్చున్నాను సిగరెట్లు తగలేస్తూ.

చాల నిముషాలు భారంగా గడిచాయి. ఫస్ట్‌బ్యాచ్ అయిపోయింది. సెకండ్ బ్యాచ్ భోజనాలకు కూర్చోబోతున్నారు. కానీ నేను కూర్చున్న చోటు నుండీ లేచే ప్రయత్నం చేయలేదు.

నేను నాలుగవ సిగరెట్ పారవేసి ఐదవది వెలిగించుకోబోతుండగా రంగస్వామి వచ్చాడు నేను కూర్చున్న వైపు. తృప్తిగా భోంచేసి వచ్చాడు కాబోలు భుక్తాయాసంతో దొర్లుతున్న రోడ్డు రోలరులా వచ్చాడు నెమ్మదిగా జేబురుమాలుతో చేయ్యీ, మొహమూ తడుముకుంటూ.

నా చేతిలోని సిగరెట్ పాకెట్‌ను వాడివైపు చూపాను సిగరెట్ ఆఫర్ చేస్తూ.

"నేను గోల్డ్ ఫ్లేక్ ఫిల్టర్ కింగ్స్ తప్ప వేరే కాల్చనురా!" అని నిర్లక్ష్యంగా అంటూ జేబులోంచి సిగరెట్ పాకెట్ తీసి ఓ సిగరెట్ నోట్లో ఉంచుకొని వెలిగించుకుంటూ వెళ్ళిపోయాడు వాడు. 'భోంచేశావా?' అని మర్యాద కోసం అయినా అడగలేదు. కనీసం నాకో సిగరెట్ ... తన బ్రాండుది ఆఫర్ చెయ్యలేదు.

## అడ్డదారులు

'ఒరేయి రంగస్వామీ, నీవు జానకిని ప్రేమించేస్తూ, నన్ను నీ విరహ బాధతో వేధించివేస్తూ నా సిగరెట్లు ఎన్ని వేలు తగలేసి వుంటావో మరచిపోయావా?' అనుకున్నాను నేను వాడు వెళ్ళినవైపు చూస్తూ. ఆ రోజులలో జానకికి వాడు ఉత్తరాలు వ్రాసుకోవడం కోసం ఖరీదైన లెటర్ హెడ్లూ, ఖరీదైన రంగురంగుల సిరాలూ, ఖరీదైన గ్రీటింగ్ కార్డులూ కూడా నేనే కొనాల్సి వచ్చేది.

రెండు మూడు నిముషాల తేడాలో దినేష్, రామ్మూర్తీ, విజయ్ ఇంకా కొందరు పాత పరిచయస్తులూ భోంచేసి వచ్చేశారు. అయితే నాకేసి ఎవరూ రాలేదు నన్ను చూసినా. అది సాధారణ విషయమే కావచ్చు బహుశా! కానీ నేను బాధతో తలవంచుకున్నాను కొన్ని నిముషాలు. ఎందుకో నాకే తెలియదు సరిగ్గా.

మళ్ళీ నేను తల పైకెత్తబోతోండగా నా భుజం మీద చేయి పడింది మృదువుగా.

"ఏమిట్రా బాధ పడ్తున్నావా?" అని అడిగాడు డేవిడ్.

"అబ్బే... లేదు... అయినా బాధ ఎందుకూ?" తడబడ్డాను నేను బయటపడిపోయినందుకు కొద్దిగా సిగ్గుపడ్తూ.

"ఏడిచావు పద! వెళ్ళి భోంచేద్దాము. నాకు చెడ్డ ఆకలిగా ఉంది!" అంటూ నా చేయిపట్టి లాక్కుపోయాడు డేవిడ్.

వడ్డనలు జరుగుతున్న ప్రదేశానికి కొంచెం ఇవతలగా వధూవరులు నిలబడివున్నారు. వారి దగ్గర ఆగాడు డేవిడ్.

రాధకు నేను హృదయపూర్వకంగా శుభకాంక్షలు తెలిపాను. రాధ నన్నూ, డేవిడ్‌నూ తన భర్తకు పరిచయం చేసింది నన్నో ఆర్టిస్టుగానూ, డేవిడ్‌ను వర్ధమాన రచయితగానూ తెలుపుతూ. ఆమె భర్త చాల ఆనందంగా ఫీల్ అయ్యాడు మేం తనకి పరిచయం అయినందుకూ, రాధ కాలేజిమేట్సు అయినందుకూ.

మండుటెండలో వచ్చిన వాడికి చల్లని నీళ్ళు దొరికినట్లు కొద్దిగా సంతోషం కలిగింది నాకు. 'రాధ మనస్తత్వంలో మార్పులేదు' అనుకుని కొంచెం ఆనందపడ్డాను.

ఉదయం నుండీ ఏమీ తినకుండా ఉండిపోవడం వలనా, ఆకలి అయ్యీ అయ్యీ నిలిచిపోవడం వలనా నాకు భోజనం సహించనేలేదు.

భోజనం అయిందనిపించుకుని ఆటోలో బస్టాండుకు వెళ్ళాము నేనూ, డేవిడ్. అక్కడ తెలిసినవాళ్ళ కొట్లో ఉంచివుండిన నా సూట్‌కేస్ తీసుకుని డేవిడ్‌వాళ్ళ ఇంటికి వెళ్ళాము అదే ఆటోలో.

(ఇంకా వుంది)



షర్టింగులు: పాలియెస్టర్, పాలియెస్టర్ బ్లెండ్ మరియు కాటన్
మంచి అభిరుచి. తగిన ధరలు.
ఎన్‌టైస్®
నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్
(తమిళనాడు మరియు పాండిచెరి) లి.
భారత సర్కారుపు ఒక ఉద్యోగ సంస్థ
10/64 సోమసుందరం మిల్స్ రోడు, కోయమత్తూరు-641 009
MCA/NTC/81/TEL

# త్రిద్వనం



మంథా వెంకటరమణారావు

ఎడం చెయ్యెత్తి, కోటు చెయ్యి వెనక్కిలాగి రోలెక్స్ క్రోనోమీటర్ గడియారం కేసి చూసి, ''అందుతామా ?'' అన్న ప్రశ్నని ఆత్రంగా వేసేడు డాక్టర్ రావ్. అందకపోతే అవతల పుట్టి మునిగిపోయే కార్యక్రమం అస్తవ్యస్తమయేటట్టూ, అంతరిక్షంలోకి వదలబడబోయే రాకెట్ తను సమయానికి అందకపోవడంవల్ల ఆగిపోబోతున్నట్టూ ఉందతడి హడావిడి.

''అందుతాం సార్ !'' అన్నాడు, టియాటో స్విటాన్‌ని, కృష్ణుడు కురుక్షేత్రంలో రథాన్ని పరుగెత్తించినట్టు, కురుక్షేత్రం వంటి నగర వీధుల్లోంచి పరుగెత్తిస్తూ షోఫర్ ధన్ — డ్రయివర్ అని పిలవడం హోదాకి తక్కువని తెల్లటి యూనిఫారమూ, టోపీ తగిలించి షోఫర్‌గానూ, దుర్యోధన్ అన్నపేరుని ధన్‌గానూ మార్చేక దుర్యోధనుడి స్థితి బాగుపడినా మానినా శ్రీమతి ఎండ్ డాక్టర్ రావ్‌ల పరపతి మాత్రం పెరిగింది ! ''వాళ్ళు షోఫర్‌డ్రివెన్ కారులోనే తిరుగుతారు !'' అన్న ఆమోద ముద్ర వేయించుకోగలిగారు సొసైటీ ఉన్నత స్థానాల్లో !

''చంద్రమండలాన్ని గంటలో చేరుకోగలమా?'' అని డాక్టర్ రావ్ అడుగుతుంటే — ''తప్పక చేరుకోగలం సార్ !'' అన్న జవాబిస్తాడు ధన్ ! ఎందుకంటే డాక్టర్ రావ్‌గారి శాస్త్రీయ దృక్పథంలో అవదు, జరగదు, చెయ్యలేము అన్న విధ్వంసక పదాలు లేవని షోఫర్ ధన్‌కి అనుభవం వల్ల తెలుసు.

''ధన్ చేరుకోగలమంటే చేరుకోగలమే !'' అనుకొని తేలిగ్గా ఓసారి ఊపిరి పీల్చుకొని సీటుకి చేరబడ్డాడు, లండన్‌కి అంతర్జాతీయ అంతరిక్ష పరిశోధనా సభలకి భారతదేశపు ప్రతినిధిగా వెళ్లినప్పుడు డయర్ కంపెనీలో కొనుక్కున్న వందపౌన్ల సూట్‌ని ఓసారి తడుముకుని —

''ఈ స్విటాన్‌తో రద్దీ వీధుల్లో కూడా రాం బాణంలా కొట్టుకపోవొచ్చు సార్ ! సానా మంచి కారొట్టుకొచ్చేరు !'' ధన్ మెచ్చుకున్నాడెన్నోసార్లు. ''అణుశక్తిని శాంతియుత వినియోగం'' అన్న అంశంమీద జరిగిన సభలకి క్రిందటేడు జపాన్ వెళ్లినప్పుడు, జపాన్ ప్రభుత్వం తన ప్రజ్ఞని మెచ్చుకొని బహూకరించిన కారిది ! ఐతే, ఈ కారొచ్చిందని కాడిలాక్‌ని అమ్మేయలేదు ! ఆవిడ ఒప్పుకోదు ! నగరంలో సినిమాలకీ, షాపింగ్‌కీ, పార్టీలకీ, ఫంక్షన్లకీ క్యాడిలాక్‌లో వెళ్తే దర్జాకాని, స్విటాన్‌లో వెళ్తే రాజకుమార్తె గుర్రమెక్కి ఊరేగినట్టుంటుంది— ''ఏనుగుమీదెళ్లవల్సిన జాగాలకి ఏనుగుమీదే వెళ్ళాలి. గుర్రంమీదెళ్లవల్సిన చోట్లుకి గుర్రమ్మీద వెళ్ళాలి!'' అంటుందామె. ఇంకపోతే అమ్మాయేమో స్పోర్ట్స్ కారు కావాలంటోంది ! ''టెన్నిస్ ఆడుకుందుకెళ్ళడానికి నాకు థలడర్ బర్డ్ స్పోర్ట్స్‌కార్ కావాల్సాన్నా!'' అంటూ ఏడుస్తూ తిండి మానీసింది ఓ రోజున ! వెర్రిపిల్ల! ''అలాగేలే బ్యాత్రిస్! వచ్చేనెల స్టేట్స్ వెళ్తాంగా ? రీగన్ అంకుల్ని అడుగు ! తప్పకుండా ఇస్తాడు!'' అంటూ ఓదార్చాడు. లేకలేక కలిగిన ఒకేఒక్క కానుపు— బాల త్రిపుర సుందరి అని పేరుపెడితే ''ఛీ! ఏంపేరది!'' అంటూ ''బ్యాత్రిసు'' కింద మార్చేసుకుంది జ్ఞానమొచ్చేక.

మరింక తమకి పిల్లలు కలుగరు— మొదటి కాన్పుకే సిసేరియన్ ఆపరేషన్ జరిగినప్పుడూ, ప్రతికాన్పుకి సిసేరియన్ తప్పదని తెలిసినప్పుడూ, ''నాకు మరి పిల్లలొద్దు బాబోయ్! ట్యూబ్స్ తీసేయండి !'' అంది శ్రీమతి— ఆపరేషన్ అంటే చచ్చేభయం ఆమెకు !

తనకు వంశోద్ధారకుడు లేకపోయేడే, తన సైంటిక్ విజ్ఞానమంతా తనకొడుక్కి నేర్పి ఐన్‌స్టీన్ వంటివాణ్ణి చెయ్యాలన్న తనకోరిక నెరవేరలేదే అన్న అశాంతి డాక్టర్ రావ్ మనసులో ఉండిపోయింది. ఆ సంగతే ఎప్పుడో ఓసారి ఆమెతో అంటే, ''దానికేం? మీకు నచ్చిన మరో క్షేత్రాన్నెంచుకొని బీజాన్ని నాటండి! నాకెటువంటి అభ్యంతరమూ లేదు!'' .అనేసి ఓ నిరభ్యంతర సర్టిఫికేటిచ్చేసినా, బీజాన్ని నాటేక క్షేత్రం తనమానాన తాను పోదుగా ? వదలదు ! క్షేత్రమ్మకి మనసుంటుంది— ప్రేమంటుంది— పెళ్లంటుంది— ఆస్తీ, ఇల్లూ, వాకిలీ అంటుంది— వీటన్నింటికీ సమయమేదీ తనకి ?

''రొమేన్స్ ఈజ్ ఎ వేస్ట్ ఆఫ్ వేల్యుబుల్ హ్యూమన్ టైమ్!'' అన్నడువాచ డాక్టర్ రావ్‌ది! ఆడా, మగా కలియికకి రొమేన్స్ అన్న మేలిముసుగెందుకు? ప్రేమ అనే అత్తరు పరిమళం ఎందుకు? ఆకలేస్తే భోజనం లాగే ఇదీనూ! రొమేన్స్‌మీద తగలెట్టే కాలాన్నే విజ్ఞాన పరంగా వాడుంటే, ఈ పాటికి మానవుడు అంతరిక్షంలోని మరో భూమి వంటి గ్రహం మీమ్మద కాలుమోపేవాడే! ఇంతకీ ఈ రొమేన్స్ రొమేన్స్ అంటూ మానవ జాతిని పాడు చేస్తున్నది కవులూ రచయితలూనూ! ఆ షేక్స్పియరూ, కీట్సూ, షెల్లీ, కాళిదాసూ, కృష్ణశాస్త్రీ... ఇంకెవరో ఎవరో...! వీళ్ల పుస్తకాలు పాఠ్యగ్రంథాలలో పెట్టి, పిల్లలచేత వల్లెవేయించి వారి మనసులని విషపూరితం చేస్తున్నారు! ఇదీ డాక్టర్ రావ్ అభిప్రాయం

అందువల్ల ప్రేమ... రొమేన్సు... అన్న స్త్రీపరమైన సరస పదాలకి తన జీవితంలో చోటివ్వలేదాయన! మచ్చుకన్నా కాలేజీ రోజుల్లో ప్రేమలో పడలేదు. ప్రేమించబోయిన అమ్మాయిల్ని ఆమడ దూరాన్నుంచేడు!

"ఆ జంజాటంలో నేను పడలేను సుమీ! పోనీ! బేబీనే సైంటిస్టుగా మారుస్తాను! మదామ్ క్యూరీ అంతదాన్ని చేస్తాను!" అన్నాడానాడు!

ఆ ఆశా నిరాశే అయింది!

బాత్రిస్‌కి అర్థమెటిక్ అంటె ఎలర్జీ! ఆల్జీబ్రా అంటే మూర్ఛ! జామెట్రీ అంటే ఫిట్సు! ఫిజిక్స్ అంటే ఓంట్రవ్స్! కెమిస్ట్రీ మాటెత్తితే గజగజా వణుకు!

ఉగ్గుపాలతో, జోలపాటలూ, కలలలోకాలూ అలవాటు చేసింది శ్రీమతి! మల్లెలూ, గులాబులూ, సంపెంగ పూలూ, సన్నజాజుల పరిమళాలూ, రాజకుమారులూ, సిండ్రెల్లా కథలూ, కర్పూరం, చందనం, కీట్సు, క్రిష్ణశాస్త్రీ, ఆటలూ, పాటలూ, స్నేహితులూ కబుర్లూ, డాన్సులూ, డిస్కోలూ, ఆర్ట్‌గ్యాలరీలూ, ఫిల్మ్‌ఫెస్టివల్స్, సంగీతం, సాహిత్యం... ఈ లోకంలో తిరగడం స్వర్గం అనిపిస్తుంది తల్లీ కూతుళ్ళకి! ఎక్కడ గాలిలో రొమేన్సుంటే అక్కడ విహరించటం వారికిష్టం!

ఆ విధంగా తన కూతురు తన సాహచర్యం కన్న తల్లి పరిధిలో ఉండడం ఇష్టపడింది! తాను చెయ్యగలిగిందేమీ లేక పోయింది! జీవి పుట్టగానే స్వతస్సిద్ధంగా కొన్ని నైజ గుణాలేర్పడిపోతాయి — తగిన వాతావరణం దొరగ్గానే వికాశం పొందుతాయా గుణాలు — తగని వాతావరణంలో వాడిపోతాయి — డాక్టర్ రావ్ నిట్టూర్చేడు.

ఇంతలో వాయువేగ మనోవేగాలతో వెళ్తున్న కారుకి సడన్‌బ్రేకు పడింది. చంటివాడు ఏడుపు లంకించుకున్నట్టు కీచుమంది కారు —

ఆరడుగుల ఎత్తూ, తొంభయి కిలోల బరువూ ఉన్న రావ్ ఈ ఊపుకి ముందుకు తూలిపడ్డాడు — బాంబు పేల్చినట్టుగా అరిచేడు, "వ్హాట్ నాన్సెన్స్! సడన్‌బ్రేక్ ఎందుక్కొట్టేవ్ !?" అసలు బ్రేకు కొట్టకుండా, పాలరాతి గచ్చుమీద గోళీకాయ దొర్లినట్టుగా కారు నడపగలడని ధన్ అంటే ఇష్టం డాక్టర్ రావ్‌కి— ఏ మాత్రం కుదుపూ భరించలేడాయన— నిరంతరం ఆలోచించే అతడి మెదడుకి కుదుపు అంతరాయం!

"ముష్టోడు కోరుండి కార్కింద పడ్డాడ్సార్! బ్రేక్ కొట్టకపోతే సచ్చును!"

"చావనివ్వాల్సింది! ఈ ముష్టి వెధవల్ని రోడ్డు మీదికెందుకు రానిస్తున్నారు? దె షుడ్ బి షాట్ డెడ్ !" కోపం పట్టలేక అరిచేడు — ఈ దేశంలోని ముష్టి జనమందరినీ దూర్వాసముని భస్మం కమ్మని శపించినట్టు అతడి కళ్ళలోంచి కోప జ్వాలలు రేగేయి— "ఐ కెన్ టాలరేట్ ఎనీ బడీ బట్ నాట్ బెగ్గర్స్ !" అని అతడి మనసు అరిచింది!

"ఇయ్యాళ మహాళయం కద్సార్? మార్వాడీ వోళ్ళు సంతర్పణ జేస్తున్నార్సార్! ఎక్కడ జూసినా ముష్టోళ్ళే! సచ్చినోళ్ళ సొరగం నించి దిగుతారు కదా సార్ ఇయ్యాళ?" ధన్ చెప్పేడు —

"బ్లాక్ మార్కెట్లనీ, బెగ్గర్సనీ సృష్టిస్తున్నదీ వ్యాపారస్తులే! ఎటుపోతోందీ దేశం! దీజ్ సూపర్ బాస్టర్డ్స్!" ఆంగ్లంలో తిట్టేడు డాక్టర్ రావ్ —

కారింకా కదల్లేదు— ఎందుకంటే కారు చుట్టూ ముష్టిమూక మూగేరు — కారు కింద పడ్డ ముష్టివాడు అరుస్తున్నాడు ఏ మాత్రం దెబ్బా తగలకపోయినా!

"ఏం బాబో! తమరికి కార్లయితే ఉండొచ్చు! గాని తమకి దేవుడు కళ్ళివ్వనేదా? తమరు గొప్పోళ్ళవొచ్చుగాని యిది పబ్లీకు రోడ్డు! యీడని తమరెంతో మావూ అంతే! తమది గొప్ప తమరింటికాడ! నేను జస్తే నా పెళ్ళాం, పిల్లలే టొదురు? తమలాటోరు బతికినా సచ్చినా లచ్చే!..." దెబ్బతిన్న కుక్క కుయ్యో మొర్రో మన్నట్టు, దెబ్బతినకుండానే తిడుతున్నాడు —

"షటప్!" డాక్టర్ రావ్ అరిచేడు — వీళ్ళకి చిన్నా పెద్దా తారతమ్యం లేదు — భయభక్తులసలే లేవు.

"బాబూ! ఆడితో తగువేల తమకి? అక్కునక్కువుగా సచ్చుండును! దేవుడి దయవొల్ల బతికిపోనాడు! ఓ వొందనోటిలా పారిండి! మావందరం తమరి పేర్జెప్పకొని 'సా' నీళ్ళు తాగుతాం!" అన్నాడు జెండాకొయ్యలా కనిపిస్తున్న ఆ ముష్టిమూక నాయకుడు! మాట్లాడినప్పుడు ముందరి పళ్ళు లేవని, నోటినించి వచ్చి మీదపడే ఉమ్మి తుంపర్లు చాటుతున్నాయి — పదివేల సంవత్సరాలు తపస్సు చేసి వాల్మీకంలోంచి బయటపడ్డ మునీశ్వరుడిలా ఉన్నాడు — జుత్తూ, గడ్డం పండిపోయింది — బొమికలమీద చర్మం అంటించినట్టుంది — గోచీ ఉన్నా లేనట్టే!

అప్పుడు ధన్ కార్లోంచి కిందకి గెంతి, ఆ కారు కిందపడి చావని వాడి పృష్ట భాగంమీద కాలి బూటుతో ఓ తన్ను తన్నేడు — వాడు పది అడుగులు ముందుకు గెంతి ఆ దెబ్బ తగలకుండా తప్పించుకున్నాడు — "బికారి యెదవల్లారా! మీరంతా ప్లానేసుకుని ఆడిన్నాటకం నాకు తెలీదేట్రా? యిదేం కొత్తా? యిది సేటుగాడి కారుగాదు! గోర్మెంటోరి కారు!..." అంటూ బండబూతులు తిడుతూ తన్నడానికి మీద పడేసరికి ముష్టిమూక చెల్లాచెదురయింది.

ధన్ మళ్ళా కార్లో కూర్చొని రామబాణంలా కారుని తోలుతూ అన్నాడు, "యిదే యీళ్ళ యాపారం సార్! ఫారిన్ కారెంచుకుని దానికింద బడతారు! బ్రేకులు టక్కున బడతాయని ఆళ్ళకి దెల్సు! తరవాత దమాయించి డబ్బులు గుంజుతారు!"

డాక్టర్ రావ్ వెనక్కు చేరబడి... "విమానం అందుతుందా? ఈ ఫ్లయిట్ తప్పిపోతే రేపటిక్గాని మరోటి లేదు!" ఆత్రంగా అన్నాడు.

"అందించే పూచీ నాది సార్!" అన్నాడు ధన్, ఏక్సిలరేటర్ నొక్కి.

"ఐ హేట్ ది బెగ్గర్స్!" అనుకున్నాడు డాక్టర్ రావ్ — విదేశాలలో మచ్చుకొక్కడన్నా అగపడ్డే! మన పురాణేతిహాసాలు దానం, ధర్మం అంటూ ముష్టిమూకని తయారుజేసేయి — ఈ దేశం బాగుపడాలంటే కనిపించిన ముష్టివెధవల్నందర్నీ కట్టకట్టి కాన్సెంట్రేషన్ క్యాంప్‌లో పడేసి వాళ్ళచేత సల్ఫర్ గనుల వంటిచోట పని చేయించాలి! ఓసారి ముష్టెత్తడం మరిగినవాడు మరేం చెయ్యడు — ఆఖరికి దొంగకూడా కాలేడు.

ఈసారి రష్యా ప్రధాని వెళ్ళినప్పుడు, వాళ్ల సైబీరియాలో వీళ్ళను తీసుకెళ్లి పడేడానికి చోటిమ్మని బ్రెజనేవ్‌ని అడగమని చెప్పాలి.

"ఓవర్ ఎడ్యుకేషను, అండర్ ఎంప్లాయ్‌మెంటూ ఈ దేశాన్ని పట్టుకున్న పీడలు! ఏడో క్లాస్‌తో చదువాపేసి, నూటికి ఎనభై మందిని వారికి సరిపోయే వృత్తివిద్యలు నేర్పి, ఎవరికాళ్ళమీద వాళ్ళని నిలబడగలిగేలా చెయ్యాలి! ఎందుకీ వేలకొద్దీ కాలేజీలూ, వందలకొద్దీ యూనివర్సిటీలూనూ? మరింత నిరుద్యోగ సమస్యని దేశానికి తెచ్చిపెట్టడం తప్పిస్తే! డిగ్రీలున్న వాళ్ళే కదా ఉద్యోగం ఇస్తావా చస్తావా అని ప్రభుత్వం నెత్తిమీద కూచుంటోన్న వాళ్ళు? మనకున్న ఇంజనీర్లు, డాక్టర్లు, ఆర్ట్స్, సైన్స్ పి.జీలూ...వీరిలో ఎందరు సరుకున్నవాళ్ళు? లక్ష కొకడు! తక్కిన మూకంతా ఉత్తి ఊక!" అని డాక్టర్‌గారోసారి కూతురు ముందంటే ఆమె ఎగతాళిగా నవ్వింది!

"డాడీ! వాడూయూ టాక్! ఎంత చదువుంటే అంత కల్చర్! అందరూ ఎద్దుల్లా అయిపోవాలంటావ్! కాని మన చదువుకున్న యువతరం ఏమీ తక్కువ తినలేదు! వాళ్లంతా జెట్స్! రాకెట్స్! అవకాశం ఇయ్యి, అంతరిక్షంలోకి ఎగిరిపోగలరు!" అంటూ ప్రతిఘటిస్తుంది.

"బేబీ! నువ్వేం చేసేవ్ ఇంత చదువు చదివి?" అంటే ...

"చదువుకోబట్టే కదా కీట్సునీ, షెల్లీనీ చదివి అర్థం చేసుకొని, ఆనందించగలుగుతున్నాను? చదువుకోబట్టే కదా కల్చర్డ్ సొసైటీలో తిరగ్గలుతున్నాను? నన్ను పొలాల్లో కూలిమనిషిగా ఇమేజిన్ చెయ్యగలవా డాడీ?" అంటూ తిరిగి ప్రశ్నించింది.

"అదే నయం! వాళ్ళు ఆనందంగా లేరనీ, వారిలో సౌందర్యోపాసనా జ్ఞానం లేదనీ ఎలా అనుకుంటున్నావ్ బేబీ? మనదేశానికి కావల్సింది సూపర్స్టిషన్సూ, లేజీనెస్సూ పోవడం! రోజుకి కనీసం ఎనిమిదిగంటలు పని చెయ్యగలగడం!"

"పని చూపు! చేస్తారు!"

"పనికేం? ఎక్కడ పడితే అక్కడే ఉంది — మనకి లేనిదల్లా ఇనీషియేటివ్, డ్రయివ్, కమిట్‌మెంట్ ఎండ్ డెడికేషన్!" అని డాక్టర్ రావ్ అంటే, నవ్వేసి భుజాలెగరేసింది బాత్రిస్!

"వచ్చేసేం సార్!" అన్నాడు ధన్స్ ఎయిర్‌పోర్ట్‌లోకి కారుని పోనిచ్చి.

విమానాశ్రయం వచ్చే పోయే జనంతో రద్దీగా ఉంది. ప్రయాణికుల కన్న విజిటర్సే ఎక్కువ. ఒక ప్రయాణికుడు వచ్చినా, వెళ్ళినా, అతణ్ని రిసీవ్ చేసుకుందుకీ, వీడ్కోలివ్వడానికి బంధుమిత్ర సపరివారం తయారు!

ఇక్కడి వ్యక్తుల ప్రవర్తనే వేరు! ఎరువు తెచ్చుకున్న విదేశీ సంస్కృతి, భారతీయులమని చెప్పుకుందుకి చిన్నతనం, విదేశీ భాషని విదేశీ యాసతో మాటాడాలన్న తపన, ఎగ్జిక్యుటివ్ ఉద్యోగాలూ, కార్లూ, బంగళాలూ ఉండగా

రేపటి తిండి గురించి నిశ్చింత; ధనదాహం, అధికార దాహం, హోదా దాహం, తమ అంతస్థు చాటకుండా మన్న తహతహ; తమ సంతతిని తమకన్నా పెద్ద అంతస్థుకి ఎలా పంపడమా అన్న చింత; వీటన్నింటితో సతమతమయ్యే మనుషులతో కిక్కిరిసిన చోటు విమానాశ్రయం!

ప్రజల డబ్బుతో ఎగిరే ప్రభుత్వోద్యోగులు, నిర్మాతల సొమ్ముతో ఎగిరే సినీనటులు, నటీమణులు, ఓ గంటకాలం కలిసొస్తే పదిలక్షల లాభం చేసుకో గలిగే వ్యాపారస్థులూ, తండ్రులార్జించిన నల్లడబ్బుని తమ శృంగార యాత్రలకి తెల్లగా ఖర్చుపెట్టే యువతీ యువకుల జంటలు మసిలే స్థలమది!

మురికీ, దుర్గంధం, ఈగలు, దోమలు ఇరుకు గదులు, జనరల్ రైలు పెట్టెల్లో నిలబడి ప్రయాణాలూ, కర్రలతోనూ, కొయ్యిలతోనూ వంట, మురికి పేటలూ, లేమీ, దరిద్రం వీరికి తెలీవు—

వీరు కట్టుకొనే బట్టలూ, కట్టుకొనే తీరే వేరు— వీరు మాట్లాడే మాటలూ, వాటితీరు తెన్నులూ వేరు— వారు తెలుగే మాట్లాడినా, ఆ పదాల భావం మీకర్థంకాదు— తినబోయే తిండి గురించే వారు ముచ్చటించుకుంటున్నా ఆ తిండ్లమిటో మీరెప్పుడూ వినిఉండరు— వారి సినీమాలు, వారి హోటల్సు, వారి వినోద స్థలాలూ, వారి నాట్య సంగీతాలూ, వారి సాహిత్యం, వారి అభిమాన నటీనటులూ అంతా వేరు, వారు భారతీయులా? కారు! అమెరికన్లా? కారు! బ్రిటిషా? కారు! నీగ్రోలా? ఛీ! పొడు! యురోపియన్లా? అబ్బే కారు! మరెవరువీరు? భారతీయులమనే బురఖా వేసుకున్నా, కొందరు అమెరికన్లూ, కొందరు బ్రిటిషర్లు — కొందరికి ఫ్రాన్స్ అంటే ప్రాణం — కొందరికి ఆఫ్రికాలో సఫారీ అంటే ఇష్టం—"వీరంతా అవకాశం దొరికితే చాలు, నిన్నూ, నీ దేశాన్ని వదిలి పెట్టిపోయే దగాకోర్లు !" అంటూ ఓ ప్రముఖ ఆంగ్లపత్రిక ఆ మధ్యన రాసిన వ్యాసం వీరి కోపానికి గురయింది !

---

శ్రీ సర్దార్ పటేల్ ఆర్ట్ థియేటర్స్ ప్రొద్దుటూరువారి వార్షికోత్సవ సందర్భంగా రాయలసీమ ప్రముఖ జానపద సంగీత కళాకారుడు శ్రీ కె. మునయ్యని సన్మానిస్తున్న మునిసిపల్ ఛైర్మన్ శ్రీ ఐ. సుబ్బారెడ్డి. మధ్యలో ఉన్న సంస్థ అధ్యక్షుడు శ్రీ జి. జయరామిరెడ్డిని కూడా చిత్రంలో చూడవచ్చు.



# తద్దినం

"గుడ్ మార్నింగ్ డాక్టర్ రావ్ !" కోకిల కంఠం !

డాక్టర్ రావ్ ఉలికి పడ్డాడు! ఎదురుగా చూసేడు— ఓ పాతికేళ్ల సుందరి ఎదురుగా వచ్చి స్వాగతం పలికింది— ఆమెతోపాటే మరో ఇద్దరు యువతులు, ముగ్గురు యువకులూ ఉన్నారు—

"ఓహ్ ! సునీతా ! హల్లో సరళా ! హల్లో నీలూ ! హల్లో వినయ్!..." అంటూ పేరు పేరునా పలకరించి, ఇంతమంది తనకి వీడ్కోలివ్వడానికి వచ్చినట్టు గ్రహించి, అహం ఆకాశమంత ఎత్తు ఎగరగా గర్వపడుతూ,... "ఏమిటిది ? మీరంతా వచ్చారెందుకు ?" అన్నాడు డాక్టర్ రావ్, వారు రావడం పట్ల ఏ మాత్రం అయిష్టత కనబరచక—

వీరంతా డాక్టర్ రావ్ గారి స్పేస్ రీసెర్చి సెంటర్‌లోని జూనియర్ రీసెర్చి సైంటిస్టులు— అందరూ డాక్టరేట్‌లు ఏనాడో పుచ్చుకున్నవారే— కాకా పడితేనే కాని కాలం గడవదనీ, భావి ఉజ్వలంగా ఉండదనీ వారికి క్షుణ్ణంగా తెలియడంవల్ల, వీరిలో బాగుపడే లక్షణాలుండడం వల్లా, "ఎవర్నో లాకాయి లూకాయి సామంతుల నెందుకూ? ఏకంగా రాజుగార్నే ఆశ్రయించడం వల్ల తక్కిన వాళ్లనంత పట్టించుకో నావసరం లేదు !" అన్న నిర్ణయం తీసుకొని, ఇన్నర్ సర్కిల్‌కి దగ్గరగా ఉంటున్న యువతీ యువకులు వీరు !

సునీతరావ్‌గారి బ్రీఫ్ కేసందుకోగా, "మీ కెందుకు శ్రమ !" అంటూ ఆమె చేతి నించది ఒడుపుగా తీసుకున్నాడు వినయ్— నీలూ అతడికి గులాబీపూల బొకే అందించగా, సరళ, "బ్రాతిస్ మూడ్ ఎలా ఉంది సార్ ఇవాళ ?" అంటూ రావు గారి అనుంగు పుత్రిక గురించి అడిగి అతడికి మనోల్లాసం కలిగించింది —

ఒకరు మిసెస్ రావ్‌గార్ని పొగడగా, ఒకరు రావ్‌గారి కోటు మీదనించి ఇమాజినరీ క్రిమిని చేతితో తీసి పారేసేరు —

"విమానం డిపార్చర్ టయిమయిందేమో ?" డాక్టర్ రావ్ ఆత్రంగా అడిగేరు —

సరళ కిలకిలా నవ్వింది ... "డిపార్చర్ టైమేనాడో అయిపోయింది సార్ ! మీ కోసమని హమీదాతో చెప్పి ఆపుజేసేం !" అంది ఓరగా చూస్తూ —

"ఎవరీ హమీదా ? పి. ఎమ్.కి కొత్త హెయిర్ డ్రెస్సరా?" అంటూ డాక్టర్ రావ్ అనేసరికి అందరూ ఒక్కసారిగా పగలబడి నవ్వేరు — "అబ్బ మీరు కడుపుబ్బా నవ్వించగలర్సార్ !" అంది సునీత —

"ఐ ఏమ్ నాట్ జోకింగ్ ! విమానం ఆపగల శక్తి మరెవరికుంది ?" అన్నారాయన వారితోపాటు నడుస్తూ — అందుకు మరింత విరగబడి నవ్వేరందరూ —

"హమీదా ఈ ఫ్లయిట్‌కి ఎయిర్‌హోస్టెస్ సార్ —" అంది నీలూ.

"ఓ ! ఆమె కంత పవరుందా ?"

"ఉంది సార్ ! ఈ ఫ్లయిట్ పైలట్‌మీద !" అంటూ ముసి ముసి నవ్వులు నవ్వింది — "హమీదా సరళకి దగ్గరి స్నేహితురాలు !"

"థాంక్స్ సరళా !" అన్నాడు డాక్టర్ రావ్ ఆమె భుజం తట్టి —

ఈ అమ్మాయిలు ఇంత సెక్సీగా బట్టలు కట్టుకొని, తనని కవ్వించి, నవ్వించి సరదాగా కబుర్లాడినా, ఓనాడూ తనలో సెక్స్ ఇన్‌స్టింక్ట్ నిద్ర లేవలేదు ఎందుకో ? దానికి సమాధానమూ అతని మనసుకి తడుతుంది — వీరు నవ్వే నవ్వులూ, కనిపించే ఆప్యాయతా, దగ్గరితనం కేవలం వ్యాపార సరళి ! తను ఈ హోదాలో ఉండకపోతే, లేదా తను ఈ సీటు రేపు కాళీ చేస్తే ఎవరన్నా వీరిలో తనతో మాట్లాడతారా ? మాటాడరు ! అందుకు డాక్టర్ రావ్ కళ్లకి వీరంతా సొఫిస్టికేటెడ్ హ్యూమన్ గేడ్జెట్స్‌లో కనిపిస్తారు తప్ప ఆత్మీయుల్లా కనిపించరు !

"సార్ ! మీరు తిరిగి ఎప్పుడు, ఏ ఫ్లయిట్‌కి తిరిగొస్తారు ?" సునీత అడిగింది ఆయన పక్క పక్కనే పులుముక నడుస్తూ —

"ఏముందీ ? రేపు ఈవినింగ్ ఫ్లయిట్‌లో వచ్చినా ?" అన్నాడు డాక్టర్ రావ్ మామూలు ధోరణిలో... "కాని మీరెవ్వరూ శ్రమ తీసుకొని ఇంత దూరం రాకండి !"

"సో సూన్ సర్ ? వెళ్లక వెళ్లక ఇంటికి వెళ్తున్నారు కదా ? మిసెస్ రావ్‌గార్ని, బ్రాతిస్‌నీ కూడా తీసుకెళ్లవల్సింది సార్ !" నీలూ అనునయంగా అంది.

"వాళ్లకా వాతావరణం పడదు ! ఏముందీ వైజాగ్‌లో దిగి, కారులో విజనారం వెళ్లి పని పూర్తిచేసుక వచ్చేడమే... ఓ గంట పని !" డాక్టర్ రావ్ తన బ్రీఫ్‌కేస్ తిరిగి అందుకుంటూ విమానం కేసి నడవడానికి ఉద్యుక్తుడయ్యేడు.

హమీదా ఎదురుగా వచ్చి, "గుడ్ మార్నింగ్ డాక్టర్ ! షెల్ ఉయి గో ?!" అంది నమస్కరిస్తూ, చిరునవ్వుతో.

"సారీ ఫర్ ది ట్రబుల్ హమీదా ! ఎండ్ థాంక్యూ వెరీమచ్ !" డాక్టర్ అన్నాడు ఆమె భుజం తట్టి —

"ఒక్క గంట పనేనా సార్ ?" ఆశ్చర్యపోతూ అడిగింది సునీత.

"వేములుంటే అరగంటలో అంతా పూర్తి చేస్తాడు !"

"ఎవర్సార్ ఆయన ? సైంటిస్టా ?" అని సరళ అడిగేసరికి డాక్టర్ రావ్ ఫకాల్న నవ్వి...

"ఔను! సైంటిస్టే! స్వర్గంనించి మా నాన్నారి ఆత్మని మంత్రాలతో బంధించి తెస్తాడు !" అన్నాడు ఓ పజిల్‌నిచ్చి సాల్వ్ చెయ్యమన్నట్టు ముఖంపెట్టి—

"అంటే ఏఁవిఁటి సార్ ? ఎనీ సూపర్ నేచురల్ ఎక్స్పెరిమెంట్ ?" సునీత ఆశ్చర్యపోతూ అడిగింది...

ముందుకు వెళ్తున్న డాక్టర్ రావ్ ఆగి ఒక్క అడుగు వెనక్కువేసి, తల ఎత్తి అంతరిక్షంలోకి చూస్తూ గొణిగేడు... "వెరీ సింపుల్ ! మా తండ్రి తద్దినం !" ఆ మాటలని వారి ముఖాలకేసి చూడకుండా, గబగబా పెద్ద అంగలు వేసుకుంటూ పోయేడు స్పేస్ రీసెర్చి సెంటర్ ఛైర్మన్ డాక్టర్ రావ్ !



సి.హెచ్. ఎన్. ఆర్. — నత్తెనపల్లి

తాజ్‌మహల్ నిర్మించిన షాజహాన్ నిర్మాణం పని పూర్తి అయిన తరువాత పనివారల చేతులు ఖండించాడని చెప్తారు.

★ చేసేవుంటాడా మహానుభావుడు. అంత అందాన్ని సృష్టించిన చేతులమీద కసితోకాదు, అదింకెవరికీ తిరిగి సృష్టించకుండా వుండడానికై వుంటుంది. తాజ్‌మహల్ నన్నెంత కదిలించిందో—చరిత్రలో షాజహాన్ అంటే అంత ఒళ్లుమంట నాకు.

బందిపోటు అయిన పూలన్‌దేవి మీ దృష్టిలో భారత వీరనారీమణా ? దేశద్రోహి ?

★ రెండూ కాదు. కార్బన్ కాపీ ! పరిస్థితులకు బానిస.

వి. ఎల్. డి. — కంచరపాలెం

ఎంత మంది మారినా ఆరుద్ర లాంటి మహా మనిషి, నా లాంటి వ్యక్తులు పుట్టుకతోనే ఒక పార్టీకి కట్టుబడి పోయాము. మా కోరిక లెప్పుడు తీరుతాయో— అప్పుడే గాంధీగారి సూక్తి సూర్య కిరణంలాగా ప్రకాశిస్తుంది. మరి ఆ రోజు వస్తుం దంటారా ?

★ వస్తుందో రాదో నాకేం తెలియదుగాని ... మీ మాటలు వింటూ వుంటే— నాకో యీసబు కథ జ్ఞాపకానికి వస్తూంది. ఒకసారి ఒక ఏనుగు ఒక వంతెన దాటుతోందిట. దాని చెవి దగ్గర కూర్చున్న జోరీగ కాస్త గర్వంగా "చూశావా— ఎంత సులభంగా దాటేస్తున్నామో వంతెన" అందిట. అలా వుంది— మీ కథ ! ఆరుద్ర సాహితీ స్రష్ట. మీరో? తొలి నవల రాయాలనీ— దాన్నెలా "రిజిస్టరు" చేయాలనీ తాపత్రయ పడుతున్న జోరీగ. "పెన్సుకి ప్రాత్రపతి పంపాలా ? ప్రింటెడ్ బుక్ పంపాలా" అని సందిగ్ధంలో కొట్టు మిట్టాడు తున్నారు !!

గణేశ్ — ఆదోని

సినిమాలలో సహజత్వం దూరం అంటారే, మీ రచయిత్రులు రాస్తున్న నవలలలో ఏ మాత్రం సహజత్వం వుంది ?

★ సినిమా అక్షరాలు రానివాళ్లు సహితం చూసి ఆనందించకల — మీడియమ్. అక్షరాశ్యులకు పరిమితం నవల. చదువుకున్నవాళ్లు నేలవిడిచిసాము చేస్తే బాగుండదని మీరనుకుంటున్నారు. కాని ఈనాడి నవలలలో చాలా భాగం రాస్తున్నదీ, చదువు తున్నదీ కూడ ఒక రకం నిరక్షరాశ్యులే. అందుకే అంత వింత పోకడలు పోతున్నాయి ... వాస్తవికత కోసం వారు పఠితలకి దూరం అవాలా ?! హృదయాలని దోచుకోవడానికి బుర్ర పనిచేయ కూడదు. ఎందుకండీ ఈ అనవసరపు చర్చ ? అవాస్తవికమైన సినిమాలు — మీరు చూడ్డంలేదా ? అలాగే అవాస్తవికమైన నవలలూ చదవండి. తప్పేముంది ?

డి. ఎన్. ఆర్. — విజయవాడ

నాకు ద్వేషించటం అలవాటైపోయింది... కూడదనుకుంటాను. కాని కుదరడంలేదు.

★ ద్వేషించడం— తనకు తానే శిక్ష విధించు కోవడం లాంటిది. తమ ద్వేషం— తమనే హరిస్తుంది— ఎదుటివారిని కాదు. గ్రహించాలి.




జె. ఎల్. వి. — మచిలీపట్నం

నాకామె నచ్చింది. నేను డైరెక్టుగా ఆమె తండ్రిగారిని కలుసుకుని చెప్పాను. మీది ఏ శాఖ అని అడిగారు. వైదికులమని చెప్పాను. "మేము నియ్యోగులం — వైదికులకి పిల్ల నివ్వను మీరిక వెళ్లవచ్చు" అని ముఖంమీద చెప్పారు. ఆయనో లెక్చరరు. ఈ వైదికుల నియోగుల యుద్ధం ఎప్పుడు ప్రారంభమైంది?

★ శాఖలు ప్రారంభమైనప్పుడే అయి వుంటుంది ! అయినా మీరు అదృష్టవంతులు — ముఖంమీద చెప్పి పంపాడు — ఏదో ఒంకలు ఎంచక. సంతోషించండి... అంత గిరిగీసుకున్న వారిమధ్య వూపిరి సలపదు... ఈ రోజుల్లో నేను శాఖాహారా ? మాంసాహారా ? అనే చూస్తానుగాని — కులం గోత్రం చూడను. ఇదేనా — అలవాట్లు ఇబ్బంది పెట్ట కుండానేగాని — తినకూడదని కానేకాదు.

అరవింద్. — హైదరాబాదు

నరకానికి ప్రధాన ద్వారము స్త్రీ అని భారతీయ సామెత.

★ చిత్తం. ఈ భూమ్మీద స్వర్గం సృష్టించ కలది కూడా ఆమే ?

జె. టి. ఆర్. — హిజిగుం, అస్సాం

స్త్రీకి కూడా శరీరం వుంది వ్యాయమం ఇవ్వాలి. మెదడు వుంది. జ్ఞానం యివ్వాలి — హృదయం వుంది — అనుభవం యివ్వాలి — అన్న చలం పలుకులు ...

★ ఎవరివ్వాలో చెప్పినట్టులేదు చలం !! మగవాడివ్వాలనా ? స్త్రీ సాధించుకోవాలనా ?! నిజంగా చలంగారు స్త్రీలకి — ఎలాంటి స్వాతంత్ర్యం కావాలని కోరారో చెప్పడం కష్టం. లేచిపోవడానికి, ఉంచుకుందుకు, వ్యభిచరించడానికి — స్త్రీలకి స్వేచ్ఛ ఎవరో యివ్వక్కరలేదు. ఇక మిగిలిన విషయాల సంగతే — మహిళా ఉద్యమ కర్తలు ఆలోచిస్తున్నవి. వ్యభిచరిస్తే—స్త్రీకే శిక్షకూడదు; లేచిపోతే—పతిత అనడం తప్పులాంటివి ఆలోచించండి అంటున్నారు. నాగరిక ప్రపంచంలో స్త్రీని వ్యక్తిగా చూడడం ప్రారంభించిననాడు...స్త్రీని "స్త్రీగానే" ఆలోచించవలసిన అవసరమే వుండదు; ఇప్పుడెవరేనా "నేను నాభర్తని వదిలాన"ని చలానికిచెప్తే "వద్దు. సుఖంగా వెళ్లి కాపురం చేసుకో" అంటారని నా నమ్మకం !

కె. ఎన్. ఆర్. — మెట్టూరు

ప్రేమించిన మగవాడు మోసపోతే, ఇంకొకామెను ప్రేమించి పెళ్లాడి — సుఖంగా వుంటాడు. అదే ప్రేమించిన ఒక ఆడది మోసపోతే ఏమౌతుంది ?

★ మన సినిమాలు, నవలలనుపట్టి చూస్తే — బిడ్డతల్లి అవుతుంది ! లేకపోతే — పతిత అవుతూంది. లేదా — మళ్లీ పెళ్లాడినా — నానారకాల మానసిక హింసలకీ గురిచేయబడుతూంది. (ఇదంతా ప్రేమింపబడి — మోసగింపబడిందని అందరికీ తెలిస్తేనే !) ★

'మదరాసు తెలుగు నాటక అకాడమీ' వారు ఇటీవల నాలుగురోజులపాటు నాటకోత్సవాలు నిర్వహించారు. ఆ సందర్భంగా ఒక శతాబ్దంగా నాటక కళకి అంకితం అయిన "సురభి కళామండలి" వారు 'కృష్ణలీలలు', 'మాయాబజారు' నాటకాలని ప్రేక్షక జనరంజకంగా ప్రదర్శించారు. 'మాయాబజారు' నాటకంలో ఒక దృశ్యాన్ని చిత్రంలో చూడవచ్చు.





# సినిమా



'పులి–బెబ్బులి'లో జయప్రద

## "అఖండుడు"లో అసాధ్యుడు!

సారాయి దుకాణం. ముత్తయ్య (చిడతల అప్పారావు) సీసామీద సీసా చొప్పున సారా తాగుతున్నాడు. దుకాణం యజమానురాలు గజలక్ష్మి (కల్పనారాయ్) "యికసాల్లే అల్లుడో! యిప్పటికే శానా తాగావ్!" అంది.

"ఎన్ని గలాసులు నీళ్ళు గలిపావే! నిసా ఎక్కటం లేదు," అన్నాడు ముత్తయ్య మూతి తుడుచుకుంటూ.

"ప్సస్సే... పాలల్లో నీళ్ళు గలిపితే పుణ్యం. సారాలో కలిపితే పాపమని పోయేముందు మా అయ్య సెప్పాడు," అని గజలక్ష్మి అంటూండగా, "కలిపావో—లేదో నేను సెబుతానే!" అంటూ సాంబయ్య (శోభన్‌బాబు) ప్రవేశించాడు. ఒక సారా సీసాను తీసుకొని, మూతను వేలితో లేపి, మంచినీళ్ళు తాగినట్లు చెయ్యి అడ్డు పెట్టుకొని గడగడాతాగేశాడు. "పాతిక శాతం సారా. మిగతాది పంపునీళ్ళ," అన్నాడు.

"ఆఁ!" అంటూ ముక్కుమీద వేలేసుకుంది గజలక్ష్మి.

"ఇంకోటియ్యే!" అన్నాడు ముత్తయ్య.

సాంబయ్య ఇంకో సీసా తాగి, "ముప్పయ్ శాతం గోర్మెంటోడిది. మిగతాది లోకల్," అన్నాడు. ఆ తర్వాత మూడోసీసా ఖాళీచేసి, "ఇది పర్వాలేదే— అంతఃపురాల్లో దాచిన ఆడదాన్లా గుంది... పదరా, పోదాం," అన్నాడు.

గజలక్ష్మి గుండె ఝల్లుమంది. "ఎక్కడికి పోయేది, అల్లుడూ! డబ్బులిచ్చెల్లు," అంది.

"నాకేం పనే! ఆడు రుసి చూడమన్నాడు. చూసాను. ఆకేసినోణ్ణడగాలిగాని, కూకున్నాణ్ణడిగితే యెట్టా?" అంటూ సాంబయ్య కదిలితే, "నా కాతాలో రాసుకోయే!" అంటూ ముత్తయ్య అనుసరించాడు.

"అట్టాగా!" అని గజలక్ష్మి పళ్ళుకొరుకుతూ "ఒరేయ్, బండోడా!" అని పిలవగానే దుక్కలాగున్న వాడొకడొచ్చాడు. వాడ్నిచూసి ముత్తయ్య వణికిపోతూ "అమ్మో— వద్దులే... యీడయితే బొమికలిరగ దీస్తాడు. రేపొచ్చి డబ్బులిత్తాను. అందాకా ఈ మురుగులు నీకాడెట్టుకో," అంటూ మురుగులు ఇవ్వబోయాడు.

ఆ మురుగులు చూసి, కళ్ళు విదిలించుకున్న సాంబయ్య "రేయ్! దొంగనాకొడకా! యెక్కడియిరా ఈ మురుగులు?" అంటూ ఫెడేలున ఒక్కటిచ్చాడు. "పేనాల్దీస్తా. నిజం చెప్పు!"

ముత్తయ్య ఏడుపు ముఖం పెట్టాడు. "మీ నాయనమ్మయే."

"ఇటియ్!"

"నేనియ్యను. సుక్కురారం పూట సేతికందిన బంగారం తిరిగియ్యమంటావా?"

ముత్తయ్య చేతిలోంచి సాంబయ్య మురుగులు లాక్కోబోతూండగా గజలక్ష్మి సైగ చేసింది. బండోడు అమాంతంగా సాంబయ్యమీద ఉరికాడు. ఇద్దరికీ హోరాహోరీ పోరాటం జరిగింది. చివరికి బండోడు చిత్తయిపోయాడు. సాంబయ్య ఆ మురుగులతో ముత్తయ్యను పట్టుకొని వెళ్లిపోయాడు.

'రాజస్థాన్ రౌడీలు'లో స్వప్న



# విశేషాలు

-జి. వి. జి.



గజలక్ష్మి గుండెలు బాదుకోసాగింది.

తాతినేని రామారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అట్లూరి పూర్ణచంద్రరావు నిర్మించే లక్ష్మి ప్రొడక్షన్స్ "అఖండుడు" చిత్రం షూటింగ్ పూర్తయింది. రాధిక, లక్ష్మి, విజయలలిత, సత్యనారాయణ, గిరిబాబు, నిర్మల, అత్తిలి లక్ష్మి, నాగేందర్ నాయుడు, మాస్టర్ అలీ ఇతర పాత్రధారులు.

## "మగ మహారాజు"కు నవ దర్శకుడు

గతంలో పలువురు దర్శకులు పరిచయం చేసిన విజయబాపినీడు తాను నిర్మాణ సారధ్యం వహించే శ్యాంప్రసాద్ ఆర్ట్స్ వారి "మగ మహారాజు" చిత్రం ద్వారా మరో కొత్త 'చిరుదీపాన్ని' పరిచయం చేయ మన్నట్లు పాటల రికార్డింగ్ నాడు తెలిపారు. ఆ 'చిరుదీపం' ఎవరో తెలుసుకునేందుకు డిసెంబర్ 6న మద్రాసు బోట్ క్లబ్ లొకేషన్‌లో ప్రారంభమైన ఆ చిత్రం షూటింగ్‌కు వెళ్లేసరికి 'చిరుదీపం' బదులు ఓ 'ఆర్క్‌లాంప్' కనిపించింది. మంద హాసంతో కనిపించిన ఆ ఆర్క్‌లాంప్ విజయబాపినీడే! "తప్పనిసరి పరిస్థితుల్లో నేను డైరెక్టర్నయ్యానే గాని, దర్శకుడుగా ప్రావీణ్యం సంపాదించానని కాదు. మొదట మేం దర్శకుడనుకున్న మౌళి తమిళ చిత్రాలతో చాలా బిజీ అయిపోయినందున మేం ముందుగా తీసుకున్న ఆర్టిస్ట్‌ల డేట్‌లకు ఆయన కాల్‌షీట్లు అడ్జస్ట్ చేయలేకపోయారు. స్క్రిప్ట్ చర్చలలో పాల్గొనని వ్యక్తికి హఠాత్తుగా దర్శకత్వ భారాన్ని అప్పగిస్తే, ఎంత వరకు న్యాయం చేకూరుతుందనే భయంవల్ల - నా మనసులో మెదిలిన భావాలను నేనే సెల్యులాయిడ్ మీదికి మలచడమే మంచిదనిపించింది. మా నిర్మాత 'తధాస్తు' అన్నారు. రెండు నెలలపాటు స్క్రిప్టును పకడ్బందీగా తయారు చేశాం," అన్నారాయన. ప్రతి చిన్న విషయంలోను అత్యధిక శ్రద్ధ వహిస్తూ, ప్రతి చిన్న పాత్ర పట్ల సైతం ప్రత్యేక ఆసక్తి కనబరిచే బాపినీడు ఉత్తమాభిరుచులు ఆయన నేతృత్వంలో లోగడ వెలువడిన అనేక చిత్రాలలో ప్రతిబింబించాయనే విషయం అందరికీ తెలిసిందే. అంచేత, ఇప్పుడు ఈయన దర్శకత్వ ప్రతిభను "మగ మహారాజు" నిరూపించి తీరుతాడని అందరి దృఢ విశ్వాసం. చిరంజీవి, సుహాసిని, రావు గోపాలరావు, నూతన్‌ప్రసాద్, బాలాజీ, కె. విజయ, తులసి, నిర్మల, రాజీవగ్మిని, జయమాలినితో బాటు ప్రముఖ కన్నడ నటుడు ఉదయకుమార్ పాల్గొంటున్నారు. "మార్చికి షూటింగ్ పూర్తవుతుంది," అని తెలియజేశారు నిర్మాత మాగంటి రవీంద్రనాథ్ చౌదరి.

## డూండి సమర్పించే చిత్రాలు

"శశిరేఖా మూవీస్ పతాకంలో ఒక చిత్రం మార్చి 1 న ప్రారంభమై, మే నెలాఖరుకల్లా పూర్తవుతుంది," అన్నారు నిర్మాత పి. బాబ్జీ. విజయనిర్మల దర్శకత్వంలో కృష్ణ, జయసుధ, సుమన్, సత్యనారాయణ పాల్గొంటారు. సమర్పకుడు డూండీ సమకూర్చిన కధకు అప్పలాచార్య సంభాషణలకర్త. సత్యం, పుష్పాల గోపీకృష్ణ, ఎస్. కృష్ణారావు ముప్పగువారు తెరవెనుక కృషి చేస్తారు. ఇదికాక ఆగస్ట్ - సెప్టెంబర్ మాసాలలో బాబ్జీ మొదలెట్టే మరో చిత్రంలో సుమన్ హీరో.




"మీరు రాజకీయాల్లో చేరకూడదూ, మాకు సినిమా ఛాన్సు వస్తుంది!"

# అవి - ఇవి

★ తమిళనాడులో మధ్యాహ్న పౌష్టికాహార పథకం ప్రచార నిమిత్తం "బాలలు నవ్వాలి" అనే డాకుమెంటరీని జయలలిత, మధుర దగ్గర ఓ గ్రామంలో తయారుచేస్తోంది. ఇందులో వాణీ జయరాం ఒక పాట పాడింది కూడా.

★ భాగ్యరాజాతో కలిసి ఏ తారా ఒక చిత్రాన్ని మించి నటించలేదు — ఒక్క రాధిక తప్ప.

★ గాయని సుశీలకు సాయంత్రం వేళల్లో ఇంటి వద్ద రింగ్ టెన్నిస్ ఆడుకోవడం ఓ హాబీ.

★ వైజయంతిమాల ఇటీవల షుమారు రెండున్నర గంటలసేపు 'నాట్టువంగం' పాడేవారి అవసరం లేకుండానే భరతనాట్యం నేర్పించే ఒక ఎల్. పి. రికార్డును వెలువరించింది. దాంతోపాటే భంగిమలను, స్టెప్స్‌ను వివరించే ఓ పుస్తకాన్ని కూడా విడుదల చేయించింది.

★ కొన్ని తెలుగు చిత్రాల్లో 'శివరంజని' పేరున నటించిన తమిళ నటి వడివుక్కరిసు మద్రాసులో అవసరమైన చోటుకు మంచినీళ్ళను సరఫరా చేసే లారీలను ఏర్పాటు చేసింది. ఒకలారీ నీటి వెల రూ 150/.

★ శ్రీలంకకు చెందిన ఓ నిర్మాత మద్రాసులో నిర్మించిన "వసంతత్తిల్ ఒరువానవిల్" (వసంతంలో ఒక ఇంద్రధనుస్సు) చిత్రం పునర్జన్మకు సంబంధించిన ఇతివృత్తం. తల్లీకొడుకులు మరుసటి జన్మలో భార్యాభర్తలవుతారు! ప్రతాప్, రాధిక నటించిన ఈ చిత్రం శ్రీలంకలో మాత్రమే విడుదలైంది.

★ మనదేశంలో 'ఫిలిమ్స్ డివిజన్' 1948లో ప్రారంభించబడింది. ఈ శాఖ తయారుచేసిన తొలి వార్తా చిత్రం 1949లో విడుదలైంది.

★ ఆర్. కె. నారాయణ్ ఆంగ్ల నవల "ఫైనాన్షియల్ ఎక్స్‌పర్ట్" ఆధారంగా బెంగళూరులోని కమల్ ప్రొడక్షన్స్ అనే సంస్థ "మాల్గుడి మార్గయ్య" అనే చిత్రాన్ని మొదలెట్టింది. ఎంచేతో ఏమో — ఇప్పుడా పేరు "బాంకర్ మార్గయ్య"గా మార్చబడింది.

★ "సిల్క్‌స్మిత చాలాకాలం క్రితం నా చిత్రల్లో నటించింది. చక్కని నటి. కాని, ఇటీవల నిర్మాతలందరూ ఆమెను గ్లామర్ పాత్రలకే వినియోగించుకుంటున్నారు. త్వరలోనే నేనామెకు ఓ చక్కని పాత్రను ఇవ్వబోతున్నాను," అన్నారు దాసరి నారాయణరావు. ఈయన రచన, దర్శకత్వంలో తయారయ్యే తెలుగు చిత్రవారి "పాలీసెంకటసామి" చిత్రంలో ఈయన సరసన సిల్క్‌స్మిత ఓ క్లిష్టమైన భూమికను నిర్వహించబోతోంది.

★ మనోజ్‌కుమార్ నిర్మించే "పెయింటర్ బాబు" చిత్రంలో అతని తమ్ముడు రాజీవ్ గోస్వామి హీరో. నాయికగా 'ఈవ్స్ వీక్లీ' నడిపిన అందాల పోటీలో 'మిస్ ఇండియా'గా ఎన్నికైన శశికళ బుక్ ఆయింది. శశికళ పేరున ఇదివరకే ఓ ప్రముఖ తార ఉంది గనుక ఈమె తన పేరును మీనాక్షిగా మార్చుకుంది.

## సినిమా

### డి.రామానాయుడు అందించే చిత్రాలు

"జనవరి 7 నుండి 22 వరకు జరిగిన షెడ్యూల్‌తో 'ముందడుగు' షూటింగ్ పూర్తయింది. సురేష్ ప్రొడక్షన్స్ 14వ చిత్రానికి కె. బాపయ్య డైరెక్టరు. శోభన్‌బాబు, శ్రీదేవి హీరో హీరోయిన్‌లు. మార్చి 10 నుంచి జూలై వరకు కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో హిందీ 'దేవత' షూటింగ్ జరుగుతుంది. ఇందులో జితేంద్ర, శ్రీదేవి, జయప్రద ఉంటారు. జూలై నుంచి బాపయ్య

'దేవుని రూపాలు'లో లక్ష్మి, నిర్మల

డైరెక్షన్‌లో మొదలెట్టే హిందీ 'మండేగుండెలు'లో మిథున్‌చక్రవర్తి హీరో. సురేష్ మూవీస్ 8వ చిత్రానికి మా సంస్థలో బాపయ్య చిత్రాలన్నిటికీ అసోసియేట్‌గా పని చేసిన కె. మురళీమోహనరావును డైరెక్టర్‌గా చేస్తున్నాను. ఇందులో కొత్త ఆర్టిస్టులు ఉంటారు. ఇకపోతే, మా అబ్బాయిలు నిర్మించే చిత్రాలు... డి. సురేష్‌బాబు ప్రొడ్యూస్ చేసే సురేష్ ఎంటర్‌ప్రైసెస్ 3వ చిత్రంలో కృష్ణ, జయప్రద హీరో హీరోయిన్‌లు. విజయనిర్మల డైరెక్టరు. డి. వెంకటేశ్ తయారు చేసే వెంకటేశ్ ఎంటర్‌ప్రైసెస్ 3వ చిత్రంలో మోహన్‌బాబు హీరో. బోయిన సుబ్బారావు డైరెక్టరు," అని డి. రామానాయుడు తెలిపారు

### జంధ్యాల దర్శకత్వంలో కొత్త చిత్రం

పి. శశిభూషణ్ నిర్మించే శ్రీ సారధి స్టూడియోస్ 16వ చిత్రానికి జంధ్యాల దర్శకుడు.










# 100 చిత్రాల్లో కథానాయికగా నటించిన 'మాలినీఫొన్సేకా'తో ఇంటర్వ్యూ

"శ్రీలంకలో ఏటా 30 చిత్రాలు నిర్మించబడతాయి. ఆ చిత్రాలన్నీ దాదాపు సింహళ భాషలోనే రూపొందుతాయి. గతంలో శ్రీలంక ప్రేక్షకులు కథా చిత్రాలపట్ల ఎక్కువ మోజు కనపరచేవారు. ఇపుడు వారి దృష్టి యాక్షన్ చిత్రాల మీదకు మళ్లింది. అటువంటి చిత్రాలనే ఆదరిస్తున్నారు." అన్నది, మాలినీఫొన్సేకా.

## తెలుగు చిత్రం

ఆమె ఇంతవరకు 100 చిత్రాల్లో నటించింది. వాటిలో ఒక తమిళ చిత్రం 'పైలెట్ ప్రేమనాథ్' కూడా వుంది. ఇపుడు మాలినీఫొన్సేకా నవశక్తి పిక్చర్స్ పతాకంపై పి. నారాయణరావు నిర్మించే తెలుగు చిత్రంలో ఒక కథానాయికగా నటిస్తోంది. ఆమె సరసన యీ చిత్రంలో సనత్‌గుణతిలకే నాయకుడుగా నటిస్తారు. ఈ ఇద్దరూ సింహళ చిత్రాల్లో పేరు ప్రఖ్యాతులు పొందిన జంట. జనవరి చివరి వారం ప్రారంభంలో యీ జంట మద్రాసు వచ్చిన సందర్భంగా నవశక్తి పిక్చర్స్ యూనిట్ అడయార్ గేట్ హోటల్‌లో గెట్ టు గెదర్ ఏర్పాటు చేశారు. పరిశ్రమలోని కొందరు పెద్దలు, పత్రికా విలేకరులు యీ గెట్ టు గెదర్‌కి హాజరయ్యారు. తమ తెలుగు చిత్రాన్ని పూర్తిగా శ్రీలంకలోనే నిర్మిస్తామని, అందులో వీరిరువురూ గాక, మరో ముగ్గురు హీరోలు, ఒక హీరోయిన్ కూడా వుంటారని, వారంతా తెలుగువారేనని నిర్మాత నారాయణరావు చెప్పారు.

## సమిష్టి కృషిమీద నమ్మకం

"మీ దేశంలో 'స్టార్ సిస్టమ్' వున్నదా ?" అని అడిగిన ప్రశ్నకు మాలిని సమాధానమిస్తూ "ఉన్నది. అయితే నాకు సమిష్టి కృషిమీదే ఎక్కువ నమ్మకం" అన్నది. సనత్‌గుణతిలకేతో తాను ఆరు చిత్రాలకు పైగా నటించాననీ, వాటిలో రెండు చెప్పుకోదగిన గొప్ప హిట్స్ అనీ చెప్పిందామె. వాటిలో ఒకటి నెవతెహానయ (వియ్ విల్ మీట్ ఎగైన్), మరొకటి : సెవెంత్ డే. ఒక జిప్సీ అమ్మాయి కథ.

"తెలుగు చిత్రాలేమైనా చూశారా ?"

"తెలుగు భాష గురించి, దాని ప్రాచుర్యం గురించీ విన్నాము కాని, తెలుగు చిత్రాలు చూసే అవకాశం లేదు. అవి మా దేశానికి రావు. అయినా ఆమధ్య మా శ్రీలంక టి. వి. లో 'శంకరాభరణం' చూశాను. అది నాకెంతగానో వచ్చింది" అన్నది మాలిని.

## దర్శకత్వం కూడా....

1965 లో స్టేజిమీద ఉత్తమ నటిగా అవార్డు అందుకున్న మాలినీఫొన్సేకా 1967 లో 'స్మాల్ బేబీ' చిత్రం ద్వారా సినిమాల్లోకి ప్రవేశించి యిప్పటికి నూరు చిత్రాలు పూర్తి చేసింది. ఇపుడామె దర్శకత్వం కూడా చేపట్టింది. శ్రీలంకలో మాలినితో కలిపి మొత్తం ముగ్గురు మహిళా దర్శకులున్నారట !

"నేను స్వంతంగా 'పసరచేతనె' (ది సెర్చ్) అనే చిత్రం నిర్మించాను. దీనికి నిర్మాతను మాత్రమే కాదు, దర్శకత్వం, హీరోయిన్ నేనే. ఇది నేను దర్శకత్వం వహించిన మొదటి చిత్రం. మొన్న



ఢిల్లీలో జరిగిన ఫిలిం ఫెస్టివల్‌లో పాల్గొన్నది. నేనూ ఆ ఫెస్టివల్‌కి వెళ్లాను. 'పసరచేతనె' పూర్తిగా యాక్షన్ చిత్రం" అన్నది మాలిని : కాష్మీర్, మద్రాస్, ఢిల్లీ, ఆగ్రాల్లో ఈ చిత్రాన్ని తీయడం జరిగింది. నిర్మాణ వ్యయం 20 లక్షల రూపాయలయింది.

## ఫిలిమ్ కార్పొరేషన్ ద్వారా నిర్మాణం — పంపిణీ !

"మీ చిత్రాన్ని మీరు స్వంత డబ్బుతోనే నిర్మించారా ?" అని అడిగిన మరో ప్రశ్నకు మాలిని సమాధానం యిస్తూ "శ్రీలంకలో చిత్ర నిర్మాణానికి అనువైన ఋణాన్ని నేషనల్ ఫిలిమ్ కార్పొరేషన్ యిస్తుంది. కార్పొరేషన్ మంజూరు చేసే ఋణం రెండున్నర లక్షల రూపాయలు. చిత్రాల పంపిణీని కూడా కార్పరేషన్ హేండిల్ చేస్తుంది. ప్రింట్లు 14 లేక 15 తీస్తారు. ఒక చిత్రంమీద వచ్చే ఆదాయంలో 45 శాతం నిర్మాతకు, 45 శాతం ధియేటర్‌కి, 10 శాతం ఫిలిమ్ కార్పొరేషన్‌కి వెళ్తుంది" అన్నది.

చలన చిత్రాలకు సంబంధించి తమ దేశంలో ఆరు సర్క్యూట్స్, 350 థియేటర్లు వున్నాయని, ఒక చిత్ర నిర్మాణం రెండు, మూడు నెలల కాలంలో పూర్తి చేయడం జరుగుతుందని, ఏటా 25 నుంచి 30 చిత్రాలు తయారవుతాయని సనత్‌గుణతిలకే చెప్పారు. ఆయన 1978 లో సినిమాల్లో ప్రవేశించి ఇంతవరకు 48 చిత్రాల్లో నటించారు. మాలినీ ఫొన్సేకాతో ఆయన నటించిన తొలి చిత్రం 'ప్రిన్సెస్'.

## సెన్సారు అక్కడే నయం

శ్రీలంకలో సెన్సారు గురించి మాట్లాడుతూ "చిత్రాల్లో హింస వుంటే చాలా స్ట్రిక్ట్‌గా అబ్జర్వ్ చేస్తారు. అయితే సెక్స్‌ని గురించి ఎక్కువగా పట్టించుకోరు" అన్నది మాలిని.

మన దేశంలో సెన్సారు కన్న శ్రీలంకలోని సెన్సారువారే నయమన్న మాట, కనీసం సెక్స్‌ని అయినా వదిలేస్తున్నారు !

— మోహన్ కుమార్

డార్లింగ్ సనత్ గుణతిలకేతో మాలిని






అన్నీ గుర్తులేవు ఆరేళ్ళ సుందరికి. కొన్ని మాత్రం మరపు రాకుండా ఉన్నాయి.

ఒక వాన కురిసిన రాత్రి - చీకటిలో కిటికీ తలుపులు దబదబా కొట్టుకోవటం, తను తల్లికి మరింత దగ్గరగా జరగటం, తల్లి దుప్పటి నిండుగా కప్పటం, అప్పుడు వెచ్చగా ఉండటం - గుర్తుంది.

తన చేతిలోంచి జారి పక్కింటబ్బాయి మట్టిబొమ్మ పగిలిపోవటం, రక్తమొచ్చేలా వాడు తన్నని బుగ్గలమీద గోళ్ళతో రక్కేయటం - బాగా గుర్తుంది.

డబ్బామీద కొడుతూ బొంగురుగా ఏదో పాడుతూ తామున్న చోటికి వచ్చాడొక కుంటి బిచ్చగాడు.

సుందరికి కొన్ని మరపు రాకుండా ఉన్నాయి.

"ఇంకా అవన్నీ తెలీదు. యూడీసీ లెండి ఆయన..."

"అలాగా... అమ్మాయిలో ఏం కళ ఉంది వదినగారూ! నాకే కొడుకుంటే ఈ పిల్లను కోడల్ని చేసుకుందును.."

"భలేవారే... ఇదేం పురాతన కాలం కాదు— పిల్లల పెళ్ళిళ్ళు పెద్దవాళ్ళు చెయ్యటానికి."

"ఆ పాపెవరు? మీ అమ్మాయే గదూ?... చెప్పక్కర్లేదు .. అచ్చు మీ పోలికే..."

"మా అమ్మాయే.. వైదేహి."

"ఏం సుందరీ! నువ్వెవరిపోలిక?.. అమ్మ పోలికా— నాన్న పోలికా?."

చక్రాల్లాంటి పెద్ద కళ్ళు అటూ ఇటూ తిప్పాతూ బేలగా చూసింది సుందరి.

"చిన్న పిల్లని అడగాలని అడగటమేగాని... ఏం చెప్తుంది? కదూ సుందరీ? నాకేమో—నాకొ

**ఆ ఊరి పేరు గుంటూరని తరువాత తెలిసింది. గుంటూర్లో ఉన్నంత కాలం, పొరుగిల్లో ఆ ఇంటి పిల్లలూ... అదో ప్రపంచంగా ఉండటం గుర్తుంది.**

ప్రొద్దున్నే స్నానం చేసి పంచె కట్టుకుని నాన్న దేవుడి పటం ముందు 'మంత్రాలు' గొణిగేవాడు, గంట వాయించేవాడు, లెంపలేసుకునేవాడు.

సైకిలెక్కి నాన్న వెళ్లిపోతూ ఉండగా తను గుమ్మంలో నిలబడి చెయ్యూపుతూ టాటా చెప్పేది.

ఇట్లాంటివి గుర్తొస్తుంటే సుందరికి బాగుంటుంది.

కాని కొన్ని గుర్తొస్తే మాత్రం బాగుండదు. ఎందుకని బాగుండదో సుందరికి తెలీదు.

అప్పుడప్పుడూ మధ్యాహ్నాలు అమ్మ ధోరణి వింతగా ఉండేది.

అద్దంముందు నిలుచుని తయారయేది. తను కొంగు పుచ్చుకుంటే విదిలించేది. ఆ తరువాత నవ్వేది. పక్కింటికెళ్ళి ఆడుకొమ్మనేది. తను వెళ్ళకపోతే బలవంతంగా గేటుదాకా పంపించి మరీ లోపలికి వెళ్ళిపోయేది.

పక్కింటబ్బాయి వాళ్ళింటి పైనుండే కుర్రాళ్ళూ మధ్యాహ్నాలు ఆడుకోవటానికి రారు. అప్పుడు సుందరి అక్కడి చెట్లకింద కూచుని వీధిలోకి చూస్తూ ఉండిపోయేది.

ఒకరోజు మధ్యాహ్నం తను అన్నంతిని నిద్రపోయింది. ఎందుకో మెలుకువచ్చింది. పక్కగది లోంచి అమ్మగొంతు వినిపించింది. అమ్మ దగ్గరికెళ్ళిపోవాలనిపించి ఆ గదిలోకెళ్ళింది.

అమ్మతో పడుకుని ఉన్నది నాన్నే అనుకుని చేతులు జాపుతూ దగ్గరికెళ్ళింది.

ఆయన నాన్న కాడు.

అమ్మ అరిచింది.

భయపడి తను తలుపుమూల నక్కింది.

ఆయన్ని 'అంకుల్' అనాలని అమ్మ తరువాత చెప్పింది. తన నెత్తుకుని ముద్దుచేసింది. ఎందుకో ఏడ్పింది కూడా. అమ్మ చెంపలమీద కన్నీళ్ళు తను తుడిచింది.

అంకుల్ అట్లా రావటం పోవటం తను చాలా సార్లు చూసింది. ఒకసారి ఆయన తనకు చాక్‌లెట్లు ఇచ్చాడు.

నాన్న ఉండగా మాత్రం అంకుల్ వచ్చేవాడు కాడు.

ఏదో అర్థం కాకుండా ఉండేది సుందరికి.

ఒకసారి అంకుల్ గురించి చెప్పబోతే నాన్న తనను అవతలికి పంపేశాడు.

ఒక రాత్రిపూట తనకు మెలకువొచ్చింది, అమ్మా నాన్న ఒకరిమీదొకరు కేకలేసు కుంటున్నారు.

ఎందుకోగాని అమ్మ ఏడుస్తుందనిపించింది. కాని అమ్మ ఏడవలేదు.

నాన్నే ఏడ్చాడు. గొల్లుమని ఏడ్చేశాడు. తను భయపడి పోయింది. గబుక్కున ఆయన కాళ్ళను వాటేసుకుంది.

పెద్ద పెద్ద మూటలతో పెట్టెలతో అమ్మా నాన్న తనూ రైలెక్కారు. రైలంటే అలా ఉంటుందని తనకు తెలీదు. ఇల్లొదిలి, ఊరొదిలి వెళ్తున్నామనీ; ఆ ఊరికి, ఆ ఇంటికి ఇక రామని కూడా తనకు తెలీదు.

కిటికీలోంచి అమ్మ ఎటో చూస్తోంది. నాన్న అమ్మవంకగానీ తనవంకగానీ చుడకుండా తలొంచు కున్నాడు.

తను కిటికీ గుండా అవతలికి చూసింది. చెట్లూ పుట్టలూ వేగంగా వెనక్కి వెళ్తున్నాయి.

అమ్మ అలాగే కూచుంది. నాన్న అలాగే కూచున్నాడు.

## 2

కొత్త ఊరు కొత్త ప్రపంచంలా వుంది.

"ఇక్కడేం రోడ్డుమీద కార్లూ బస్సులూ రావుగా... బైట నీ ఇష్టం వచ్చినంతసేపు ఆడుకో వచ్చు" అంది తల్లి.

కొత్త ఇల్లు ఊరికి దూరంగా ఉంది.

ఈ ఇంటికే ఇరుగూ పొరుగూ ఇళ్ళున్నాయి. ఎదురిళ్ళు కూడా ఉన్నాయి.

అన్ని ఇళ్ళలోనూ సుందరి ఈడు పిల్లలున్నారు. తొందరలోనే వాళ్ళతో జట్టు కలిసి పోయింది సుందరి.

పక్కింటి పిన్నిగారికి సుందరి అంటే వల్లమాలిన ఇష్టం. రమణా, కృష్ణా, వైదేహీ— సుందరితో ఆడుకోవాలని తహతహలాడతారు.

"ఎవరమ్మా ఈపాపా?...దీపంలా ఉంది!..."

"పక్కింటి కామేశ్వరావుగారమ్మాయి... మా పిల్లల్తో చాలా స్నేహం..."

"ఏం పాపా... ఇలారా... ఇలారా... నీ పేరేంటి?..."

"సుందరి..."

"అబ్బో... పేరుకు తగ్గట్టే ముద్దుగా ఉన్నావు... మీ నాన్న ఏం చేస్తాడమ్మాయ్ ?"

# జాలి నుంచి జ్వాలదాకా

**డా॥ సి. నారాయణరెడ్డి**

"నన్ను చూస్తే నాకు జాలి.
పెదవుల్లేవు ముద్దు పెట్టుకోవడానికి
కళ్ళు లేవు కలల్ని కట్టుకోవడానికి
గొంతుక లేదు
కొండంత యెత్తుగి పెట్టడానికి."

"నీకుంది కదా ఓ గుండె.
అది అడివిలో లోయలా
లోయలో ఎక్కుపెట్టిన బాణం పాయలా
చీల్చుకుపోతే చాలు
జాలి అంటుకుంటుంది జ్వాలలా."

సారి వాళ్ళమ్మ పోలికనిపిస్తుంది... వొక్కోసారి వాళ్ళ నాన్న పోలికనిపిస్తుంది ..."

"రెండూ ఉన్నా ఆశ్చర్యం లేదులెండి..."

"భలే వారే ..."

ఆ నవ్వులకే బేలగా అటూ ఇటూ చూసింది సుందరి.

"ఇంత చక్కటి పిల్లని కన్న ఆ తల్లిని చూడాలనుంది వదినగారూ !..."

"నాకన్నా ఆరేళ్ళు చిన్న వీళ్ళమ్మ ... పేరు కౌసల్య లెండి, ఇదివరకు గుంటూర్లో ఉండేవారట. ఇప్పుడైనా వాళ్ళింటికి వెళ్దాంగాని, మంచి మధ్యాహ్నం కదూ... నిద్రపోతుంటుందేమో ..."

"తొందరేం ?... మరొకప్పుడు రామా ? ఏం సుందరీ ... మీ ఇంటికొస్తే ఏమిస్తావ్ నాకు ? అబ్బో ... ఏం కళ్ళు తిప్పతావూ !... వొదినగారూ ఈ పిల్లందం ముక్కులో ఉందా కళ్ళలో ఉందా వొంటి చాయలో ఉందా... చెప్పండి చూదాం..."

"మరీ దిష్టి పెట్టేస్తున్నారు మీరు ... కౌసల్యకి తెలిస్తే మా ఇంటికి ఇకసలు పంపించదేమో ..."

"మాటొరసకి చెప్పండి... అందం కన్నులోనా ముక్కులోనా ?..."

"వెర్రి కాకపోతే... అట్లా విడివిడిగా ఉంటుందా అందం ఎక్కడైనా ?... పిల్లలో ఉందనండి ..."

"బాగా అన్నారు. సుందరీ పోనీ, నీబుగ్గ వొకటి వాకిచ్చేద్దూ... అరె... ఈ పిల్లకి చక్కగా సిగ్గు పడటం కూడా తెలుసునే ..."

మాటలు వినటం తెలుసుగాని, వాటి అర్థం తెలియనే తెలియదు సుందరికి. అర్థం అనేది అందీ అందకుండా జారిపోతున్నట్టు ఉంటుంది. తెలియనివి ఎవర్ని అడగాలి ? అమ్మను అడగాలి— అనిపిస్తుంది. తీరా అడుగుదామనుకుంటే ఏ మాటల్లో అడగాలో తెలియదు. అడిగితే అవతలివారు నవ్వేస్తే— చిన్నతనంగా ఉంటుంది.

"అమ్మా — నేను ఎవరి పోలిక ?"

"అదేంటే ? ఎందుకూ ఇప్పుడు ?"

"నేను— ఎవరిలాగా ఉంటాను ?"

"నీలాగే ఉంటావు నువ్వు —"

"వైదేహి... వాళ్ళమ్మలాగా ఉంటుందిట..."

"ఓహో — అయితే అక్కడ పుట్టిందన్న మాట — ఈ మాట ..." సుందరిని చేతుల్లోకి తీసుకుంది తల్లి. హత్తుకుంది.

తల్లి చూపులు సుందరికి ఎంతో కలవరపాటు కలిగిస్తాయి.

"సుందరీ... పిచ్చితల్లీ..."

"ఏంటమ్మా?..."

"నువ్వు మీ నాన్న పోలికే... అచ్చంగా..."

"నాన్న పోలికా..."

నవ్వుతుంది తల్లి. ఎందుకో అది ఏడుపులాగా కూడా ఉంటుంది.

అమ్మ ఏడుస్తుందేమో అనిపిస్తుంది సుందరికి అప్పుడప్పుడూ.

నాన్న ఇంట్లో లేనప్పుడు ఒకసారి అమ్మ బిగ్గరగా వెక్కివెక్కి ఏడ్చేసింది కూడా. దగ్గరికి వెళ్తే సుందరిని హత్తుకుని అలాగే చాలాసేపు ఏడ్చింది. "సుందరీ... మనం ఇంతకు ముందున్న ఊరు బాగుందా?... ఈ ఊరు బాగుందా?..."

"అదే బాగుంది..."

"నాకూ అదే బాగుంది..."

"మనం అక్కడికి పోదాం..."

"ఊహూఁ... వొచ్చేశాంగా... ఇంక పోలేం... ఏం... నీకు తమ్ముడో చెల్లెలో ఉంటే బాగుంటుందా ?"

"ఓ... వైదేహికి రెండు తమ్ముళ్ళు..."

"రెండు కాదు— ఇద్దరు అనాలి! ఇద్దరు తమ్ముళ్ళు... ఏం... తమ్ముడు కాకుండా చెల్లెలయితే..."

"ఊహూఁ— తమ్ముడే..."

"సుందరీ... ఆ ఊళ్ళో... చాకలెట్లు తెచ్చిచ్చేవాడుగా అంకుల్... గుర్తున్నాడా?..."

మాట్లాడకుండా కళ్ళు పెద్దవి చేసింది సుందరి.

## అందానికి అవతలివైపు

"పిచ్చి సుందరి" అంటూ తల్లి ఆ కళ్ళమీద ముద్దు పెట్టుకుంటూ ఉంటే...చాకలెట్లు తెచ్చిచ్చే అంకుల్‌ని గుర్తు చేసుకుంది సుందరి. పొడవుగా, ఎర్రగా...

### 3

ఒక ఉదయం— పలక, బలపం, వాచకం... పీటితో తండ్రి వెంట బయలుదేరింది సుందరి.

తారు రోడ్డుదిగ్గి కంకర రోడ్డుమీద కొంత దూరం నడిచాక దూరాన ఒక పాత భవనంలోంచి చిన్న పిల్లల సందడి వినిపించింది.

లోపలికెళ్ళాక సుందరికి అక్కడంతా పిల్లలే కనిపించారు. కళ్ళజోడు పెట్టుకుని కుర్చీలో ఉన్న ఒకాయనతో నాన్న కొంతసేపు మాట్లాడాడు. ఆ తరువాత టేబులుమీది పుస్తకాల్లో ఆయన ఏదో రాసుకున్నాడు. నాన్నకూడా ఏదో రాశాడు. కళ్ళజోడు పెద్దమనిషి సుందరి బుగ్గలు పుణికి నవ్వుతూ వీపుతట్టి "బాగా చదువుకో" అన్నాడు.

అమ్మకన్న చిన్నగా ఉన్న ఒకామెకు సుందరిని అప్పగించి నాన్న వెళ్ళిపోయాడు.

ఆమె సుందరిని ఒక గదిలోకి తీసుకెళ్ళింది. ఆమెతో బాటు వెళ్తున్న సుందరికి బెరుకుబెరుగ్గా ఉంది.

ఆ గదిలో పిల్లలందరూ సుందరిని చూడగానే అల్లరి మానేశారు. ఆ మానెయ్యటం, ముఖ్యంగా తనను తీసుకొచ్చిన ఆవిణ్ణి చూసేనని సుందరికి చాలా సేపటికి తెలిసింది,

ముందువరస బెంచిలో కాస్త చోటుచేసి సుందరిని కూచోబెట్టి, బెత్తం టేబిలుమీద కొట్టి, పుస్తకం తీసుకుని పెద్దగా పాఠం చెప్పటం మొదలు పెట్టిందామె. ఆమెను టీచర్ అనాలని తర్వాత తెలిసింది.

పక్కన కూచున్న పిల్ల సుందరిని మోచేత్తో పొడిచి, "కొత్తగా వొచ్చినావా... నీ పేరేంటి?" అని అడిగింది.

"సుందరి..." అంది సుందరి.

"ఏయ్ సుందరీ... ఏంటా మాటలు..." అని గదమాయించింది టీచర్.

"అరె— నువ్వు కళ్ళు భలేగా తిప్పుతావే..." అంది పక్కనుండే పిల్ల గుసగుసగా.

ఆ పిల్లపేరు సుబ్బులు అని తరువాత తెలిసింది.

మధ్యాహ్నం స్కూలు వదిలేసరికే సుబ్బులుతో జట్టు కలిసిపోయింది సుందరికి.

పొట్టి ముక్కుతో, బూరెల్లాంటి బుగ్గలతో, వొక ముక్కెంట ఎప్పుడూ కారుతూండే చీమిడితో— తమాషాగా ఉంటుంది సుబ్బులు.

సుబ్బులు మంచి మాటకారి. కళ్ళార్పుతూ చేతులు తిప్పుతూ పెద్దగొంతుతో— ప్రపంచంలో ఏ విషయమైనా తనకు తెలుసు అన్నట్టు ధీమాగా మాట్లాడుతుంది.

సుబ్బులు ఒక నాయకురాలుగా చలామణీ అవుతూంది. ఆ పిల్లచుట్టూ ఎప్పుడూ ఆరేడుగురు పిల్లలుంటారు. 'మగబ్బాయిల్ని' కూడా గదమాయించి మాట్లాడేస్తుంది సుబ్బులు, మాట్లాట్టమే




కాదు. అవసరమైతే పోట్లాడేస్తుంది కూడా.

కొద్ది రోజుల్లోనే సుందరికి సుబ్బులు బాగా అలవాటయిపోయింది. ఇద్దరూ స్కూలుకి కలిసే వస్తారు. స్కూలునుంచి కలిసే వెళతారు.

తినుబండారాలు ఇచ్చి పుచ్చుకోవటం, గాజు ముక్కలు, రంగు చాక్‌పీసులు, మిఠాయి పొట్లాలతో ఉచితంగా వచ్చే చిన్న ప్లాస్టిక్ బొమ్మలు వగైరా అమూల్య వస్తువులు కానుకగా ఇచ్చుకోవటం... ఇట్లా వాళ్ళస్నేహం దినదిన ప్రవర్ధమాన మౌతోంది...

## 4

స్కూలునుంచి ఇంటికొస్తే అదేదో వేరే ప్రపంచంలా అనిపించేది సుందరికి. ఒక్కోసారి — తనెప్పుడూ స్కూల్లోనే ఉండిపోతే బాగుణ్ణు అనిపిస్తూ ఉండేది. ఎప్పుడూ పిల్లల మధ్యే ఉండాలనిపించేది.

అంతవరకు గమనించలేదుగాని, ఉన్నట్టుండి ఒకసారి అమ్మ ఆకారంలో ఏదో మార్పు కనిపించింది సుందరికి.

ఆశ్చర్యంతో సుందరి కళ్ళు విచ్చుకున్నాయి. అమ్మ కడుపు వేపు చూస్తూ, ఏదో అడగబోయింది.

నవ్వుతూ సుందరిని దగ్గరికి తీసుకుని, "అప్పుడే చెప్పలా... నీకు తమ్ముడు పుడతాడన్న మాట..." అంది అమ్మ.

"ఎలా పుడతాడమ్మా ?"

"ఛీ ! పాడుపిల్లా ! అదుగో — వైదేహి వొచ్చేసినట్టుంది... వెళ్ళి ఆడుకో..."

మరుసటి దినం స్కూల్లో సుబ్బులుతో ఈ వార్త చెప్పింది సుందరి.

వాలకం గంభీరంగా మార్చుకుని, పిల్లలు పుట్టటం గురించిన సమాచారమంతా పూర్తిగా చెప్పేసింది సుబ్బులు.

"మొదటేమో అమ్మా నాన్నా స్నానంచేసి మడిబట్టలు కట్టుకుని దేవుడికి పూజ చేస్తారట. దేవుడు కల్లోకొచ్చేదాకా అలా పూజ చేస్తారట. దేవుడు కల్లో కనిపించి, "ఏం కావాలి ?" అని అడుగుతాడట. "మాకు బాబు కావాలి !" (లేకపోతే, "చెల్లి కావాలి") అని అడుగుతారట. అప్పుడు దేవుడు "సరే — అలాగే" అని మాయమైపోతాడట. ఆ తరువాత అమ్మ అప్పుడప్పుడూ ఆస్పత్రికి వెళ్ళొస్తుందట. నాన్న కూడా తోడు వెళ్తాడట. "ఎందుకట ఆస్పత్రికసలు ?" ఏమో ! దేవుడలా చెప్తాడట. అలా కొన్నాళ్ళయాక వొక రాత్రిపూట దేవుడు ఆకాశంనుంచి బాబునో చెల్లినో పంపిస్తాడు. దేవుడంటే — మాయ కదా ! ఆ బాబో చెల్లో తెల్లారేసరికి అమ్మ పక్కలో ఉంటుందట..."

సుబ్బులు చెలికత్తెలందరూ ఈ సమాచారాన్ని ఉత్సాహంగా విన్నారు. సుందరి కూడా విని ఊఁ కొట్టింది. తన తల్లీ తండ్రీ కలిసి ఎప్పుడూ పూజ చెయ్యరే ! — అనుకుంది. నాన్న మాత్రం పూజ చేస్తాడు. అయితే అమ్మ కడుపు ఎందుకలా...

సుబ్బుల్ని అడుగుదామనుకుంది గాని, ఎందుకో అడగాలనిపించలేదు.

సుబ్బులు చెప్పినదాంట్లో నిజాలు కూడా ఉన్నాయని మాత్రం సుందరి గ్రహించింది. అమ్మను నాన్న అప్పుడప్పుడూ ఆస్పత్రికి తీసుకెళ్తున్నాడు. తను చూస్తుండగానే అమ్మ రెండు మూడు సార్లు గొట్టం మాత్రలు వేసుకుంది. "ఎందుకమ్మా ?" అడిగితే— "తమ్ముడు కావాలన్నావుగా... మరి వాడు బొద్దుగా, ముద్దుగా ఉండొద్దేంటి ?" అంది.

ఒక రాత్రిపూట సుందరికి ఒక మంచి కల వచ్చింది. కలలో తను తెల్లటి గౌను ధరించి ఆకాశంలో పావురంలా ఎగురుతోంది. ఒక గోపురానికి ఢీకొట్టబోయింది. ఆ గోపురం కొమ్మున తెల్లటి బట్టల్లో ముద్దుగా బొద్దుగా నవ్వు ముఖంతో ఒక బాబున్నాడు. తను వెళ్ళి బాబును పట్టుకుంది. బాబు నవ్వుతూ తన చెయ్యి పుచ్చుకున్నాడు. ఇద్దరూ గాలిలో మళ్ళీ ఎగురుతున్నారు. చేతులు ఈకల్లా తేలిగ్గా ఉన్నాయి. ఎందుకో బరువు ఎక్కువైపోతున్నారు. ఇద్దరూ పడిపోతున్నారు. "అమ్మా !" అని అరిచింది సుందరి.

"ఏంటమ్మా... ఏమైంది ?" ఆదుర్దాగా అడుగుతోంది తల్లి.

అంతా గందరగోళంగా అనిపించింది. నీళ్ళు తాగించి, "నిద్రలో జడుసుకున్నావేమో ... ఏం లేదులే... కళ్ళు మూసుకు పడుకో ..." అని మళ్ళీ పడుకోబెట్టింది అమ్మ.

స్కూలుకు వెళ్తూ వస్తూ, పాఠాలు వింటూ, పలకమీద రాస్తూ, సుబ్బులు కబుర్లు వింటూ అప్పుడప్పుడూ తమ్ముడి గురించి ఆలోచిస్తుండేది సుందరి. సుందరి ప్రమేయం లేకుండా అది ఒక అంతుపట్టని ఆలోచన అయిపోయింది.

ఒక మధ్యాహ్నం రోడ్డుమీద సుబ్బులు నుంచి విడివడి ఇంటిదారి పట్టిన సుందరికి, మలుపు తిరిగి ఇంటివేపు చూస్తూనే ఏదో వింతగా అనిపించింది. ఇంటి తలుపు సగం తెరిచుంది. వరండాలో ఇద్దరు ముగ్గురు తచ్చాడుతున్నారు. నాన్న వాకిట్లోనే ఉన్నాడు. సుందరితో ఎవరూ ఏమీ మాట్లాడలేదు. నాన్న పిలవబోయి మానేశాడు ! మళ్ళీ పిలవబోయాడు —

ఆ లోగా లోపల్నుంచి పక్కింటి పిన్నిగారొచ్చారు. ఆవిడా గాభరాగా ఉంది. సుందరిని చూసి అమాంతం పైకెత్తుకుని వాళ్ళింటికి తీసుకెళ్ళి "ఇవాళ నువు ఇక్కడే తిను సుందరీ..." అంటూ క్రిష్ణవైదేహిలను పిలిచి వాళ్ళతోబాటు వడ్డించింది. తింటుండగా వెనకనుంచి రమణగాడొచ్చి "సుందరీ! నీకు తమ్ముడు కావాలన్నావుటగా... చెల్లెలయితే వొద్దా — మాకిచ్చేస్తావా ?" అన్నాడు. "ఒరే రమణా నువ్వవతలికెళ్ళు ..." అని తరిమేసింది పిన్నిగారు.

తిన్నాక స్కూలుకెళ్ళాలనిపించలేదు సుందరికి. అమ్మని చూడాలని ఎంత మారాం చేసినా, పిన్ని బలవంతంగా పంపించేసింది.

సాయంత్రం సుబ్బుల్తో బాటు రివ్వున పరుగెత్తుకొచ్చేసింది సుందరి ఇంటికి. లోపల్నుంచి కేరుకేరుమని ఏడుపు వినబడుతోంది. నాన్న అటుగా వచ్చి సుందరి నెత్తుకుని "నీమాటే నిజమయింది— తమ్ముడు పుట్టాడు—" అన్నాడు.

## 5

టీచర్ పాఠం చెప్తోంది. సుందరి శ్రద్ధగా వింటోంది. ప్రక్కన కూచున్నపిల్ల సుందరితొడమీద చిన్నగా గిల్లింది, "ఏమిటి?" అన్నట్టు చూసింది సుందరి.

"స్కూలు వొదిలింతర్వాత—సుబ్బుల్తో కూడా పోతావా?" అంది ఆ పిల్ల.

"అవును..."

"ఈ దివం సుబ్బులు వెనకాల కూచుంది, ఎందుకూ ?"

"ఆ అమ్మా యెవరో బలపాలు బాకీ వుందట..."




హిందూపురం శ్రీకృష్ణదేవరాయ గ్రంధమాల స్వర్ణోత్సవాల సందర్భంగా నిర్వహించిన 'తెలుగు కథా సాహిత్య వేదిక'పై ప్రసంగిస్తున్న ప్రముఖ కథా రచయిత శ్రీ మధురాంతకం రాజారాం. సభకి అధ్యక్షత వహించిన శ్రీ మల్లెమాల వేణుగోపాలరెడ్డి, మరొక ఉపన్యాసకులు శ్రీ విహారి గార్లని చిత్రంలో చూడవచ్చు.

ఈ మాటలన్నీ గుసగుసగానే జరుగుతున్నాయి. కళ్ళు మాత్రం టీచరుమీదే ఉంచి మాట్లాడుతోంది ప్రక్కనున్న అమ్మాయి. ఆ విద్య సుందరికి చేత కావటంలేదు.

"సుందరీ... మరేం... నేను— నీ జట్టు వుంటాను..."

ఏదో చెప్పరాని పులకింత లాంటిది కలిగింది సుందరికి: తనను అందరూ సుబ్బుజట్టు అంటారు. తన జట్టు అంటోంది ఈ అమ్మాయి!

"ఏం— ఇవిగో బఠాణీలు..."

"నీ పేరేంటి ?"

అప్పుడే టీచర్ ఇటువైపు చూస్తుండటంతో నోరు మెదపబోయి మానేసింది ఆ అమ్మాయి. చప్పుడు కాకుండా వాచకం తీసి, అట్టమీద పేరుకేసి వేలితో చూపించింది. 'ఎ. నాగలక్ష్మి' అని వంకర అక్షరాలతో రాసి ఉంది.

స్కూలు వదిలేదాకా నాగలక్ష్మితో గడిపింది సుందరి. ఇంటి దారిని మాత్రం మామూలుగా సుబ్బులుతోనే వెళ్ళింది. వెళ్తూ అలవాటుగా గలగలా మాట్లాడేస్తున్న సుబ్బులుకేసి కొత్తగా ఆవేళే చూస్తున్నట్టు పరిశీలనగా చూసింది. సుబ్బులు నల్లగా ఉంటుంది. పొట్టి ముక్కు. మాట్లాడేంత సేపూ ముక్కు ఎగబీలుస్తూ ఉంటుంది. అదేమంత బాగుంటుంది.

మరుసటి రోజు నుంచి నాగలక్ష్మితో ఎక్కువ చనువుగా ఉండటం మొదలెట్టింది సుందరి.

నాగలక్ష్మి ఎక్కువేమీ మాట్లాడదు. అయినా సుందరి అంటే వల్లమాలిన ఇష్టమని తెలిసిపోతూ ఉంటుంది. కాస్తంత వీలు చిక్కినప్పుడల్లా సుందరి కళ్ళవేపు తదేకంగా చూస్తూ ఉంటుంది ఆ పిల్ల.

కొద్ది రోజుల్లోనే సుందరి జట్టు అంటూ ఒకటి ఏర్పడిపోయి స్థిరపడిపోయింది. నాగలక్ష్మి మాత్రమే కాదు — మల్లీశ్వరి, గౌరి, కమల మొదలైన సుబ్బులు జట్టు పిల్లలు కూడా సుందరి చుట్టూ చేరసాగారు.

## అందానికి అవతలివైపు

సుందరీ సుబ్బులూ నడుస్తున్నారు, అలవాటుగానే. సాయంత్రమౌతోంది.

ఇద్దరిమధ్యా మాటలు మాత్రం తిన్నగా నడవటంలేదు. కొన్ని రోజులుగా అలాగే ఉంది. సుబ్బులు ఇవాళ లోపల్లోపలే ఇదైపోతోంది.

"నువ్వు బలేదానివే సుందరీ... అందరూ నీ జట్టే అయిపోయినారు..." అంది సుబ్బులు చివరికి.

"నేను నీ జట్టేగా —" అంది సుందరి, సుబ్బులు భుజంమీద చెయ్యేసి.

అదోలాగ సుందరికేసి చూసి, "ఊహుఁ. నేనే నీ జట్టు —" అంది సుబ్బులు.

టీచర్ పాఠం చెప్తుండగా ఎవరో వచ్చి ఆమెను పిలిచారు. "సుందరీ... నేను హెడ్‌మాస్టర్ దగ్గరికెళ్ళొస్తా... అందాకా క్లాసు చూసుకో..." అని వెళ్ళిందామె.

సుందరికి చెప్పరాని సంతోషం కలిగింది.

టీచర్ బదులు క్లాసు చూసుకోవటమంటే చాలా గొప్పగా ఉంటుంది.

వెళ్ళి బెత్తం చేతిలో పుచ్చుకుని, టీచర్ కూచునే కుర్చీ పక్కన నియంతలా నిలుచుంది. వెనక బెంచీలో అబ్బాయిలు ఇద్దరూ గుసగుసగా మాట్లాడుకుంటూ ఉన్నారు. సుందరి చూపు వాళ్ళమీద పడేసరికి కిక్కురుమనకుండా ఉండిపోయారు. ఇంకో అబ్బాయి లేచి ఒక వేలు ముడిచి చూపించాడు. వెళ్ళవచ్చునన్నట్టు తల మాత్రం తిప్పి, అనుమతి ఇచ్చింది సుందరి. ముగ్గురు ఆడపిల్లలు సంచీ కెలికి వేరుశెనగలు తియ్యబోతుంటే బెత్తంతో టేబిలుమీద కొట్టింది. వాళ్ళు తన జట్టువాళ్ళే గనుక, "మల్లీశ్వరీ... పుస్తకం తీసి చదువు... లేకుంటే ఎండలో నిల్చోవాలి" అంది వార్నింగ్ ఇస్తూ.

డ్రిల్ టీచర్ అయితే అన్నిటికీ సుందరినే పిలుస్తుంది. "సుందరీ... అందర్నీ లైన్లో నిల్చోబెట్టి బైటకి తీసుకురా..."

అంతా కొత్తగానూ వింతగానూ ఉండటమే గాక, ఎందుకోగాని తనకు మాత్రం ప్రత్యేకంగా ఉన్నట్టు మెల్లమెల్లగా అర్థమౌతోంది సుందరికి.

ఒకసారి ఇంటికి అయిదారు మంది పెట్టెలతో సంచులతో వచ్చారు. వాళ్ళు బంధువులు అంది అమ్మ. వాళ్ళతో ఒక కుర్రాడున్నాడు. రోజూ సాయంత్రం పెరట్లో వాడితో ఆడుకుంది సుందరి. ఆటలో ఒకసారి వాడు సుందరిని కింద పడదోశాడు, సుందరి మోకాలు గీసుకుపోయింది. వాడే ఏడ్చేశాడు ఆ దెబ్బచూసి. అమ్మతో చెప్తే ఏమంటుందోనని చెప్పలేదు సుందరి.

ఒక సాయంత్రం ఆ పిల్లాణ్ణి వెదుకుతూ డాబా మీదికి వెళ్ళింది సుందరి. అక్కడ వాడులేడు. కాని ఒక పెద్దాయన ఉన్నాడు. ఇంటికి వచ్చిన 'బంధువు'ల్లో ఆయన ఒకడని సుందరి గుర్తించింది, నాన్నకన్నా లావుగా ఉన్నాడు. సుందరిని చూసి నవ్వుతూ దగ్గరికి పిలిచి ఒడిలో కూచోబెట్టుకుని కబుర్లు చెప్తూ బుగ్గలు పుణుకుతూ ముద్దు పెట్టుకున్నాడు. ఆయన మీసాలు గుచ్చుకుని సుందరికి కితకితలయింది. ఆయన చేతులు సుందరి భుజాల్ని తాకాయి. సుందరికి ఏమిటోగా అనిపించింది.

"సుందరీ— ఇలా రా!" అని అమ్మగొంతు వినిపించింది. కంగారు పడుతూ ఆయన చేతులు సుందరిని వదిలేశాయి.

సుందరిని గదిలోకి తీసుకెళ్ళి చీవాట్లేసింది తల్లి. కొడుతుందేమో అనిపించిందికూడా సుందరికి. అమ్మ ఎందుకంత కోపంగా ఉందో మాత్రం అర్థం కాలేదు. "ఇంకెప్పుడూ అట్లా మగవాళ్ళ దగ్గరికెళ్ళకూడదు. అట్లా కూచోకూడదు" అంది అమ్మ. అదిమాత్రం గుర్తు పెట్టుకోవాలి— అనుకుంది సుందరి. లేకపోతే అమ్మకు కోపం వస్తుంది...

[ఇంకా వుంది]

## మూఢమతే!

కరుణించని
దేవతల కోసం
కలలు కంటావెందుకు ?
గాజు రాళ్ళను చూసి
వజ్ర వైఢూర్యాలంటు
భ్రమకు లోనౌతావెందుకు ?
చైతన్యం, ప్రగతి పథాలలో
నా మనుగడ సాగించాలని
అచేతనంగా నిద్రిస్తావెందుకు ?
జుంటి తేనియలాశించి
తుంటరి తమ్మెదలా కన్నె సుమాల చుట్టు
పరిభ్రమిస్తావెందుకు ?
అగ్ని కిరీటమని తెలిసి
పదవి కోసం ప్రాకులాడటమెందుకు ?

— మంతెన సూర్యనారాయణరాజు

# తెల్లవారని బ్రతుకులు

## పాలకూర సీతాలత



పార్కుగడ్డిలో వెల్లకిలా పడుకుని ఆకాశంలో మెరుస్తున్న నక్షత్రాల్ని చూస్తూ ఆలోచనల్లో నిండివున్న అనంతరాంని వాచ్‌మన్ తట్టిలేపాడు.

"గేటు మూసే వేలయ్యింది. ఇక ఇంటికి వదు బాబూ ..." అన్నాడు తలకు తుండు చుట్టబెట్టుకుంటూ వాచ్‌మన్.

అనంతరాం లేచాడు. ఒంటికి అంటిన గడ్డి పరకలు దులుపుకున్నాడు: ఒకసారి జేబులు తడుము కుంటూ నవ్వుకున్నాడు. జేబులో ఏముందని తడుము కోవడం ? పర్సులేదు. ఉన్నా అందులో డబ్బు లుండవు. బైటకి నడిచాడు అనంతరాం.

రోడ్డంతా విద్యుద్దీపాల కాంతితో నిండి పోయింది. దుకాణాలన్నీ రష్‌గా వున్నాయి. 'బహుశా ఏదైనా పండుగ సీజనేమో ! ... ' అనుకున్నాడు. పండుగలు జేబులో డబ్బులున్నవాళ్లకు. అందుకే తనకు రాబోయే పండుగ గురించి తెలియదు. ఖాళీ జేబుల్లో చేతులు పెట్టుకొని ఇంటివైపు నడవడం ఆరంభించేడు. ఫారిన్లో ఉద్యోగం చేస్తూ పెళ్లి చేసికొందుకు ఇండియా తిరిగొచ్చిన కుర్రాడి చుట్టూ మూగిన ఆడపిల్ల తండ్రుల్లా అతనిలో ఆలోచనలు చుట్టుముట్టాయి.

అనంతరాం తండ్రి ఆదినారాయణ. చాలా పెద్ద కంపెనీలో చిన్న గుమాస్తాగా చేరి ఇంకో ఏడాదిలో గుమాస్తాగానే రిటైరు కాబోతున్నాడు. భార్య సుందరమ్మకూ రోగాలకూ గొప్ప మైత్రి. రెండురోజులు లేచి తిరిగితే మూడురోజులు పడుకుని తీరాలి. అదొక రూలయిపోయింది. ఆదినారాయణ సంపాదన డాక్టర్లకి పొయ్యడానికే సరిపోవటంలేదు. కూతురు సత్యవతికి తల తాకట్టుపెట్టి పదివేలు కట్నం ఇచ్చి పెళ్లిచేశాడు. నాలుగేళ్ల తర్వాత రోడ్డు ప్రమాదంలో సత్యవతి భర్త మరణించేడు. తల చెడి పుట్టింటికి చేరింది. ఇక బ్రతుకంతా అక్కడే గడపాలి. అత్తగారి తరఫునుంచి ఆమెకు లభించిందీ, లభించబోయేదీ ఏదీలేదు గుడ్డిలో మెల్ల అన్నట్టు ఆమె కడుపున ఏ కాయా కాయక పోవడం మరి ఆదినారాయణ తరఫునుంచి చూసి అదృష్టమనే చెప్పాలి. లేకపోతే ఆ భారం కూడా ఆదినారాయణ భుజాలపై పడేదిగదా !

అనంతరాం పుట్టగానే ఆదినారాయణలో పుత్రోత్సాహం కల్గి తన కొడుకు జిల్లా కలెక్టర్ అయి తీరుతాడని నమ్మాడు. ఆ తర్వాత ఆ విషయం మర్చిపోయాడో ఏమో కొడుకుని బి.ఏ. చదివించి ఆ తర్వాత ఇక ఓపికలేదని చేతులు ఎత్తేశాడు. అనంతరాం వల్ల దేశంలో నిరుద్యోగుల సంఖ్య మరి ఒకటికి పెరిగింది. అదే అతనివల్ల దేశానికి జరిగిన ఉపకారం. అతనికి మాత్రం దేశం వల్ల ఏపీ ఉపకారం జరగలేదనే చెప్పాలి. 'నీకు దేశం ఏం చేసిందని ప్రశ్నించకు. నువ్వు దేశానికి ఏం చేశావో ఆలోచించు ...' అని ఎవరో నాయకుడు ఎన్నికల్లో ఉపన్యాసం ఇయ్యడం విన్న అనంతరాం సన్నగా నవ్వుకుని ఊరుకున్నాడు.

కొడుకు తనకొక సమస్యగా మిగిలిపోయాడని తండ్రికి తెల్సు. తండ్రికి తెల్సిన విషయం కొడుక్కూ తెల్సు. ఉద్యోగం వచ్చే అతీ గతీ లేదుగానీ ఇంటర్వ్యూలకూ, అప్లికేషన్లకూ, రిటెన్ టెస్టు




గంగాధర్

మహీజా ఫిలిమ్స్

# ముద్దుల మొగుడు

నిర్మాత: సి.హెచ్.ప్రకాశరావు

దర్శకత్వం: కె.యస్.ప్రకాశరావు

VEEKAY

శ్రీఫిలిమ్స్

# తెల్లవారని బ్రతుకులు

చార్జీలకు డబ్బు అడిగేందుకు మొహమాటంగా వున్నా కొడుక్కు అడక్క తప్పటంలేదు. అష్ట కష్టాలుపడి ఆ డబ్బు కొడుక్కు ఇయ్యడం తండ్రికీ తప్పటంలేదు. ఈ విషయంలో ఇద్దరూ బాధ పడుతూనే వున్నారు. 'నేను కలాసీ ఉద్యోగం అయినా చేస్తాను' అని పాపం అనంతరాం సిద్ధపడ్డాడుగానీ అతనికి ఆ ఉద్యోగం ఇచ్చేందుకు మాత్రం ఎవ్వరూ సిద్ధపడలేదు.

అనంతరాం తర్వాత ఇంకో ఆడపిల్ల. పదేళ్ల పరమేశ్వరి. సిరి అబ్బదేమోగానీ చిడుము త్వరగా అబ్బుతుందట. మంచి పోలికలు రావడం కష్టంగానీ చెడ్డ పోలికలు రావడం సులభం కాబోలు. తల్లి నుంచి అనారోగ్యం అనే లక్షణం పుణికి పుచ్చుకుంది పరమేశ్వరి. తల్లిలాగే రోగిష్టిది. అందుకని చదువు అంత మాత్రంగానే అంటుతోంది. దాని చదువు గురించికాక దాని రోగం గురించే బెంగ ఆదినారాయణకి.

అసలు నిజానికి ఆదినారాయణకి అన్నీ బెంగలే. మరో ఏడాదిలో రిటైరు అయిపోతే ఈలోగా సంసారం ఆదుకుందుకు అనంతరాంకి ఉద్యోగం వస్తుందో రాదో అని బెంగ. భార్య ఎన్నటికైనా సంపూర్ణ ఆరోగ్యవంతురాలు అవుతుందా అని బెంగ. కూతురు సత్యవతి బ్రతుకు బుగ్గి అయినందుకు బెంగ. పరమేశ్వరి పాడైపోతోందని బెంగ. వీధిలో రకరకాల అప్పులు ఉన్నందుకు బెంగ. ఆ అప్పులు తీర్చే దారి కన్పించనందుకు బెంగ. రోజుకు పదిసార్లు ఏడుకొండల వెంకటేశ్వరస్వామిని తల్చుకున్నా ఆయన ఏ రకంగానూ ఆదుకుందుకు రావటంలేదని బెంగ. (ఇదేదో గజేంద్రమోక్షం రోజులనీ 'లావొక్కింతయు లేదు' అనగానే దేముడు వచ్చి చక్రం అడ్డువేస్తాడనీ ఆయన నమ్మకం. ఇది కలియుగం అని మర్చిపోతుంటాడు మరి పాపం!) నెల్లాళ్లుగా వస్తున్న దగ్గుకు కారణం టి.బీ. కావచ్చునేమో అని బెంగ. ఆ విషయం నిర్ధారణ చేసుకుందుకు డాక్టర్ దగ్గరకు వెళ్లే తీరిక, ఆర్థికస్తోమత లేనందుకు బెంగ. ఇన్ని రకాల బెంగల మధ్య ఎలా జీవించాలన్న బెంగ. అనంతరాం ఆ్రరోజులుగా తనకు అయిదొందలు కావాలనీ, ఆ తర్వాత ఉద్యోగం వచ్చి తీరుతుందనీ వేధించడం ఒక బెంగ. ఈ అయిదొందలు అప్పు కోసం వెళ్తే గతంలో చేసిన అప్పు తీర్చేదాకా మరొక్క పైస అప్పు ఇవ్వడం కష్టం అనీ, గతంలో తీసుకున్న అసలు ఎలా వున్నా వడ్డీ త్వరగా కట్టెయ్యమనీ ఆ అప్పు ఇచ్చినవాడు గట్టిగా వార్నింగు ఇవ్వడంతో తనకున్న పరువు ప్రతిష్ఠలు గంగలో కల్సిపోయాయని బెంగ. ఆ విషయం అప్పులవాడితో అంటే వాడు గొంతు చించుకుని 'నీకు అసలు పరువనేది ఎక్కడ వుందయ్యా గుమాస్తాగారూ! వెళ్లండి...' అని అన్నాడని బెంగ. ఈ సంసారపు చిక్కుల్లోపడి ఆఫీసు పని సరిగా చెయ్యలేక పోతున్నందువల్ల ఆఫీసరు ఒక రోజు పిల్చి జాడించి వొదిలిపెట్టి చాకిరేవు పెట్టాడని బెంగ. ఈ బెంగలన్నీ మీదపడి తనని మరింత నిరాశావాదిగానూ, ఓపిక లేనివాడుగానూ చేస్తున్నాయని బెంగ. పెద్ద కూతురు సత్యవతి ఎదురింటి ఉద్యోగస్తుడితో చనువుగా మాట్లాడుతోందని లోకం చెవులు కొరుక్కుంటోందని బెంగ. ప్రైవేటుగా హిందీ పరీక్షలకి కడుతూ ఆ ఎదురింటి ఉద్యోగస్థుడు ఉమాకాంతరావు దగ్గర కోచింగ్ తీసుకుంటోందన్న నిజం లోకానికి తెలియదని బెంగ.

ఇల్లు చేరాడు అనంతరాం!

పక్కింటి గోడగడియారం ఎనిమిది గంటలు కొట్టింది.

తల్లి ఆయాసపడ్తూ — "ఈ విషయం విన్నావురా?" అంది అనంతరాంతో.

ఏ విషయం అన్నట్లు కనుబొమ్మలు ఎగరేశాడు.

"మీ నాన్నగారు..." మధ్యలో ఆమె మాట త్రుంచేశాడు.

"అయిదొందలు ఇవ్వడానికి ఒప్పుకున్నారా?... అప్పుచేసి తెచ్చారా?... భలే... ఇంకేముంది? నాకు ఉద్యోగం వచ్చినట్లే..." అన్నాడు సంతోషంగా.

అవును. అతను ఉద్యోగం కోసం అయిదు వందలు ఖర్చు పెట్టాలని తెల్సుకున్నాడు. ఏ ఆఫీసులో గుమాస్తా ఉద్యోగం ఖాళీగా వుందో ఆ ఆఫీసరు అతని ఫ్రెండు తండ్రి. ఆయన ఆ ఉద్యోగం తప్పకుండా తనకి ఇప్పిస్తానని ప్రామిస్ చేశాడు.

"చూడు అనంతరాం! నువ్వు ఈ ఉద్యోగానికి అప్లయ్ చెయ్యడం మంచిదే. నువ్వంటే నాకు గతం నుంచీ ఉన్న అభిమానం కారణంగా, నీ సత్ప్రవర్తన నాకు తెల్సిన కారణంగా ఈ ఉద్యోగం నీకు వచ్చేలా చేస్తాను... కానీ ఒక్క విషయం... ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజి నుంచి ఇంటర్వ్యూకి కాల్ లెటర్ తెచ్చుకోవల్సిన బాధ్యత నీది. నువ్వు ఇంటర్వ్యూకి అటెండుకా. అంతే... తక్కిన విషయాలు నాకు వదులు..." అన్నాడు ఆయన.

అంతకన్న కావల్సిందేముంది? ఎగిరి గంతేసినంత పని అయ్యింది అనంతరాంకి. పక్కవాని జేబులోని డబ్బులతో మందుకొట్టి తృప్తిపడ్డ పరాన్నజీవిలాగ సంతోషపడిపోయాడు. ఆ తర్వాత ఎంప్లాయిమెంట్ ఆఫీసుకి వెళ్లి కాల్ లెటర్ పంపించే గుమాస్తాని కలిశాడు. అతనికి ఆశ్చర్యం వేసింది. ఆ గుమాస్తా ఎవ్వరో కాదు. ఈ మధ్యే అక్కడకు వచ్చిన అతని సీనియర్ స్టూడెంట్ మిత్రుడు మధుసూదనం. ఇద్దరూ కాలేజీలో "గురూ..." అనుకుని తిరిగేరు. ఇప్పుడు కూడా సంతోషం పట్టలేక "గురూ... ఇదీ సంగతి... కాల్ లెటర్... ఆ బాధ్యత నీది..." అన్నాడు అనంతరాం.

ఆ విషయం ఎత్తకుండా "పద, కాంటీన్లో కాఫీ తాగుదాం..." అన్నాడు మధుసూదనం.

ఇద్దరూ కాంటీన్లో కూర్చున్నారు. కాఫీ సగం తాగేకా మధుసూదనం అన్నాడు—

"చూడు అనంతరాం! నువ్వు నా ఫ్రెండువి. కాదనను. కానీ ఆఫీసు విషయాల్లో బావమరిది అయినాసరే, ఆ విషయం మర్చిపోయి ప్రవరిస్తాను. అలాగే నీతోనూను. కాల్ లెటర్ పంపేందుకు నాకున్న రేటు నేను చెప్తాను. అది ఇచ్చుకుంటేనే నీపని జరిగేది. 'ఇదేంట్రా, ఇంత నిర్మొహమాటంగా మాట్లాడతావ్?' అని అనకు. అది అంతే. కొందరికి కొన్ని ప్రిన్సిపుల్స్ వుంటాయి. అబద్ధం ఆడకూడదని హరిశ్చంద్రుడి ప్రిన్సిపుల్. దీనుల్ని ఉద్ధరించాలన్నది గాంధీగారి ప్రిన్సిపుల్. అలాగే లంచం తీసుకోకుండా ఏపనీ చెయ్యకూడదని అనేది నా ప్రిన్సిపుల్. 'ఏం?



ఎందుకని?' అని అడక్కు. అది అంతే. సాధారణంగా నేను ఈ కాంటీన్ ఖర్చుకూడా పార్టీల మీదే రుద్దుతాను. నువ్వు నా ఫ్రెండువి కనుక ఈబిల్లు నేనే ఇచ్చుకుంటాను..."

నోరు వెళ్లబెట్టిన అనంతరాం ఈగలు దూరుతాయని నోరు మూసుకున్నాడు. మధుసూదనం కోరింది అయిదు వందలు.

"ఈ అయిదు వందలూ నా కోసమే అని అనుకోకు. నిర్మొహమాటంగా చాలాసొమ్ము వసూలు చేస్తున్నాడని అనుకోకు. ఇది రివాజు రేటు. పైగా ఇందులో ఇంకా చాలా వాటాలు ఉన్నాయి. లంక మేత, గోదావరి ఈత అన్నట్లు నాకు ఇందులో దక్కేది ఒక వందే..." అని కూడా చెప్పాడు.

ఆ రకంగా అనంతరాం ఉద్యోగం ఖరీదు ఐదు వందలు అయ్యింది. మిగతావాటితో పోల్చితే చాలా చవగ్గా తేలినట్లు అనుకోవాలి. కానీ ఆ అయిదు వందలు కూడా దొరికే చావటం లేదే! దేవుడు ఉద్యోగం అనే వరం ఇచ్చినా, పూజారి అయిదు వందలని అడ్డుగోడ కడుతున్నాడే!

ఈ అయిదు వందల కోసం ఆ రోజులనుంచీ రోజుకు ఏడుసార్లు చొప్పున తండ్రిని అడిగి ఎనిమిది సార్లు చొప్పున అతనిచేత లేదని అన్పించుకుని తొమ్మిదిసార్లు నిట్టూర్చి పదిసార్లు తలగోక్కున్నాడు.

"అది కాదురా నాయనా! ఆ ఏడుకొండల వాడికి ఎన్ని పూజలు చేసినా ఈ కష్టాల కుంపటి ఇలాగేవుంది ..." తల్లి అంది.

"ఏమిటమ్మా విషయం ?" చికాగ్గా అడిగేడు అనంతరాం. తను ఊహించినట్లు అయిదొందల



సంగతి కాదని తెల్సిపోయింది.

"మీ నాన్నగారికి టి. బి. అట. ఇవాళ డాక్టర్లు తేల్చి చెప్పారు. వెంటనే హాస్పటల్లో చేరాలి ......" అంది.

అనంతరాం బెదిరిపోలేదు. ఉన్న కష్టాలలో ఇదొకటి. నీరు ఎప్పుడూ పల్లానికే పోయినట్లు, డబ్బు ఇబ్బందుల కష్టాలు ఎప్పుడూ లేని వాడికే అనుకున్నాడు.

"సరే, అన్నం వడ్డించు ..."అన్నాడు బట్టలు మార్చుకుంటూ. తండ్రి మంచం మీద పడుకుని కళ్లు మూసుకుని వుండటం చూశాడు. నిద్రపోతున్నాడో, లేదో తెలియదు.

భోజనం చేసి వచ్చేసరికి తండ్రి లేచి కూర్చున్నాడు. "అనంతం : ఒక ఫ్రెండు దగ్గర అప్పు చేశాను, అయిదువందలు. తీసుకో. ఈ రకంగానైనా నీకు ఉద్యోగం వస్తే ఒక సమస్య తీరినట్లే ......" అన్నాడు దగ్గుతూ.

ఆ దగ్గు వింటే తండ్రికున్న రోగం గుర్తు వచ్చింది.

అనంతరాం అన్నాడు.

"ముందు మీరు హాస్పటల్లో చేరండి. ఈ అయిదువందలూ అందుకు ఖర్చుపెట్టాలి ముందు. నా సంగతి తర్వాత చూద్దాం ... డబ్బు మీ దగ్గరే వుంచండి. రేపు మిమ్మల్ని హాస్పటల్‌కు తీసుకు వెళ్తాను ......"

తండ్రి జవాబు చెప్పలేదు. ఉద్యోగానికే ఆ డబ్బు ఖర్చుపెట్టమని బలవంతం చెయ్యలేదు. రెండు సార్లు దగ్గి, ఒకసారి చిన్నగా మూలిగి ఊరుకున్నాడు

ఆ రాత్రి దొడ్డివైపు ఆరుబయట అనంతరాం ఒక మంచం మీదా, సత్యవతి మరో మంచం మీదా పడుకున్నారు. మిగతా వాళ్లు లోపలే పడుకున్నారు.

ఒక రాత్రి వేళ మెలకువ వచ్చిన అనంతరాంకి. సత్యవతి మంచం మీద కన్పించలేదు. దొడ్డి తలుపు తెరిచివుంది. అక్కడ రెండు ఆకారాలు సన్నగా మాట్లాడుకుంటున్నాయి. మెల్లగా లేచి అటు వైపు అడుగులు వేశాడు. ఆ ఆకారాలు తన రాకని గమనించకుండా జాగ్రత్త పడ్డాడు. ఆ రెండో ఆకారం తమ ఎదురింట్లో వుండే హిందీ టీచర్ ఉమాకాంతరావుగా గుర్తించాడు.

"ఉమాకాంత్‌గారూ! వచ్చి కూర్చోండి .. కొంచెం మాట్లాడుకుందాం ......" అన్నాడు అనంతరాం.

అనుకోని ఈ సంఘటనకి అదిరిపోయాడు ఉమాకాంతరావు. గొంతులో వెలక్కాయ పడ్డట్లు అయింది. అడుగు ముందుకు వేయలేకపోయాడు. వెనక్కివేసి పారిపోలేక పోయాడు.

"అబ్బే... అదీ... అదీ..." తడబడ్డాడు.

దొడ్లో లైటు వేశాడు. "ఫర్వాలేదు ... రండి ..." అంటూ తన మంచం దగ్గరకు తీసుకు వెళ్లాడు. ఉమాకాంతరావు గాలికి ఊగుతున్న మామిడి చెట్ల కొమ్మల వైపు చూశాడు.

"ఉమాకాంతరావుగారూ! నేను బహుశా మీకంటె చిన్న వాడిని. మీకు ఇలాంటి పన్లు తగునా? తప్పు మా అక్కదే కావచ్చు. అయినా ఆమెను మీరు







మందలించ వల్సింది. ఏదో మీ దగ్గర హిందీ నేర్చు కుంటోంది... అంత మాత్రాన ఇంత చనువు తీసుకుంటారా ? ఇది ధర్మమేనా ?...'' అన్నాడు అనంతరాం. ఆ సమయంలో ఏదో పెద్దరికం అతన్ని ఆవహించింది. ఆ కుటుంబం క్రమశిక్షణ, రక్షణ తనమీదే వున్నట్లు అన్పించింది.

సత్యవతి ముఖం కూడా పాలిపోయింది. దొంగతనం చేస్తూ పట్టుబడి పోయినట్లుగా వుంది ఆ ఇద్దరి పరిస్థితీ.

''అది కాదండీ !... సత్యవతిని నేను పెళ్లి చేసుకుంటాను. నా మాట నమ్మండి...'' అన్నాడు ఉమాకాంతరావు నమ్మకం గుప్పిస్తూ.

''ఈ విషయం మీ పెద్దలకి ...'' అనంతరాం మాటలు త్రుంచేస్తూ అన్నాడు —

''ఒప్పుకోరు. వాళ్లని ఎదిరించి పెళ్లి చేసుకుంటాను. మీ నాన్నగారు కూడా ఒప్పుకోరని సత్యవతి ...''

''అవును. కూతురి బ్రతుకు బాగు అవుతుందన్న సంతోషం కంటె ఆయనకు సాంప్రదాయం దెబ్బ తింటోందన్న బాధే ఎక్కువ. ఆయన గురించి నాకు బాగా తెల్సు. ఆయన ఈ పెళ్లికి ఒప్పుకోరు. కనుక ఒక పని చెయ్యండి. ఎవరికీ తెలియకుండా ముందు ఏ అన్నవరంలోనో పెళ్లి చేసుకోండి. ఆ తర్వాత ఏడ్పులు, మొత్తుకోళ్లు అయినా అందరూ సర్దుకుపోతారు. ఇందుకు నా సహాయం మీకు వుంటుంది...'' అన్నాడు అనంతరాం. ఉమాకాంతరావు కృతజ్ఞతగా అనంతరాం చెయ్యి పట్టుకున్నాడు.

''తమ్ముడూ ...'' అంది సత్యవతి కళ్లు తుడిచాగా.

''నీ జీవితం బాగు పడటం తప్ప నాకు ఏం కావాలి ? ...'' అన్నాడు అనంతరాం.

''కానీ ఒకటి ... ఈలోగా మీరు తొందర పడకూడదు ...'' మళ్లీ అన్నాడు. సిగ్గుపడ్డారు ఆ ఇద్దరూ. అలాగే అన్నట్లు తల ఊపారు.

''మిగతా ఏర్పాట్లు చూడండి ...'' అన్న అనంతరాం మాటలకి తల ఊపి బైటకి నడిచాడు ఉమాకాంతరావు.

''తమ్ముడూ ! నీదెంత విశాలహృదయంరా !'' అంది సత్యవతి మంచంమీద కూర్చుంటూ.

''విశాలం లేదు, ఇరుకు లేదు అక్కా ! అమ్మా, నాన్నలతో నీ రెండో పెళ్లి గురించి చాలాసార్లు వాదించాను. ఆ ఇద్దరూ పాత తరానికి ప్రతినిధులు. ఇద్దరూ ఒప్పుకోలేదు. నీ జీవితం బాగుపడే సమయం వచ్చింది. ఈ అవకాశం జారిపోకూడదు. నీ జీవితంలో రంగుల పువ్వులు మళ్లీ పుయ్యాలి. ఆ ఉద్దేశ్యంతోనే ఆయన్ని పెళ్లికి ప్రోత్సహించాను...'' అన్నాడు తను కూడా పడుకుంటూ.

ఆ మర్నాడు తండ్రిని హాస్పటల్‌కి తీసుకెళ్లి డబ్బుకట్టి ఆయన్ని హాస్పటల్లో చేర్పించాడు. ఆయన చేత రెండునెలలు శెలవు పెట్టించాడు. శెలవులేక పోవడంవల్ల అందులో ఒకనెల శెలవు జీతం నష్టం మీదే. కానీ తప్పేది ఏముంది ? మిగతా ఏర్పాట్లన్నీ కూడా పూర్తిచేసి ఆయనకు ఏ అసౌకర్యమూ కల్గకుండా చూసి ఇంటికి వచ్చాడు. టైము రెండయ్యింది.

తల్లి అతనికి అన్నం పెడుతూ మూల్గుతోంది. గుండెల్లో నొప్పి అట.

''ఏడుకొండలవాడా ! రక్షించు...'' అంది.

భోజనం చేసి కాస్సేపు నడుం వాల్చాడు. సాయంత్రం చూస్తే చెల్లెలు పరమేశ్వరికి జ్వరం.

''లోకంలో ఉన్న రోగాలన్నీ మా ఇంటికే పంపుతున్నావా స్వామీ ! ... మమ్మల్ని రక్షించు. నీకు కోటి నమస్కారాలు ...'' తల్లి అంది.

చికాకుపడ్డాడు అనంతరాం —

''ఊరుకోవే ! ఎందుకలా రోజుకు వందసార్లు దేముడ్ని తలుస్తావు ? ఆయన దిగివచ్చి నీకున్న సమస్యలు పోగొడతాడా ?'' అన్నాడు.

''తప్పు నాయనా ! ఆ స్వామిని అలా అనకు...''

''అంటాను .. ముందు దాన్ని హాస్పటల్‌కు తీసుకువెళ్లాలి. నడవగలదా, కనుక్కో...ఈ జ్వరం ఏమిటోపాడు ...'' అన్నాడు.

ఆమెను హాస్పటల్‌కు తీసుకువెళ్లి వచ్చాడు.

ఎదురింట్లోంచి ఉమాకాంతరావు పిల్చాడు.

''రండి, బావగారూ...'' అన్నాడు ఉమాకాంతరావు గుమ్మంలో నిల్చున్న అనంతరాంతో.

'అప్పుడే వరస కలిపేశాడే ...' అనుకున్నాడు అనంతరాం.

లోపలకు వచ్చి కూర్చున్నాడు.

''నేను అన్ని చోట్లా ప్రయత్నించి, ఫలించక ఇక ఆఖరి ప్రయత్నంగా మిమ్మల్ని అడుగుతున్నాను. సత్యవతితో పెళ్లికి ఏర్పాట్లు అన్నీ చేస్తున్నాను. అన్నవరంలో తెల్సిన వాళ్లకి ఉత్తరం రాశాను. ఒక వెయ్యిరూపాయలు ఖర్చులకు కావాలి. అది మీరు సర్దాలి ...'' అన్నాడు ఉమాకాంతరావు.

లెక్కలేనన్ని కష్టాల్లో వుండి, డబ్బుకి ఇబ్బంది పడుతూ తనకు అయిదొందలయి ఎవరు ఇస్తారా అని తన గొడవలో తను వుంటే మధ్యలో ఈ బరువు ఏమిటి ? అనంతరాం నెత్తిమీద పిడుగు పడినట్లయింది.

''ఇది అప్పుగా భావించండి. మిమ్మల్ని ఖర్చు పెట్టమని అనటం లేదు. నాకు సానుకూల పడగానే ఆ సొమ్ము మీకు ఇచ్చేస్తాను .......'' అన్నాడు ఉమాకాంతరావు.

అప్పుగా అయినంత మాత్రాన్న ఆ సొమ్ము పుట్టేది ఎలా ? అసలది అప్పుగా భావించమని ఊరికనే అంటున్నాడని అన్పించింది అనంతరాంకి. 'ఆడపిల్ల తరపువాడివి ఆ మాత్రం ఖర్చు కూడా భరించలేకపోతే ఎలాగోయ్' అన్న భావం అతని ముఖంలో, భాషలో కన్పించింది అనంతరాంకి.

''అయ్యో ! వుంటే ఒక వెయ్యి ఏం ఖర్మ, ఎంతయినా ఇయ్యడానికి సిద్ధం. కానీ నా పరిస్థితే ఘోరంగా వుంది. అసలే నిరుద్యోగిని. నాన్నగారు హాస్పటల్లో ఉన్నారు. అమ్మకు, చెల్లికీ రోజూ రోగమే. ఉద్యోగం కోసం నాకే ఒక అయిదువందలు కావాలి. ఎక్కడ్నుంచి తెచ్చేదిరా భగవంతుడా అని ఆలోచించి పిచ్చివాడినై పోతున్నాను. నన్ను ఇలా మీరు ఇబ్బంది పెట్టడం ధర్మం కాదు...'' నిజాన్ని కక్కేశాడు. అవును మరి. మొహమాటం ఎందుకు ? ఇంటికొచ్చిన బావ బలవంతం పెట్టాడని మొహమాటం పడితే నెలల తర్వాత కడుపొచ్చిందని తెల్సిందట ఒక వెర్రి బాగుల మరదలుకి. అలాంటి పరిస్థితి ఎందుకు తెచ్చుకోవాలి ?

''ఆలోచించండి. ఆ సొమ్ము లేకపోతే పెళ్లి అనవసరంగా ఆలస్యం అయిపోతుంది. అందుకే నేను ఇంతగా వర్రీ అవుతున్నది. చూడండి బావగారూ ! శిశువు బ్రతికినా మానినా పురిటినొప్పులు పడ్డం ఆడదానికి తప్పదు. అలాగే మీ ప్రయత్నం ఫలించినా మానినా ప్రయత్నించడం తప్పదు. ఒకసారి మీ అక్కయ్య ముఖం చూసి మరీ ప్రయత్నించండి.

తప్పకుండా ఫలిస్తుంది. అప్పరాల్, ఎంతంజీ, ఒక వెయ్యి రూపాయలే కదా !...'' అన్నాడు ఉమాకాంతరావు అదేదో పది రూపాయలే అన్నంత తేలిగ్గా. జేబులో డబ్బులుంచుకుని హోటల్‌కి వెళ్లి టిఫెన్ తిని రావడం అంత తేలిగ్గా చెప్పాడు.

ఆ సమయంలో ఉమాకాంతరావు మొహంలో ఒక విలను, ఒక వడ్డీ వ్యాపారీ కన్పించాడు.

''నా పరిస్థితి...'' మళ్లీ పాత పాట మొదలు పెట్టాడు అనంతరాం.

''నాకు తెలియనిది కాదు. అయినా మిమ్మల్నే అడుగుతున్నానంటే నా పరిస్థితి ఏమిటో ఆలోచించండి...'' అన్నాడు ఉమాకాంతరావు.

దొంగతనమో, దోపిడీయో చేస్తే తప్ప ఈ సమస్యలు తీరేట్లు లేవు. తనకి అయిదొందలు, అతనికి వెయ్యి, ఇంటి ఖర్చులు మరో అయిదొందలు— ఇంత సొమ్ము ఎక్కడ్నుంచి వస్తుంది ?

అలాడిన్‌కి దొరికినట్లు ఒక అద్భుత దీపం దొరికితే బాగుండును.

ఆలీబాబాకు తెలిసినట్లు ఒక దొంగల ముఠా స్థావరం తెల్సినా బాగుండును.

సింద్‌బాద్‌కి లభించినట్లు ఒక అపూర్వ యాత్ర తగిలినా బాగుండును.

దీర్ఘంగా నిట్టూర్చి 'ప్రయత్నిస్తాను' అని మాట ఇచ్చి బైటకొచ్చాడు.

ఆ రాత్రి భోజనం చేసి చల్లగాలిలో తిరిగి రావాలని బైటపడ్డాడు అనంతరాం.

ఆ రాత్రి అనంతరాం ఎన్ని గంటలకు తిరిగి వచ్చాడో తెలియదుగానీ తను గాఢనిద్రలో వుండగానే తలుపు తీసినట్లు సుందరమ్మకు జ్ఞాపకం. దానికి తగ్గట్టు ఆ మర్నాడు ఆలస్యంగా నిద్రలేచాడు అనంతరాం.

''ఇంట్లో నిండుకున్న సరుకుల లిస్టు రాయి. అన్నీ తీసుకొస్తాను. నీకు అవసరం అయిన హార్లిక్సు లాంటివి కూడా రాయి అన్నీ తీసుకువస్తాను...'' అన్నాడు అనంతరాం ముఖం కడుక్కున్నాక కాఫీ త్రాగుతూ.

''సర్లే, హార్లిక్సు అయిపోయి రెండు నెల్లు అయింది. ఈ మధ్య దాని సంగతి మర్చిపోయాం. మిగతా నిత్యావసర వస్తువులు కూడా అయిపోయినా చారునీళ్లతో రోజులు లాగిస్తున్నాను...'' అంది సుందరమ్మ.

''పాత సంగతులు వదిలెయ్యి. ఇప్పుడు నీకేం కావాలో చెప్పు అన్నీ తీసుకొస్తాను...''

''డబ్బు ఎక్కడిది?...ఆ వెంకటేశ్వరస్వామి దయవలన...'' రెండు చేతులూ జోడిస్తూ అంది.

''అవును. ఆ వెంకటేశ్వరస్వామి దయకల్గింది. ప్రస్తుతం మనకు లోటు లేదు...'' అన్నాడు అనంతరాం స్నానానికి లేస్తూ.

ఆ తర్వాత దుకాణంలో తల్లి ఇచ్చిన లిస్టు ప్రకారం సరుకులు కొన్నాడు. బియ్యం మొదలు ఇంగువ డబ్బా వరకూ అన్నీ వున్నాయి. రిక్షాలో వేసుకొచ్చాడు సరుకులు. హార్లిక్సుతో పాటు ఉంటుందని బోర్నవిటా కూడా కొన్నాడు. టూత్ పౌడర్ కావాలంటే దాంతోపాటు ఫేస్ పౌడరు కూడా కొన్నాడు.

## తెల్లవారని బ్రతుకులు

మధ్యాహ్నం భోజనం చేసి ఎంప్లాయిమెంట్ ఆఫీసులో మధుసూదనంని కల్సి అయిదొందలు ఇచ్చేశాడు. కాల్ లెటర్ పంపించమని దబాయింపుగా మాట్లాడి మరీ వచ్చాడు. హాస్పటల్‌కి వెళ్లి తండ్రిని చూశాడు.

''ఇంటి సమస్యల గురించి చింతించకుండా హాయిగా వుండమనీ, అదే త్వరలో కోలుకుందుకు దారి అనీ, ఏం కావల్సినా తనని అడగమనీ' అన్నాడు. ఇంత ధైర్యంగా ఎలా మాట్లాడగల్గుతున్నాడని ఆదినారాయణకు అనుమానం వచ్చినా అడగలేదు. తనకు అంత ధైర్యం ఎలా వచ్చిందో అనంతరాం కూడా చెప్పలేదు.

ఆ సాయంత్రం ఉమాకాంతరావుని కలిశాడు. యవ్వనంతో పిటపిటలాడుతున్న పిల్లదానిలా ఉన్న వంద కాయితాలు పది తీసి అతని చేతిలో పెట్టాడు. అంత త్వరలో సాధించగలడని నమ్మకం లేని ఉమా కాంతరావు ఆ డబ్బు చూసి నోరు వెళ్లబెట్టబోయి బాగుండదని ఊరుకున్నాడు.

''చాలా సంతోషం. ఇంత త్వరగా సాధించ గలరని నాకు నమ్మకం వుంది. మీరు కార్యసాధకులు. ఉత్తమ పురుషులు ఎప్పుడూ...'' అంటూ ఏదో హిందీ పద్యాన్ని అనువదించి కాబోలు తెలుగులో ఒక సుభాషితం చెప్పసాగాడు హిందీ టీచర్ ఉమా కాంతరావు.

అలాంటి కబుర్లు వినడం తనకు అలవాటే అయినట్లుగా పట్టించుకోకుండా బైటకు రాబో తుంటే—

నేను ఎల్లుండి ఊరికి వెళ్తున్నాను. తేదీ తెల్పుతూ మీకు ఉత్తరం రాస్తాను. సత్యవతిని తీసుకుని అన్నవరం వచ్చేయండి'' అన్నాడు ఉమా కాంతరావు.

'సరే...' అన్నాడు అనంతరాం.

పార్కులోకి వెళ్లి కూర్చున్నాడు అనంతరాం. నిన్నటికీ, ఈ రోజుకీ ఎంత తేడా ? నిన్న పైసా కోసం వెతుకుతున్న బికారి, ఈ రోజు ఆరువేల సొమ్ముకు అధికారి. నిన్న వాడిపోయిన పువ్వు. ఈ రోజు సుగంధం చిందే వేయి రేకుల అందాల రంగుల పువ్వు. నిన్న తను ఇసుకదిబ్బల ఎడారి. ఈ రోజు రకరకాల పూల నందనవనం. ఈ మార్పు ఎలా వచ్చింది? తను అన్యాయంగా ప్రవర్తించడంవల్ల కదూ? అది ధర్మమే. ఆలోచనలో పడ్డాడు.

ఈ రోజుల్లో న్యాయంగా సంపాదించినవాడు సుఖంగా తినగల్గుతున్నారేమోకానీ అంతన్న భోగాలు సమకూర్చుకోలేక పోతున్నాడు. అన్యాయం ఎదిరించబోయి తనూ చెయ్యి కలిపాడు. ఈరోజుల్లో డబ్బుతో సుఖపడాలిగానీ ఆ డబ్బు ఎలా వచ్చిందని ఆలోచించడం కాదు. నిన్న రాత్రి వెంకటేశ్వరస్వామి గుడి హుండీ బలవంతంగా బద్దలుకొట్టి డబ్బు పంచుకుంటున్న పూజారి, కరణం, మునసబు మధ్యకు తను వెళ్లి బెదిరించి తనూ వాటా తీసుకున్నాడు. సత్యవతి పెళ్లికి ముహూర్తం గురించి కనుక్కుందామని పూజారి కోసం గుడికి వెళ్లాడు రాత్రి. అక్కడ జరుగుతున్న భాగవతం అది. కోపం వచ్చి ఆ బండారం బైట పెడతానని బెదిరించాడు. వాళ్లు శాంతపరిచి వాటా ఇచ్చారు. ప్రస్తుత పరిస్థితిలో తన అవసరాలు గుర్తించి తనూ వాటా పంచుకున్నాడు. తల్లి అన్నట్లు ఈ రోజు తన చేతిలో డబ్బు ఆడడాన్కి కారణం వెంకటేశ్వరస్వామి దయ.



ఒక నెల గడిచిపోయింది. చేతిలో వుందని దుబారా చెయ్యకుండా అవసరమైన తీరులో ఖర్చు పెడుతూ వచ్చాడు అనంతరాం. కానీ అతనికి రెండు గట్టి దెబ్బలు తగిలాయి ఈ నెల రోజుల్లో.

ఊరికెళ్లిన ఉమాకాంతరావు సత్యవతిని పెళ్లి చేసుకునే ప్రయత్నాలు చెయ్యక వేరే అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు. ఒక శుభలేఖ పంపాడు అనంతరాంకి. అది అతని పెళ్లి అయ్యాకా అందింది. ఏం చెయ్యగలడు ? ఆ విషయం తెల్సి సత్యవతి అదేపనిగా రోదించసాగింది. 'పోనీ, ఇప్పుడు కొంపలేం అంటుకున్నాయ్ ?' అని ఊరుకోబెట్టాడు. కానీ నిజంగా కొంపలు అంటుకున్న స్థితే అని తర్వాత తెల్సింది. ఒకరోజు రాత్రి సత్యవతి ఆత్మహత్య చేసుకుంది. పోస్టుమార్టంలో ఆమెకు నాలుగో నెల కడుపు అని తెల్సింది.

అయిదొందలూ ఖర్చుపెట్టి కాల్ లెటర్ తెప్పించుకుని ఇంటర్వ్యూకి వెళ్లిన అనంతరాంకి ఉద్యోగం రాలేదు. అందుకు కారణం అతనికి ఉద్యోగం ఇస్తానన్న అతని ఫ్రెండ్ తండ్రి అప్పటికి బదిలీ అయ్యి వెళ్లిపోవడం.

ఈ రెండు దెబ్బలతో మనిషి నీరసించి పోయాడు. ఉన్న డబ్బు కూడా ఖర్చు అయిపోతోంది. తర్వాత ఎలా ? తండ్రి ఇంకా హాస్పటల్లోనే వున్నాడు.

ఒకరోజు రాత్రి పరమేశ్వరికి హైటెంపరేచర్ వచ్చి హడావుడి చేసింది. రాత్రికి రాత్రే హాస్పటల్‌కి తీసుకెళ్లాడు. అక్కడ ఇంజక్షనూ అదీ ఇచ్చి ''రాత్రి గడిస్తేగానీ చెప్పలేం ఇంటికి తీసుకెళ్లండి. ఇక్కడ చేర్చుకుందుకు ఖాళీలు లేవు...'' అన్నారు.

''ఒరేయ్ ! తెల్లవారిపోయింది... లేవరా...'' అని తల్లి తట్టి లేపింది అనంతరాంని.

కిటికీలోంచి చూశాడు. వెలుగు వచ్చేసింది. రాత్రంతా హడావుడి చేసిన పరమేశ్వరి మత్తుగా నిద్రపోతోంది. ఒంటిమీద చెయ్యివేసి చూశాడు అనంతరాం. కొంచెం చల్లగా తగిలింది. అతనికున్న జ్ఞానం ఆమె అప్పటికే చచ్చిపోయిందని చెప్పలేక పోయింది.

మూలిగాడు అనంతరాం —

''అమ్మ తెల్లవారిపోయిందని అంటోందిగానీ తమ జీవితాల్లో తెల్లవారడం అంటూ వుందా ? చీకటి తప్ప వెలుగు ఎరుగని బ్రతుకులు. అబ్బే... ఈ జీవితాల్లో వెలుగు రాదు... ఇవి తెల్లవారని బ్రతుకులు...'' మంచంమీద మళ్లీ ముడుచుకుని పడుకున్నాడు.



# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."

## నైసిల్
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడర్.






2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

## నైసిల్ తెచ్చుకోండి
చెమటకాయల
బాధ మరిచిపోండి.

ప్రత్యేకమైన ఔషధ యుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి స్థితిలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మజీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

CASGLN-4-203 TEL




# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వేంకట దుర్గాప్రసాద్

**డాక్టర్ సెవార్డు డైరీ :**

సెప్టెంబర్, 18: వెంటనే హిల్లింగ్‌టన్‌కు కార్లో వెళ్లాను. కారు బయట ఆపి, ఇంట్లో మేడ పైకి ప్రవేశించాను. తలుపు మెల్లగా తట్టాను. కాలింగ్‌బెల్ వీలయినంత మెల్లగా కొట్టాను, లూసీ గానీ వాళ్లమ్మగానీ నిద్రలేస్తారేమోనని. నా చప్పుడుకు పనిమనిషి లేస్తేచాలు అనుకున్నాను. కాస్సేపు చూసాను. జవాబు లేకపోయే సరికి, తలుపు మళ్ళీ తట్టాను. కాలింగ్‌బెల్ కొట్టాను. అప్పటికీ ఎవరూ వచ్చేజాడ కనిపించలేదు. ఆ పనిమనుషుల్ని తిట్ట బుద్దేసింది, వాళ్ల బద్ధకపు రోగానికి. ఇప్పుడు పదిగంటలు కూడా కాలేదు. అప్పుడే ఎక్కడో పడి నిద్రపోతూ వుంటారు. మళ్ళీ తలుపు తట్టి కాలింగుబెల్ మోగించాను, చాలా విసుగ్గా. ఫలితం మామూలే— జవాబులేదు. ఇప్పటిదాకా పని మనుషుల్ని తిడుతూ వుండిపోయాను, కానీ, మళ్ళీ ఏదోభయం నన్ను ఆవహించడం ప్రారంభించింది. మళ్ళీ ఏదో పీడ మా అందర్నీ చుట్టుకొంటున్న ట్టుంది? ఒకవేళ నేను ఆలస్యంగా రావడంవల్ల ఏదైనా ఘోరం జరిగిపోయిందా? ఆ కాలం విలువ నాకుతెలుసు— నిముషాలు., సెకన్ల ఆలస్యం జరిగితే చాలు, లూసీ గంటలకొలది ప్రమాదంలో చిక్కు కుంటుంది. ఆమె మళ్ళీ అటువంటి ప్రమాద పరి స్థితుల్లో పడిపోయిందా? నేను ఇంటి చుట్టూ తిరిగాను, లోపలి కెళ్లడానికి ఏదైనా దారి కనపడు తుందేమోనని.

లోపలికెళ్లడానికి మార్గం దొరకలేదు. ప్రతి తలుపు, కిటికీ తలుపులు బిగించి లోపల గడియ పెట్టేసి వున్నాయి. ఏం చెయ్యాలో తోచక బయట వరండాలోకి వచ్చాను. అప్పుడే వేగమైన గుర్రపు డెక్కల శబ్దం విన్నాను. గుర్రపుబండి బయట గేటు దగ్గర ఆగింది. కొన్ని సెకన్ల తర్వాత వాన్ హెల్సింగ్ బండిదిగి ఇంట్లోకి పరుగెత్తాడు. దారిలో నన్ను గమనించి 'ఓ నువ్వా! వచ్చావన్నమాట! ఎట్లావుంది లూసీకి ? మనం ఆలస్యంగా వచ్చామా? నా టెలిగ్రాం నీకు అందలేదా?' అడిగాడు.

(గత సంచిక తరువాయి)

టెలిగ్రాం ఇవాళ ఉదయమే అందిందనీ, వెంటనే ఒక్కక్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా ఇక్కడకు పరుగెత్తుకు వచ్చాననీ, నేను పిలిస్తే ఇంటోవాళ్ళు ఎవరూ పలకలేదనీ, గబగబా జవాబు చెప్పాను. అతను ఒక్క క్షణం ఆగి, తలమీద టోపీకాస్త పైకెత్తి గంభీరంగా అన్నాడు :

''అయితే, మనం చాలా ఆలస్యం చేసామను కుంటాను. ఇక దేవుడి దయ.''

వెంటనే మళ్ళీ కోలుకుని ''పద. లోపలికెళ్ల డానికి దారి లేకపోతే మనమే ఒకదారి ఏర్పరుచుకుని వెళ్లాలి. ఇప్పుడంతా వేళకి చెయ్యడంలోనే వుంది'' అన్నాడు.

ఇద్దరం ఇంటి వెనక్కి వెళ్లాం. అక్కడ వంట గది కిటికీ వుంది. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ తన బ్యాగ్‌లోనించి చిన్న రంపం ఒకటి బయటకు తీసాడు. అది నాకిచ్చి, ఆ కిటికీ చువ్వలను చూపించాడు. వెంటనే ఆ రంపం ఉపయోగించి మూడు చువ్వలను కోసిపారేసాను. తర్వాత ఒక పొడుగాటి కత్తిని కిటికీ వెనక్కి పోనిచ్చి, గడియ తీసేసాను. కిటికీ తలుపులు తెరిచాను. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్‌కు సాయం పట్టి కిటికీలోంచి లోపలికి. పంపించాను, తర్వాత నేను కూడా లోపలికి. ప్రవేశించాను. వంటగదిలో గాని, దగ్గర్లో వున్న పనిమనుషుల గదిలో గానీ, ఎవరూ కనిపించలేదు. అక్కడ్నించి వెళుతూ అన్ని గదులు చూసాం. భోజనాల గదిలో మసకగా దీపం వెలుగు తోంది. ఆ కాస్త వెలుతురులో ఆడ పనిమనుషులు నలుగురూ, అచేతనంగా పడి వుండటం చూసాను. వాళ్ళు చనిపోయారని అనిపించలేదు. వాళ్ళు వూపిరి తీస్తున్నారు. ప్రక్కనే నల్లమందు తాలూకు సీసా చూసి, వాళ్ళ పరిస్థితి అర్థం చేసుకున్నాను. వాన్ హెల్సింగ్ నేనూ ఒకరి మొహాలు ఒకరు చూసు కున్నాం. అక్కడ్నించి కదులుతున్నప్పుడు, ''వీళ్ల సంగతి తర్వాత చూడొచ్చు !'' అన్నాడు. అక్కడ్నించి లూసీ గదిలోకి వెళ్లాం. ఒకటి రెండు క్షణాలు తలుపు దగ్గర నిలబడి, ఏదైనా వినపడుతుందేమోనని ఎదురు చూసాం. కానీ మాకెలాంటి శబ్దమూ విని పించలేదు. పాలిపోయిన మొహాలతో, వణుకుతున్న చేతులతో, మెల్లగా తలుపుని వెనక్కి తోసి, లోపలికి అడుగు పెట్టాం.

మేం చూసిన దృశ్యం ఎట్లా వర్ణించి చెప్పాలి? మంచంమీద ఆడవాళిద్దరూ పడుకుని వున్నారు. లూసీ తల్లి దూరంగా పడివుంది. ఆమెకు తెల్లటి దుప్పట కప్పేసి వుంది. అప్పుడే, తెరచి వున్న కిటికీ లోంచి గాలి లోపలికి వచ్చి లూసీ తల్లిమీద కప్పబడ్డ దుప్పటిని తొలగించింది. అప్పుడు పాలిపోయి, భయంతో బిగుసుకుపోయిన లూసీ తల్లి మొహం కనపడింది. ఆమె ప్రక్కనే మరింత పాలిపోయిన మొహంతో లూసీ పడుకుని వుంది. లూసీ మెడలో వుండాల్సిన వెల్లుల్లి పాయల దండ, లూసీ తల్లి ఎదమీద కనిపించింది. ఆమె గొంతు దగ్గర ఆచ్ఛాదన లేకుండా వుంది. అక్కడ రెండు గాటులాంటి గుర్తులు ఇదివరకు నేను చూసినవి వున్నాయి. ఆ గాయాలు మరింతగా తెగిపోయి తెల్లగావున్నాయి. వాన్‌హెల్సింగ్ ఏం మాట్లాడ కుండా, ఆమె ఎదపైన వంగాడు. అతని తల దాదాపు ఆమె రొమ్ముకు తగులుతోంది. వెంటనే తల ఇటు తిప్పి, మోకాళ్లమీద వంగునే అరిచాడు :

''మరీ ఆలస్యం జరగలేదులే. తొందరగా బ్రాందీ తీసుకురా, తొందరగా !''

నేను గబగబా క్రిందికి పరుగెట్టి, బ్రాంది తీసుకొచ్చాను. ఆ బ్రాందీ వాసన చూసి, కొద్దిగా రుచి చూసాను. అట్లా జాగ్రత్త తీసుకోకపోతే, ఆ పని మనుషుల్లా పడిపోవలసి వస్తుంది. ఆ పని వాళ్ళు నలుగురూ, ఇంకా భారంగా వూపిరి తీస్తూనే వున్నారు. వాళ్ల కొద్ది కొద్దిగా మత్తులోంచి తేరుకుంటున్నట్టు అనిపించింది. వాళ్లని పరీక్షిస్తూ కూర్చోకుండా, వాన్‌హెల్సింగ్ దగ్గరకు తిరిగివచ్చాను. ఇదివరకు ఒకసారి చేసినట్టుగా, కొద్దిగా బ్రాందీని ఆమె పెదాలకు, పళ్ల చిగుళ్లకు, మణికట్టు దగ్గర, అరచేతులకు, చేతులకు రాసాడు.

''ఇది నేను చేస్తుంటాను. నువ్వెళ్లి ఆ పని మనుషులను లేపు. తుండు ఒకటి తీసుకుని వాళ్ల మొహంమీద కాస్త గట్టిగా కొట్టి లేపు. లేచిన తర్వాత వాళ్లని పొయ్యి వెలిగించమను. వేడినీళ్ళు కూడా ఏర్పాటు చేయమను. ఈ అమ్మాయి శరీరం, చనిపోయిన తల్లి శరీరంలాగే, చల్లగావుంది. ఈమె శరీరంలో వెచ్చదనం పుట్టుకురావాలి. అప్పటిదాకా ఏం చెయ్యటానికిలేదు'' అన్నాడు.

**జరిగిన కథ — 15 :** లూసీ ఆరోగ్యం గురించి జాన్ సెవార్డు ఆర్థర్ హాల్మ్‌వుడ్‌కి తెలియ జేస్తుంటాడు. లూసీ పరిస్థితి దయనీయంగా వుంది. ఆమె వంట్లో రక్తం చాలా తక్కువగా వుంది. అందువల్ల ఆమెకు రక్తం ఎక్కించటానికి ప్రయత్నాలు చేస్తుంటాడు ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్. డాక్టర్ సెవార్డు లూసీకి తన వంట్లోని రక్తం ఇస్తాడు. ఆమె పరిస్థితి ఇప్పుడు కొంచెం మెరుగ్గా వుంటుంది. పారిపోయిన తోడేలు కథనం గురించి జులాజికల్ గార్డెన్స్ రక్షకుడిని ''ది పాల్‌మాల్ గెజిట్'' పత్రికా విలేఖరి ఇంటర్వ్యూ చేస్తుంటాడు. పారిపోయిన తోడేలు దానంతటదే వచ్చేస్తుంది.

వెంటనే అక్కడ్నించి క్రిందికివెళ్ళాను. ముగ్గురు పనిమనుషుల్ని లేపడం నాకు కొద్ది కష్టమనిపించింది. కానీ నాలుగో పనిపిల్లను లేపడం కష్టతరమయింది. ఆ పిల్ల బాగా వయసులో వుంది, ఆమెమీద మత్తు బాగా పనిచేసింది. ఆమెను మెల్లగా లేవనెత్తి సోఫాలో పడుకోబెట్టాను. మిగిలిన ముగ్గురూ మొదట విస్తుపోయి చూసారు, కానీ తర్వాత విషయాలు గుర్తుకు తెచ్చుకుని, ఒళ్ళు తెలీకుండా అరుస్తూ ఏడ్చారు. వాళ్లతో కాస్త కటువుగా వుండి, మాట్లాడనీయకుండా చేసాను. మరో ప్రాణంపోయే స్థితిలో వుందనీ, ఏమాత్రం ఆలస్యం చేసినా, లూసీ దక్కదనీ వాళ్ళకి చెప్పాను. వాళ్ళు అరుస్తూ, ఏడుస్తూ ఒంటిమీద బట్టలు సర్దుకోకుండానే, గబగబా, పొయ్యి వెలిగించి, వేడినీళ్ళకు ఏర్పాట్లు మొదలెట్టారు. అదృష్టవశాత్తు బాయిలర్‌లో నిప్పు ఆరిపోలేదు. నీళ్ళు కూడా అందులో వున్నాయి. ఒక నీళ్లతొట్టె తీసుకొచ్చి లూసీని అందులో వుంచాం. ఆమె శరీరాన్ని మర్దన చేయడంలో మేమంతా మునిగి వున్నప్పుడు, క్రింద హాలు తలుపు కొట్టిన చప్పుడయింది. ఒక పనిమనిషి ఒంటిమీద బట్టలు గబగబా సర్దుకుని క్రిందికి పరుగెట్టి, తలుపు తీసింది. మళ్ళీ ఆమె తిరిగొచ్చి, ఆర్థర్ హోల్మ్‌వుడ్ నుంచి ఒకతను కబురు తీసుకొచ్చాడని చెప్పింది. అతన్ని కాస్త వేచివుండవలసిందిగా చెప్పమని ఆమెకు చెప్పి పంపించాను. ఎందుకంటే, ఇప్పుడు ఎవర్నీ చూసే స్థితిలో లేం. ఆమె వెళ్లిపోయింది. మేం మా పనిలో వుండిపోయాం, ఆ వచ్చినతను గురించి పూర్తిగా మర్చిపోయి.

ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్, అంత కష్టపడుతూ పనిచేయడం నేనెప్పుడూ చూడలేదు. అతనికీ నాకు తెలుసు, ఇది మృత్యువుతో పోరాటం అని. అదే చెప్పాను మధ్యలో ఒకసారి. అందుకతను ఏదో చెప్పాడు నాకు సరిగా అర్థంకాలేదు.

"ఒకవేళ అదే అయితే, ఇప్పుడు చేస్తున్న పని ఆపేద్దాం. ఆ విధంగా ఆమెకు శాశ్వతమైన ప్రశాంతి లభిస్తుంది. ఎందుకంటే, ఆమె బ్రతికి వుండి, సుఖపడేయోగం కనపడ్డంలేదు" అన్నాడు. అతను మామూలుగా తన పనిలో, మరింత చురుకుగా, మునిగిపోయాడు.

మేం చేస్తున్నదానివల్ల, ఆమె శరీరంలో కొంత వేడి పుడుతున్నట్టుగా మాకు అనిపించింది. లూసీ గుండె బాగా కొట్టుకుంటున్నట్టు స్టెతస్కోపు పెట్టుకుని విన్నాను. ఆమె వూపిరితిత్తుల్లో కూడా కదలిక ప్రారంభమయింది. వాన్‌హెల్సింగ్ మొహం కాస్త విప్పారింది. ఆమెను తొట్టెలోంచి లేవనెత్తి, వెచ్చటి గుడ్డమీద దొర్లించాం, ఆమె ఒంటిమీద తడి ఆరిపోడానికి.

"ఇప్పుడు మొదట మనమే గెల్చాం. ఆట కట్టయింది" అన్నాడు.

లూసీని అక్కడ్నించి మరో గదిలోకి మార్చాం. ఆ గదిలో అప్పటికే, ఆమె పడకకు ఏర్పాట్లు జరిగాయి. ఆమెను మంచంమీద పడుకోబెట్టి, కొన్ని బ్రాందీ చుక్కలు ఆమె గొంతు దిగువన వేసాం. వాన్‌హెల్సింగ్ ఆమె మెడచుట్టూ, సిల్కు జేబురుమాలు ఒకటి చుట్టి కట్టాడు. ఇంకా ఆమె అపస్మారకంలోనే వుంది. ఆమె పరిస్థితి ఏమీ బాగోలేదనే చెప్పాలి.

వాన్‌హెల్సింగ్, పనిమనిషిని ఒకతెను పిలిచి, లూసీని జాగ్రత్తగా కనిపెట్టుకుని వుండమనీ, మేం తిరిగి వచ్చేదాకా, దృష్టిని మరల్చడానికి వీల్లేదని చెప్పి, నన్ను గది నుండి బయటకు తీసుకుపోయాడు.

"ఇప్పుడేం చెయ్యాలో మనం సంప్రదించుకోవాలి" అన్నాడు మెట్లు దిగుతూ. క్రింద హాల్లో భోజనాల గది తలుపులు తీసాడు. ఇద్దరం ఆ గదిలోకి వెళ్లాం. వెళ్లిన తర్వాత వాన్‌హెల్సింగ్ తలుపులు వేసేసాడు. కిటికీ రెక్కలు తెరిచాడు. కానీ తెరలు తొలిగించలేదు. గది అంతా కాస్త చీకటిగా వుంది. ఏదో మా పనులు చేసుకోడానికి వీలయినంత వెలుతురు వుంది. అప్పటి వరకూ కటువుగా ప్రవర్తించిన వాన్‌హెల్సింగ్, కొద్దిగా తగ్గాడు. ఏవిటో విపరీతంగా ఆలోచిస్తూవున్నట్టు కనిపించాడు. ఏం చెపుతాడో అంటూ ఎదురు చూస్తూ వుండిపోయాను.

"ఇప్పుడు మనమేం చెయ్యాలి? ఎవరి సహాయం అర్థించాలి ? మళ్ళీ ఆమె శరీరంలోకి రక్తం ఎక్కించాలి. అదీ కూడా త్వరగా జరగాలి పాపం, ఆ పిల్ల ప్రాణం మరొక్క గంటకంటే ఎక్కువ నిలవదు. నువ్వు కూడా బాగా బడలిక చెందావు. నేనూ అంతే, ఇకపోతే, ఈ ఆడ పనిమనుషుల్ని నమ్మబుద్ధి కావడం లేదు, వాళ్లంతట వాళ్ళు రక్తం ఇస్తామని ముందుకు వచ్చినా ! ఆమెకు రక్తదానం చేసే మనిషి దొరకటం కోసం ఇప్పుడు మనమేం చెయ్యాలి ?" అన్నాడు.

"నేను పనికి వస్తానా ?" అన్నమాటలు సోఫా దగ్గర్నించి వినవచ్చాయి. ఆ మాటలు వినగానే నాకు



## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకు ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతవేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥

## జీవన్ మృతులు

ఎంతో వూరటగలిగి, గుండె సంతోషంతో నిండిపోయింది. ఆ మాటలు 'క్విన్సీ మోరిస్'వి. అతని మొదటి మాటలు విని వాన్‌హెల్సింగ్ కోపంగా అతని వంక చూసాడు. కానీ, నేను "క్విన్సీ మోరిస్!" అని అరవగానే, వాన్‌హెల్సింగ్, తగ్గిపోయాడు. అతనివేపు చేతులుచాచి పరుగెత్తాను.

"ఏమిటిలా వచ్చావు?" అన్నాను. అతని చేతులను నా చేతుల్లోకి తీసుకుంటూ "బహుశా ఆర్ట్ పంపించి వుంటాడు" అన్నాను.

అతను నాకొక టెలిగ్రాం ఇచ్చాడు. అందులో ఇలావుంది. "మూడు రోజులుగా సెవార్డు దగ్గర్నుంచి వార్తలులేవు. నాకెంతో ఆందోళనగా వుంది. నేను బయలుదేరే పరిస్థితిలో లేను. మా నాన్న పరిస్థితి ఇంకా ఇట్లాగేవుంది. లూసికి ఎలావుందో చెప్పు. ఆలస్యం చెయొద్దు — హాల్మ్‌వుడ్".

"నేను సరైనవేళకు వచ్చాననుకుంటాను. నేనేం చెయ్యాలో చెప్పు చేస్తాను" అన్నాడు మోరిస్.

వాన్‌హెల్సింగ్ అతని ముందుకు వెళ్ళి అతని చెయ్యి అంది పుచ్చుకుని, అతని కళ్లల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు:

"ఓ అమ్మాయి కష్టదశలో వున్నప్పుడు ఈ భూమ్మీద అవసరమైన వస్తువు ఏమిటో తెలుసా, ఒక ధైర్యశాలి రక్తం నువ్వు అటువంటి ధైర్యశాలివి. అందులో సందేహంలేదు. మనల్ని ఎంత పీడ చుట్టుకొని బాధపెట్టినా, దేవుడు మనకి అవసరమైన వ్యక్తుల్ని పంపుతూ వుంటాడు.

మళ్లా ఆపరేషన్ తంతు జరిగింది. అవన్నీ వివరంగా రాయడానికి నాకు మనస్కరించడంలేదు. లూసీ ఈసారి బాగా దెబ్బతినింది. ఆమెకు అవసరమయినంత రక్తం నరాల్లో ఎక్కించినా, ఆమె మునిపటిలా తేరుకోలేదు. ఆమె మళ్ళీ బ్రతకడానికి చాలా భయంకరమైన అవస్థకు లోనయిందనే చెప్పాలి. ఏమైనా, ఆమె గుండె, వూపిరి తిత్తులు కాస్త మెరుగుపడ్డాయి. వాన్‌హెల్సింగ్ అప్పుడు ఆమెకు మత్తుమందు ఇచ్చారు. ఆమె మూర్ఛలోంచి మగతలోకి నచ్చింది. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ ఆమెను కనిపెట్టుకొని వుండిపోయాడు. నేనూ క్విన్సీ మోరిస్ కిందికి వెళ్లాం. ఒక పని మనిషిని బయట బండివాడికి డబ్బులిచ్చి రావడానికి పంపాను. ఒక గ్లాసుడు వైన్ తీసుకున్న తర్వాత క్విన్సీమోరిస్ సోఫాలో పడుకున్నాడు. వంట మనిషిని తొందరగా వంట చెయ్యమని చెప్పాను. వెంటనే ఒక ఆలోచన తట్టి, గబగబా లూసీ గదికి వెళ్లాను. నేను మెల్లగాగదిలోకి అడుగుపెడుతూ చూసాను. వాన్‌హెల్సింగ్‌చేతిలో ఒకటో రెండో కాగితాలు వున్నాయి. వాటిని చదివినట్టుగా కనిపిస్తున్నాడు. నుదురుమీద చెయ్యి పెట్టుకుకూర్చుని దీని విషయమే ఆలోచిస్తూ కనిపించాడు. సమస్యకు పరిష్కారం దొరికినవాడిలా అతని మొహంలో ఏదో వెలుగు కనిపించింది. చేతిలోని కాగితం నాకిస్తూ "లూసీని మనం స్నానం తొట్టెలోకి వుంచడానికి తీసుకెళుతుండగా, ఆమె ఎదమీదనుండి జారిపడింది" అన్నాడు.

ఆ కాగితం చదివి ప్రొఫెసర్ వంక చూస్తూ నిలబడిపోయాను. కొన్నిక్షణాల తర్వాత తేరుకుని "అయ్యో దేవుడా! ఏమిటిదంతా? ఆమెకు పిచ్చి వుందా, లేక పిచ్చి ఎక్కబోతోందా? లేకపోతే దారుణమైన విషయానికి సంబంధించినదా?" అడిగాను. నాక్కూడా ఒళ్ళు జలదరించింది. అంతకంటే ఎక్కువ మాట్లాడలేకపొయ్యాను. వాన్‌హెల్సింగ్ చెయ్యిచాచి, ఆ కాగితాన్ని మళ్ళీ తీసేసుకున్నాడు.

"దీని గురించి నువ్వు ఇప్పుడేం బాధపడకు. ప్రస్తుతానికి అన్నీ మరిచిపో. మంచి సమయం వచ్చినపుడు నీకన్ని విషయాలూ తెలుస్తాయి. కానీ దానికి కొంతకాలం పడుతుంది. అది సరేగానీ, నువ్వు నాకేదో చెప్పాలని వచ్చినట్టున్నావే?" అడిగాడు.

ఆమె మరణ సర్టిఫికెట్ గురించి మాట్లాడటానికి వచ్చాను. మనం జాగ్రత్తగా వుండకపోతే, విచారణలో ఇరుక్కుంటాం. ఈ కాగితం వాళ్ళకి ఇవ్వాల్సి వుంటుంది. విచారణకు రాకుండా జాగ్రత్త పడాలి. మనం ఇరుక్కున్నామంటే, అది లూసీకి చాలాదెబ్బ. అంతకంటే గట్టిదెబ్బ ఆమెకు మరొకటి వుండదు. లూసీ తల్లికి గుండెజబ్బు వుందనీ మీకూ, నాకూ, ఆమెకు వైద్యం చేసిన డాక్టరుకూ తెలుసు. ఆమె ఆ జబ్బువల్లే చనిపోయిందని మనం సర్టిఫికెట్ ఇద్దాం. సర్టిఫికెట్ ఇప్పుడే రాద్దాం. దాన్ని నేను తీసుకెళ్ళి రిజిష్ట్రారుకు ఇచ్చి అక్కడ్నుంచి శ్మశానవాటిక దగ్గరకు వెళ్తాను" అన్నాను.

"మంచిది, జాన్! చాలామంచి ఆలోచన. నిజంగానే లూసీ మనం దగ్గరుంటే కాస్త వూరట చెందుతుంది. ఒకళ్ళు, ఇద్దరూ, ముగ్గురు, నేనొక ముసలివాడ్ని. అందరం ఆమెకు రక్తాన్ని ఇచ్చిన వాళ్లమే. నిజమే జాన్! నాకూ గుర్తుంది. సమయానికి నువ్వు దీన్నిగురించి ఆలోచించినందుకు, నీమీద నాకు ప్రేమ ఎక్కువవుతోందోయ్! స్నేహి, తొరగా కానివ్వు" అన్నాడు.

లూసీ తల్లి, చనిపోయిందనీ, లూసీకి జబ్బుగా వుందనీ, అయినా కోలుకుంటోందనీ, వాన్‌హెల్సింగ్, నేనూ, ఆమె దగ్గరే వున్నామనీ, ఆర్థర్ హాల్మ్‌వుడ్‌కు ఒక టెలిగ్రాం తయారుచేసి క్రిందికి వెళ్ళాను. క్రింద హాల్లో క్విన్సీమోరిస్‌ను కలిసాను. టెలిగ్రాం ఇవ్వడానికి వెళుతున్నానని చెప్పాను. అయితే తొందరగా వెళ్లమన్నాడు. నేను వెళుతుండగా అతను అన్నాడు —

"జాక్, నువ్వు మళ్ళీ తిరిగి వచ్చేటప్పుడు నీతో

# నాణ్యతా
# లేక
# పొదుపా?



# ఇప్పుడు
# బోనస్ బనియన్‌లో
# రెండూ
# పొందండి.



ఇప్పటి వరకు మీరు ఎప్పుడు
మంచి నాణ్యమైన బనియన్
కొనాలనుకొన్నా దాని పైని వెల
చూసి కంగారు పడ్డారు. పొదుపు
చేయబోయి కొంటే దాని తక్కువ
నాణ్యత చూసి బాధపడ్డారు.
కాని, బనియన్ లేకుండా గడపలేరు
కనుక రెండిటిలో ఏదో ఒకదానితో
సరిపెట్టుకొన్నారు.

కాని ఇప్పుడు మీకోసమే వుంది
బోనస్-**VIP** నుండి సూపర్ ఫైన్
బనియన్. ఇది మొదటిమారుగా
మీకు నాణ్యత, పొదుపు–రెండిటినీ
ఇస్తుంది.

ఎక్కువ నాణ్యత, తక్కువ వెలకు!
ఆశ్చర్యపడ్తారేమో కాని, వాడి చూడండి.
మీకే తెలుస్తుంది.



## క్రొత్త
# బోనస్
## బనియన్

## ఎక్కువ నాణ్యత
## తక్కువ వెల

**VIP**

AVENUES/HH/B-254 TL

రెండు ముక్కలు మాట్లాడాలి'' అట్లాగే అని తల వూపి నేను బయటికెళ్ళాను. రిజిస్ట్రారు ఆఫీసులో నాకు పెద్ద ఇబ్బంది లేకుండా పని జరిగిపోయింది. అక్కడ్నించి కర్మకాండ చేసే మనిషిని సాయంత్రం రమ్మని చెప్పాను, శవపేటికకు కొలతలు తీసుకోడానికి, మిగతా కర్మకాండకు ఏర్పాట్లు చేయడానికి.

మళ్ళీ తిరిగి వచ్చేసరికి క్విన్సీమోరిస్ నాకోసం ఎదురు చూస్తున్నాడు. ఒకసారి లూసికి ఎట్లా వుందో చూసి మళ్ళీ కలుస్తానని, చెప్పి పైకి వెళ్ళాను. ఆమె ఇంకా నిద్రపోతూ వుంది. వాన్‌హెల్సింగ్ ఆమె ప్రక్కనే కుర్చీ వేసుకుని, పెదాలమీద వేలుంచుకుని కూర్చుని వున్నాడు. ముందరే ఆమె తెలివిలోకి రావాలనుకుంటు న్నట్టున్నాడు. తర్వాత ఆమె ఈ పరిస్థితికి ఎట్లా తట్టుకుంటుందో ఏమో అని భయపడుతున్నట్టు కనిపించాడు. నేను మళ్లా క్రిందికి వెళ్ళి క్విన్సీమోరిస్‌ను కలిసాను అతన్ని భోజనాల గదిలోకి తీసుకెళ్ళాను. ఆ గదిలో తెరలు పైకి తీసివున్నాయి. అందువల్ల కొంత వెలుగు వున్నట్టు తోచింది ఆ గదిలో, మిగతా గదులకన్నా. ఇద్దరం ఒంటరిగా వున్నప్పుడు అతను అన్నాడు.

''జాక్ సెవార్డ్! నేను ఇక్కడ వుండే హక్కు లేని మనిషిని, అందువల్ల నేను ఇక్కడ కనిపించడం నాకు ఇష్టంలేదు. కానీ ఈ కేసు సాధారణమయింది కాదు. లూసీని ప్రేమించానని ఆమెను పెళ్ళి చేసుకోవాలని అనుకున్నాననీ నీకు తెలుసు. అవన్నీ గతించిన విషయాలైనా, ఈ సమయంలో ఎందుకో ఆమె గురించి ఆందోళన చెందకుండా వుండలేక పోతున్నాను. అసలు ఆమెకు ఏం జరిగింది? ఆ డచ్‌మనిషి, చాలా మంచివాడిలా వున్నారు. నేను కూర్చున్నప్పుడు, మీ ఇద్దరూ గదిలోకి వచ్చారు. అప్పుడు అతను ఆమెకు రక్తం ఎక్కించాలనీ, నువ్వూ అతనూ, రక్తం ఇవ్వడానికి ఓపిక లేకుండా పోయిందనీ అంటుండగా విన్నాను. మీ ఇద్దరు వైద్యులూ ఏదో రహస్యంగా మాట్లాడు కుంటునట్టుగా వుంది, మూడో వాడికి అర్థం కాకుండా, కానీ ఇది సాధారణ మైన విషయం కాదు. ఏమయినా గానీ, నేను చెయ్య గలిగింది చేసాను అంతే కదా?''

''అంతే!'' అన్నాను.

అతను మళ్ళీ అన్నాడు, ''దీన్నిబట్టి, ఇవాళ నేను రక్తం ఇచ్చినట్టుగానే, నువ్వూ, వాన్‌హెల్సింగ్ ఇది వరకు రక్తం ఇచ్చి వుంటారు, అవునా?''

''అవును అంతే!'' అన్నాను.

''ఆర్ట్ కూడా ఇందులో వున్నాడు కదూ? నాలుగు రోజుల క్రితం అతన్ని ఇంట్లో చూసినప్పుడు జబ్బు మనిషిలా కనిపించాడు. అంత త్వరగా మనిషిని లాగేసిన విషయం ఏమిటో నాకు తెలీలేదు. ఆ మధ్య ఒక రోజు రాత్రి ఆడ గుర్రాన్ని తీసుకుని పచ్చిక బయళ్లలో తిరుగుతున్నాను. భూతం లాంటి గబ్బిలం ఒకటి ఆ రాత్రి దాన్ని పట్టుకుని రక్తాన్ని పీల్చేసింది. అది లేచి నిలబడలేని స్థితిలో వుండి పోయింది. నేనే చూడలేక ఒక బుల్లెట్‌తో దాని బాధను అంతం చేసాను. జాక్, ఆత్మద్రోహం చేసుకోకుండా నాకు నిజం చెప్పు. ఆర్థర్ మొట్టమొదట రక్తం ఇచ్చిన వాడు, కదూ?'' అన్నాడు.

అతను ఎంతో ఆందోళన చెందుతూ మాట్లాడాడు. తను ప్రేమించిన లూసీ పరిస్థితి గురించి తెలియక అయోమయ స్థితిలో కొట్టుకుంటున్నాడు. విషయం అర్థంకాని స్థితి, అతని బాధను పెంచు తోంది. అతని గుండె రక్తాన్ని చిందిస్తోందా అని పించింది. అంత బాధలోనూ, అతనిలో దాగిన ఠీవి అతన్ని వంచి క్రిందకు పడేయకుండా చేస్తోంది. ఒక క్షణం మౌనంగా వున్నాను. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ ఈ విషయాన్ని చాలా రహస్యంగా వుంచాలని చెప్పాడు. అతన్ని మోసం చెయ్యకూడదు మరి. కానీ క్విన్స్ మోరిస్‌కు అప్పటికే చాలా విషయాలు తెలిసి పోయాయి. చాలా ఊహించ గలిగాడు. కాబట్టి అతను అడిగినదానికి జవాబు చెప్పకపోవడం సబబు కాదని పించింది. అందుకే పొడిగా ''అవును'' అన్నాను.

''ఎప్పట్నించి ఇలా జరుగుతోంది?'' అడిగాడు.

''పది రోజులుగా'' అన్నాను.

''పది రోజులుగానా?! జాక్ సెవార్డ్! మనం అందరం ప్రేమించే లూసీకి ఈ పది రోజుల్లో నలుగురు బలమైనవాళ్ల రక్తం కావలసి వచ్చిందన్న మాట.'' అంటూ నాకు మరింత దగ్గరగా వచ్చి ''రక్తం దేనివల్ల పోయిందంటావు?'' అడిగాడు.

''అదే తెలీని విషయం. వాన్‌హెల్సింగ్‌కు మతి పోతోంది దీనిగురించి. నాకూ అంతుబట్టడంలేదు విషయం. ఈమధ్య లూసీని జాగ్రత్తగా కనిపెడుతూ వున్న సమయంలో జరిగిన సంఘటనలు మా అంచనాలను తారుమారు చేస్తున్నాయి. అయినా, ఇవన్నీ మళ్ళీ జరగడానికి వీలులేదు. మేమంతా ఇక్కడే వుంటాం, తాడోపేడో తేలేదాక.'' అన్నాను. క్విన్సీమోరిస్ నా చెయ్యి పుచ్చుకుని ''నన్నుకూడా మీతో కలుపుకో! నువ్వు, మీ డచ్ మనిషి నాకు ఏం చెయ్యాలో చెప్పండి, నేను చేస్తాను'' అన్నాడు.

లూసీ సాయంత్రం లేచింది. లేవగానే ఆమె చేసిన మొదటి పని ఏమిటంటే, తన గుండెల దగ్గరున్న వున్న కాగితాన్ని చూసుకోడం. ఆశ్చర్యం ఏమిటంటే, వాన్‌హెల్సింగ్ చదవమని నాకిచ్చిన కాగితం మళ్ళీ ఆమె గుండెలమీద ముందే వుంచేసాడు. లేకపోతే, ఆమె దానిగురించి కంగారు పడగలదని వూహించాడు. తర్వాత, ఆమె వాన్‌హెల్సింగ్‌ను నన్నూ చూసి వెలుగుతో నిండిన కళ్లతో సంతోషంగా చూసింది. ఆటు తర్వాత, గదిలో చుట్టూ చూసింది. తను ఎక్కడ వుందో గుర్తుకు తెచ్చుకుని, గట్టిగా ఏడ్చింది, పాలిపోయిన తన బక్క చేతులతో మొహాన్ని కప్పుకుని. ఆమె బాధ అర్థమయింది. తల్లి చావు గురించే అది. ఆమెను ఓదార్చడానికి ప్రయత్నించాం. మా ఓదార్పు మాటలు కాస్త పనిచేసాయి, అయినా ఆమె పూర్తిగా తేరుకో లేదు, మౌనంగా చాలాసేపు ఏడ్చింది. మేం ఇద్దరం గానీ, ఒక్కళ్ళుగానీ ఆమె దగ్గరే వుంటాం, భయం లేదని చెప్పాం. దానివల్ల ఆమె కొంత వూరట చెందింది. చీకటి పడేవేళకు ఆమె నిద్రలోకి వొరిగింది. ఇక్కడో వింత సంగతి జరిగింది. ఆమె నిద్రలోనే వుంటూ, తన గుండెలమీద వుంచుకున్న కాగితాన్ని రెండుగా చించేసింది. వాన్‌హెల్సింగ్ ఆమె దగ్గరగా వెళ్ళి, చిరిగిపోయిన కాగితాల ముక్కలను తీసుకున్నాడు. చేతిలో కాగితం లేకపోయినా, అది వున్నట్టుగానే, దాన్ని చించుతున్నట్టుగానే, ఆమె చేతులు కదులుతున్నాయి. చివరకు రెండు చేతులు పైకెత్తి, కాగితపు ముక్కలన్నీ విసిరేసినట్టుగా గుప్పిటలు విప్పింది. వాన్‌హెల్సింగ్ ఆశ్చర్యపోతూ కనిపించాడు. అతని కనుబొమలు ముడిపడ్డాయి, ఆలోచనకు సంకేతంగా. అతనేమీ మాట్లాడలేదు.

[ఇంకా వుంది]






# GOPI

## KITCHEN MACHINE



## ఇందువలన తతిమ్మా మిక్సిచర్లు గ్రైడర్లు 19 శతమానం పరికరాల్లా తయారయ్యాయంటే ముమ్మాటికి నిజం




### ఎన్ని సంవత్సరాలు గడచినా శ్రమరహితమైన సేవ నివ్వగలదు

**గోపీ** పరిపూర్ణ వనరులుగల ఏకైక వంట యంత్రం.
ఇందుకు కారణం నేరు లభించే యంత్రములందు
9 ప్రత్యేక జాడీలను జోడింపుగల ఆహార తయారీ
విధానమందు ఇదొక్కటే ఈ తెగకు చెందినది
అందువలన మీ కాఫీ వెల్లుల్లిపాయల వాసనరాదు
మీ ఇడ్లీలు కాఫీ వాసనవచ్చుటకు సాధ్యం లేదు
మీరు పదునైన బ్లేడుల కోసం వెతికే శ్రమ
ఇందువలన తప్పుతుంది
దిని కార్యక్షమతను నేరుగా ఉచితంగా చూచి పరీక్షించ
డానికి మీ సమీపంలోగల మా డీలర్లను అడగండి

- 60 నిమిషాల కాలం నిర్విరామంగా పనిచేస్తుంది
- 450 వాట్ శక్తిగల మోటార్
- రుబ్బుటకు, నూరుటకు 1.5 లీటర్ సామర్థ్యంగల పాత్రలు
- ఐ ఎస్ గుణ నియంత్రణ సంఖ్య 4250-1967కు అనుగుణంగా దృఢీకరించబడింది
- 9 జోడింపులు - ప్రతియొక్క తయారీకి ప్రత్యేకంగా ఒక్కొక్కటి

జీవితకాలమంతా ఉచిత సేవ ఒక సంవత్సరం గ్యారంటీ కాగా
జీవితకాలమంతయూ ఉచిత సేవ
ఆంధ్ర ప్రదేశ్ మరియు కర్నాటక రాజ్యములందు అన్ని
ప్రముఖ డీలర్లవద్ద లభించును.

**గోపీ**:- అన్న పేరు మేలిమి రకానికి ద్యోతకం
ఇది విశ్వమంతటా వ్యాపకం

దేశమంతటా వ్యాపించియున్న సేవా బృందం జీవిత కాలమంతయూ ఉచిత సేవ చేయగలదు

ట్రాన్స్ ఏషియన్ ఎక్స్‌పోజిషన్స్ 1982 వారిచే స్వర్ణ పతకం, బిసినెస్ లింక్స్ 1982 బెంగళూరు వారిచే ప్రథమ బహుమతిని పొందియున్నది
ఆంధ్ర ప్రదేశ్ మరియు కర్నాటక రాజ్యములందు అన్ని ప్రముఖ డీలర్లవద్ద లభించును.

ఆంధ్ర ప్రదేశ్‌కి ఏకైక పంపిణీదారులు:
**మౌర్య సేల్స్**
6-2-992/3 శహాబ్‌హౌస్ అపార్ట్‌మెంట్ ఎదుట
ఖైరతాబాద్ హైదరాబాద్ - 500 004



MS-083

మూడు
రకములుగా
ఉపయోగపడుతుంది.

# చంద్రిక
సబ్బు






జిడ్డు కారకుండ చర్మాన్ని
సౌందర్యవంతం చేస్తుంది.



జుట్టును శుభ్రపరచి
చుండ్రునుండి
పరిరక్షిస్తుంది.



చర్మాన్ని పొట్టు రాల కుండా
చేసి నల్ల మచ్చలు మరియు ఇతర
చర్మ వ్యాధుల నుండి కాపాడు
తుంది.

ఇతర ఏ సబ్బులందు లేని పై ఉపయోగాలు
కల్గిన సాటిలేని సబ్బు – చంద్రిక !
వర్ణ సౌందర్యానికి, ఆరోగ్యదాయకమైన
కేశసంపదకొరకు ఆయుర్వేద శాస్త్ర ప్రమాణాల
ననుసరించి ఎక్కువమొత్తంలో కొబ్బరి నూనె
నుపయోగించి తయారు చేయబడిన
సబ్బు – చంద్రిక సబ్బు.

# చంద్రిక

అన్ని ఋతువులలోను ఉపయోగించే సబ్బు
భారతదేశములో మరియు ప్రపంచవ్యాప్త
ముగా ప్రశస్తి గాంచినది.



హైదరాబాద్‌కు వెళ్తున్నమనే వుత్సాహమే తప్ప భర్త గురించి ఆమె పెద్దగా ఆలోచించడము లేదు. అయితే ఆమె రావుగారికి తగ్గ మంచి యిల్లాలు. కాకపోతే కొడుకు కుటుంబాన్ని చాల సంవత్సరాల తర్వాత చూస్తున్నాను అనే ఆనందమే తప్ప ఇంకేం ఆమెకు గుర్తుకు రాలేదు.

మజ్జిగతో లేచేశారు రావుగారు. వక్కపొడి అందిచ్చి మంచినీళ్ళు పక్క దగ్గర పెడూ, "రేపు వాళ్ళకు బట్టలు కొందాము" అంది.

"కొనుక్కుంటార్లే" అన్నారాయన.

"ఊహూను" అని తల వంకించిది పార్వతమ్మ.

మరసటి రోజు అందరికి చెప్పేసి వచ్చింది పార్వతమ్మ. ఇంకా ఎవరికైనా చెప్పలేదేమో అనుకొని అందరికీ పదే, పదే చెప్పేసి వస్తోంది.

మరసటి రోజు ప్రయాణము గుర్తొచ్చి ఆరోజు వీరసంగా గడిపారు విశ్వనాధరావుగారు.

*   *   *

రైలు ఆగింది. తల్లిదండ్రులను చూస్తూనే దగ్గరికి వచ్చాడు ఉదయ్. కొద్ది దూరములో పార్కు చేసిన మెరూన్ కలర్ ఇంపాలా దగ్గరికి నడచాడు. ఆవిడ ఆశ్చర్యంగా "కారెప్పుడు కొన్నావ్ ఉదయ్" అంది.

చిన్నగా మందహాసం చేసి "నేను కొనలేదమ్మ మా మావయ్య కొన్నారు" అన్నాడు.

అప్పటివరకు మౌనంగా వున్న విశ్వనాధ

# పెంకుటిల్లు

[10వ పేజీ తరువాయి]

రావుగారి మొహమ్మీద చిన్న దరహాసం తళుక్కున మెరిసి మాయమైపోయింది.

పార్వతమ్మ, ఉదయ్ ఏదేదో మాట్లాడుకుంటున్నారు. అప్పటివరకు వుదయ్ అడిగింది ఒకేఒక ప్రశ్న ఆయన్ను "బాగున్నావా నాన్న" అని.

దానికి జవాబుగా చిన్న దరహాసమే సమాధానము అయింది. వుదయ్‌కు తెలుసు నాన్న ఆ పాడు పెంకుటిల్లు గురించే ఆలోచిస్తుంటారని. అందుకే ఆతనేం పలకరించలేదు.

ఒక అధునాతనమైన పెద్ద మేడముందు ఆగింది కారు. పరుగున నౌకర్లు వచ్చి సామాను అందుకున్నారు. కుశలప్రశ్నలు మర్యాదలు అన్ని అయ్యాయి. మనవరాల్ని ఎత్తుకుని వచ్చింది పార్వతమ్మ "ఎలాగుందండీ పాప" అంది. "నీలాగే ఉంది" అన్నారాయన.

వుదయ్ వచ్చి తల్లి చేతిలోనుండి కూతుర్ని తీసుకుని హఠాత్తుగా ఇల్లు సరసమైన ధరకు దొరికితే తన మావయ్య కొనమని బలవంతం చేసి కొనిపించాడని చెప్తున్నాడు ఉదయ్. పార్వతమ్మ 'ఊ' కొడ్తోంది.

అదేసమయములో రావుగారికి తన యిల్లు ఎలాకట్టింది గుర్తుకు వచ్చింది. తండ్రిలాగే హైస్కూల్ వుపాధ్యాయులు రావుగారు. తాతయ్య ఇచ్చిన కొద్దిపాటి ఆస్తి మిగల్చక పోయినా అప్పులు మాత్రము మిగల్చి కాలధర్మము చెందారు వేణుగోపాలరావుగారు. ప్రయాసపడి తనది అంటూ ఓ యిల్లు ఎంత చిన్నదైనాసరే కట్టుకోవాలి అనే కోరిక బలపడింది రావుగారికి. అనుకున్నట్టే ఓ చిన్న పెంకుటిల్లు కట్టుకోగల్గారు. దాని చుట్టూ కొద్దిపాటి స్థలంలో ఇల్లు కట్టేటపుడే పూలమొక్కలు పెట్టారు. ఐదేళ్ళ వుదయ్‌తో భార్య పార్వతమ్మతోపాటు గృహప్రవేశము చేస్తుంటే ఆయనకు ఒక మహారాజు తన కష్టార్జితముతో ఓ కోట కట్టి బంధు, మిత్రులతో ప్రవేశము చేస్తున్నట్టు అనిపించింది. తన సాటి ఉపాధ్యాయులంతా తనన్నో రాజును చూసినట్టే చూసారు. ఆ పెంకుటిల్లే తన ఏకైక కొడుకు వుదయ్ చదువుకు ఎంతగానో సహాయపడింది. ఆ విషయము ఎవరు మరచిపోయినా తను మరచిపోగలడా? తన టీచర్ ఉద్యోగముతో ఇంజనీర్ కావాలనే వుదయ్ కోరిక తీర్చేదేనా? అందుకే ఆ యిల్లంటే అతనికి ఎంతో ప్రేమ. తల్లి బిడ్డ లాంటి సంబంధము అది. చంటి పిల్లాణ్ణి తల్లి దగ్గర నుండి వేరు చేస్తే ఎలా వుంటుందో అలాగే ఆ అనుబంధము కూడ.

హైదరాబాద్ లోని చూడదగ్గ స్థలాలన్నీ వుద్యోగానికి సెలవు పెట్టి మరీ చూపిస్తున్నాడు ఉదయ్. ఎక్కడైన చిన్న పెంకు

'పిల్లు కనబడితే అక్కడే ఆగిపోయేది ఆయన దృష్టి. ఆ తర్వాత అతనేం చూసిన ఆ పెంకుటిల్లు తప్ప ఇంకేమి గుర్తుకు వచ్చేది కాదు. నాలుగు రోజులు గడిచాయి. ఈ నాల్రోజులు పార్వతమ్మకు నాలుగు క్షణాల్లాగ గడిచితే, రావుగారికి మాత్రం నాలుగు యుగాలే!

ఆ రోజు తండ్రి గదిలోకి వచ్చేసరికి ఆందోళనగా తండ్రి మంచందగ్గర కూర్చొని వుంది పార్వతమ్మ.

"ఏమ్మా! ఏమయింది నాన్నగారికి?" అన్నాడు స్టూల్ లాక్కుని కూర్చొని తండ్రి నుదిటి మీద చెయ్యేసి ఉదయ్ కంగారుగా. ఒళ్ళు వేడిగా వుంది.

"నిన్న బాగానే వున్నారు. జ్వరం వచ్చినట్టుంది" అంది ఆవిడ కళ్ళు వొత్తుకుని.

"మరేం ఫరవాలేదు, డాక్టర్‌గారికి ఫోన్ చేస్తాను" అని హాల్లోకెళ్ళాడు ఉదయ్. ఫోన్ చేసి వచ్చేసరికి ఒకటే పలవరిస్తున్నాడు రావుగారు. "ఒరేయ్, ఉదయ్ నేను వూరెళ్ళిపోతాను నంపవూ" అని. అప్పుడే వచ్చిన డాక్టరు టెస్ట్ చేసి "డోంట్‌వర్రీ మిస్టర్ ఉదయ్‌కుమార్! ఆయనకు వూరెళ్ళాలనే బెంగతో ఫీవర్ వచ్చింది అంతే; మరేం ఫర్వాలేదు హీ ఈజ్ ఆల్‌రైట్" అంటూ ఇంజెక్షన్ చేసి వెళ్ళిపోయాడు.

తల్లితో "ఏమిటీ ఈయన రాన్రాను చిన్న పిల్లాడైపోతున్నారు. ఇక్కడేం తక్కువ. హాయిగా వుండక ఆ పెంకు కొంప మీద ఇంత పిచ్చి పేను'' అంటూ కోపంగా వెళ్ళిపోయాడు. ఆమె అయోమయంగా నిలబడిపోయింది.

మరి రెండ్రోజులు కాలగర్భంలో కలిశాయి. ఆ రోజు పూర్తిగా జ్వరం నెమ్మదించింది రావుగారికి. ఆఫీసు కెళ్తున్న వుదయ్ దగ్గర కెళ్ళి, "ఊరికిపోవాలి ప్రయాణమవ్వాలి" అన్నారు.

ఆ మాట వింటూనే కోపంతో మొహమంతా ఎర్రబడింది ఉదయ్‌కు. విసుగ్గా మొహము చిట్లించి "మీ ఆరోగ్యము బావుండలేదు. వెళ్ళాల్లేండి తొందరేమిటి? ఆ వెధవ పెంకు కొంపను ఎవరైనా ఎత్తుకుపోతారా?" అన్నాడు.

ఆ మాట వింటూనే కోపంతో ఊగిపోయారు రావుగారు.

ఆయన కంఠము వణికింది. కోపంతో ఆపాదమస్తకము ఊగిపోతున్నారు. ఉదయ్ ప్రేమించి పెళ్ళి చేసుకుని వచ్చి ఆశీర్వదించమని అడిగినపుడు 'అయ్యో! ఒక్కగానొక్క కొడుకు పెళ్ళి చేతులతో చేయక పోయానే' అని బాధ పడ్డా కాని, పల్లెత్తి ఓ మాట అనలేదు. మౌనంగా ఆశీర్వదించారు. అలాంటి రావుగారికి కోపం చెలియలి కట్ట దాటింది.

"ఒరేయ్ మావయ్య సలహా మీద ఇల్లు కొన్నావే కాని నాలాగ నీవు దగ్గరుండి ఇల్లు కట్టి ఉంటే తెలిసేదా విలువ నీకు. నీవే టీచర్ ఉద్యోగము చేస్తూ పైసా, పైసా కూడా బెట్టి కట్టుకుని ఉంటే ఆ పెంకుటిల్లు విలువ తెలిసేది. నీలాంటి మూర్ఖుడితో వాదించలేను. ఇంకనేనో నిమిషముకూడా వుండను" అన్నారు పిడుగు పడ్డట్టు.

అప్రతిభుడే అయ్యాడు ఉదయ్. తప్పకుండా తండ్రికి మూర్ఖత్వం ఎక్కువ అనుకున్నాడు, పెద్ద పెద్ద అంగ లేసుకుని వెళ్ళిపోతున్న తండ్రి కేసి చూస్తూ. ఈ విధంగానే తప్ప తండ్రి మనసు గురించి ఓ క్షణం ఆలోచిస్తే అది మూర్ఖత్వము కాదు మమత అన్న సత్యం తెలుస్తుంది.

అతని ఆలోచనా పరిధి అంతే! అది కాక ఈ వయసులో తల్లిని సుఖపడనీయుటము లేదీయన అనే భావన తండ్రి మీద గొంతు వరకు కోపాన్ని తెచ్చింది ఉదయ్‌కి.

అర్థరాత్రికి అలసటగా ఇల్లు చేరాడు ఉదయ్. ఆదుర్దాగా ఎదురుచూస్తున్న భార్యకేసి చూసి "ఏమిటోయ్?" అన్నాడు.

ఆమె ఏమిజవాబివ్వక బయట చూస్తూనే వుంది.

"ఏమిటలా చూస్తున్నావు" అన్నాడు విసుగ్గా. అతనికి చాల అలసటగా వుంది. భార్య తనను పట్టించుకోక పోవడము అతనికి కోపాన్ని తెచ్చి పెట్టింది. ప్రొద్దున్న తండ్రితో జరిగిన ఘర్షణతో ఈ రోజు మరీ చిరాగ్గ వున్నాడు.

"బాబు కాన్వెంట్ నుండి ఇంకా రాలేదు అదే చూస్తున్నాను" అంది. "రాక ఎక్కడికి పోతాడు, ఏదైనా ఫంక్షన్ వుందేమో! కాస్త ఫాన్ ఆన్‌చేసి కాఫీ పట్రా" అన్నాడు.

అయిష్టంగా అక్కడి నుండి కదిలింది ఆమె.

ఐదు నిమిషాల తర్వాత కాఫీతో వచ్చింది. కళ్ళపై చేతులుంచుకుని సోఫాలో జారి కూర్చున్నాడు ఉదయ్.

మామూలుగా అయితే చిరునవ్వుతో అతని కోటు అందుకుని కాఫీ అందిచ్చేది శ్యామల. ఈ రోజు కొడుకు రానందుకు భర్త వైపు కూడా చూడటము లేదు.



# పెంకుటిల్లు

ఆమె అడుగుల శబ్దానికి కళ్లపై చేయి తీసి కాఫీ అందుకుని సిప్ చేస్తున్నాడు. మళ్ళీ శ్యామల యధాస్థానంలో కెళ్ళినించుంది.

కాఫీతాగి చేతివంక చూసుకుని "ఇంకా రాలేదా" అన్నాడు లేచి నించొని.

"నాకు భయంగా ఉందండి ఇంకారాలేదు. ఎపుడు ఇంత లేట్ కాలేదు ఏఫంక్షన్ వున్నట్టు నాకు చెప్పలేదు" అంది. దాదాపు ఏడుపు గొంతుకతో.

అతని అలసట ఒక్కసారిగా దిగిపోయింది. ఎదుర్గాగా బైటికెళ్ళాడు రిక్షా కనబడింది. పరుగెత్తికెళ్ళాడు మోచేతులు, కాళ్ళకు చిన్న కట్లుతో, తలకో కట్టుతో రిక్షా నడుపు కొని వస్తున్నాడు సింహాచెలం.

అతణ్ణి చూస్తూనే రిక్షా ఆపాడు సింహాచెలం. కొడుకును చూస్తూనే ప్రాణం లేచొచ్చి నట్టయింది ఉదయ్‌కు ఎత్తుకుని ముద్దు పెట్టుకుని అలాగే ఓ నిమిషము వుండిపోయాడు తర్వాత సింహాచెలం వైపు తిరిగాడు

అతనేమి మాటాడక ముందే సింహాచెలం అందున్నాడు. "బాబుగోరు మామూలుగానే నడుస్తున్నానండీ. సె కానికిరాయి పిళ తగిలిందండి ముందు కూసున్న సినబాబుగోరు ఎగిరి కిందపడా రండి జోరుగా బస్సొస్తోంది, నాను బయపడి రిక్షా మీంచి దూకి బాబుగార్ని తోసాను. బస్సు నాకు రాసుకొనెళ్ళింది ఇగో దెబ్బలు తగిలాయి అందుకే లేటయిపోనాది" అన్నాడు.

ఆ క్షణములో అతను రిక్షావాడిలాగ కనబళ్ళేదు.సాక్షాత్తు భగవంతుడే అనిపించాడు ఉదయ్‌కు. జేబులో చేయిపెట్టి అందిన నోటును సింహాచెలం చేతిలో పెట్టి "డాక్టర్ దగ్గరకెళ్ళి కట్టుకట్టించుకో" అన్నాడు.

"వద్దండి" అన్నాడు 'అంత పెద్ద మొత్తాన్ని చూసిన సింహాచెలం వెనక్కిజరిగి.

"చూడు సింహాచెలం నాబిడ్డను కాపాడావు నీ ప్రాణాలకు తెగించావు ఏదో అదృష్టము కొద్ది బస్సు రాచుకుని వెళ్ళింది: అదే నీ పైవా వెళ్ళితే" — అన్నాడు కృతజ్ఞతతో ఉదయ్.

"నాదేముందండి బగవంతుడి దయ" అన్నాడు భక్తిగా ఆకాశము కేసి చూసి చేతులు జోడించి సింహాచెలం.

అతని నిజాయితికి ముగ్దుడయి అతడు డబ్బు తీసుకునేవరకు వదల్లేదు వుదయ్.

## గమనిక

పాఠకులు పడ్డ వంటలే పడితే "ఎప్పుడూ అవే" వంటలా? అంటారు కనుక 'వంటలు' పంపే వారు ఓసారి పాత సంచికలు తిరగేసి అందులో లేనివి వ్రాసి పంపమని—సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాయమని మనవి.

సం.






బులుసు వేంకటరమణయ్య

## వైకుంఠపాళి

ముక్కోటి ఏకాదశి – లేక వైకుంఠ ఏకాదశి అత్యంత పుణ్యప్రదమైన దినం. నాడు మృతులైనవారు తప్పక భగవత్సాయుజ్యాన్ని పొందుతారని ఆస్తికుల అభిభాషణ. నాడు వైకుంఠ నగరద్వారా లన్నీ తెరువబడుతాయనీ, అందరూ స్వేచ్ఛగా లోపలికిపోయి శ్రీమన్నారాయణుని దర్శించవచ్చుననీ అంటారు. నాటిరాత్రి భగవత్సం కీర్తనచేస్తూ జాగరం చేసే కోటిపుణ్యాల ఫలితం ఉంటుందట. భజనచేయడానికి శక్తి లేనివారు ఏదోవిధంగా రాత్రి పూర్తిగా నిద్ర మేలుకొని ఉంటారు. చీట్లాట మొదలైనవి ప్రారంభిస్తే నిద్ర రమ్మన్నారాదు అది దూరంగా పోతుంది. పందెం ఒడ్డి ఆడితే ఆట మరీ పసందుగా ఉంటుంది. కాని పవిత్రమైన ఆ దినం రాత్రి జాగరణకోసం – పుణ్యం సంపాదించడానికోసం చీట్లాడడం సమంజసమైన పద్ధతి కాదు. పరమపదసోపాన పటం పెట్టుకొని గవ్వలతోగాని, పాచికలతోగాని ఆడడం మేలైన పద్ధతి. అదే వైకుంఠపాళీ ఆట. ఆ ఆటను నాడు మాత్రమే ఆడడం పరిపాటి. అందులోని గడులలో కొన్నింట చిన్నపాములు, కొన్నింట పెద్ద పాములూ చిత్రించబడి ఉంటాయి. కొన్నింట చిన్న నిచ్చెనలు, కొన్నింట పెద్ద నిచ్చెనలు వుంటాయి ఒక మిక్కిలి పెద్ద పాము, అన్నింటికంటె పెద నిచ్చెన ఒకటి వుంటుంది. పాము నోట్లో పాచిక పడితే క్రిందికి తోక చివరకు దిగవలసిందే! నిచ్చెన మొదట పాచిక పడితే మీదికి ఎక్కవలసిందే!

ఈ విధంగా మీదికి ఎక్కుతూ, కిందికి దిగుతూ – చివరికి వీటి నన్నింటినీ తప్పించుకుని పైకి వెళ్ళినా – అంటే వైకుంఠ నగర ద్వారాన్ని చేరుకున్నా, అనుమతి లేకుండా లోపల ప్రవేశించడానికి వీలులేదు. అక్కడ కొంతకాలం నిరీక్షించవలసి వుంటుంది.

దీనివల్ల మనం గ్రహించవలసిన ప్రధానాంశం ఒకటి ఉన్నది. జీవితంలో ఎన్నో మంచి పనులు చేసినా, చెడ్డపనులూ చేస్తూ వుంటాము సుఖాలతోపాటు కష్టాలూ అనుభవిస్తాము. ఒకప్పుడు మంచి స్థితికి వచ్చినా, మరొకప్పుడు కిందికి దిగిపోతాము. వాటినన్నిటినీ తట్టుకోవాలి. అన్నింటినీ సహించిన తర్వాతగాని మనకు కష్ట సుఖాలను సమదృష్టితో చూచే పరిస్థితి ఏర్పడదు ఆ పరిస్థితికి వస్తేనేగాని తత్వం తెలియదు. అప్పుడుగాని, ముక్తికి అవకాశం వుండదు వైకుంఠానికి వెళ్ళడమంటే ముక్తిని పొందడమనే అభిప్రాయం. దానికి జీవితంలో ఎన్నో శ్రమ దమాదులు పడాలి. కష్టసుఖాలు అనుభవించాలి పాపాలకు తగిన ఫలం, పుణ్యాలకు తగిన ప్రతిఫలం స్వీకరించి తీరాలి. వైకుంఠపాళి ఆటలోని అంతరార్థ మిదే అని గ్రహించవలసి ఉంటుంది.

---

ఇంటికి వస్తూనే దాదాపు ఏడుపు మొహంతో దర్శన మిచ్చింది శ్యామల. అలాగే పార్వతమ్మ, విశ్వనాధరావు కూడ.

వుదయ్‌ను చూస్తూనే అందరూ పరుగెత్తుకు వచ్చారు. శ్యామల బాబును అందుకుని ముద్దు పెట్టుకుని ఐదునిమిషాల తర్వాత తేరుకుంది. ఆమె కళ్ళ నుండి జల, జల అశ్రు బిందువులు రాలిపడుతున్నాయి. ఆమెకేసే చూస్తున్న వుదయ్‌కు తండ్రితో ఉదయము జరిగిన ఘర్షణ గుర్తుకు వచ్చి తండ్రికేసి చూశాడు.

ఆయన మనవణ్ణి అందుకుని ముద్దు పెట్టుకుంటున్నాడు. పార్వతమ్మ అడిగింది "అసలేవయిందిరా ఉదయ్"

జరిగింది వివరంగా చెప్పాడు ఉదయ్. అందరూ నిర్ఘాంతపోయి విన్నారు.

పార్వతమ్మ "సింహాచెలం మనిషి కాదురా దేవుడు" అంది. అదే భావం అందరి కళ్ళలో కనబడుతోంది.

అప్పుడు ఉదయ్ ఆలోచిస్తున్నది ఆ విషయము గురించి కాదు, తండ్రి గురించే. ఇప్పుడు తండ్రికి పెంకుటింటి పైగల మమతకు అర్థము తెలిసింది. అది మూర్ఖపు పట్టుదల అనుకున్నాడే కాని మాటలకందని భావము అని తెలిసింది.

గంట తర్వాత బయటకెళి వచ్చాడు ఉదయ్. తల్లి, తండ్రి గదిలోకెళ్ళి "నాన్నగారు" అన్నాడు.

మనవణ్ణి కూర్చోపెట్టుకుని చదివిస్తున్న రావుగారు, "ఏమిటి" అన్నారు తలెత్తి చూసి.

"టికెట్స్ రిజర్వ్ చేయించాను" అన్నాడు.

అది వింటూనే ఆయన మొహం ఆనందంతో కళ, కళ లాడింది. అది చూసిన ఉదయ్ మరేమి మాట్లాడక కొడుకుని తీస్కొని వచ్చేశాడు.

మరపటి రోజు ట్రయినెక్కిన తండ్రి వైపే చూస్తున్నాడు ఉదయ్. ఆయన చూపులు ఎక్కడో ఉన్నాయి ఇప్పుడు ఉదయ్ మొహంలో ఏ విచారము లేదు. తండ్రిని, అతని తృప్తిని చూస్తూ ఆనందముగా నిలబడిపోయేడు. ట్రెయిన్ బైల్దేరింది కాని అంతకన్న ముందే పెంకుటింటో ఆనందంగా తిరుగుతున్నారు మానసికంగా విశ్వనాధరావుగారు.

# ఫాలాక్షుని డైరీ



## చేతిలో సర్ప రేఖలు !

తణుకు తాలూకా కంకిపాడు గ్రామానికి చెందిన పోతుల సుబ్బన్న అనే హరిజనుడి హస్తం చూస్తే ఎంత పెద్ద విష సర్పమైనా భయంతో గడగడలాడి లొంగిపోతుందట. పుట్టి చేతులతో ఆతను పాముని సునాయాసంగా పట్టి, చంపేయగలడుట. ఇప్పుడు 61 ఏళ్ళున్న యితడు తన 14 వ ఏట నుంచే యీ పని ప్రారంభించాడుట. ఈ వింత చర్యకు కారణం అతని చేతుల్లోని సర్పరేఖలేనట. సర్పరేఖలు కొన్నివేల మందిలో ఒకరికైనా వుండవట. ఇంత అపూర్వమైన సర్పరేఖలున్నా ఆసుబ్బన్న కటిక దరిద్రం యిన్నేళ్ళుగా అనుభవిస్తూనే వున్నాడట.

### తమిళనాడులో ఐ.ఎ.ఎస్.ల పట్ల చిన్నచూపు!

తమిళనాడు ప్రభుత్వ పాలనలో ఐ. ఏ. ఎస్. ఆఫీసర్లు బాండెడ్ లేబర్ కన్నా అన్యాయమనీ, వారు చేతగానివారుగా వుంటే తప్ప పదవులు నిలవవనీ, ప్రభుత్వం,అనగా మంత్రులుఅన్నిటాజోక్యం కలుగజేసుకడంతో, ముఖ్యమంత్రి యం.జి. ఆర్. యీ ఆఫీసర్లమీద చూపే చిన్న చూపుతో వేగడం కష్టంగా వున్నదనీ మిస్టర్ డి. గంగప్ప అనే సీనియర్ ఐ. ఏ. ఎస్. ఆఫీసరు తాను రాజీనామా యిచ్చి మరీ యీ ముక్క లన్నాడట. 1977 నుంచి రాజీనామా యిచ్చిన ఐ. ఏ. ఎస్. అధికారులలో యీయన తొమ్మిదో వ్యక్తట.

## పాలిచ్చే మగ పావురాలు !

పక్షి జాతిలో పావురాలు తమ పిల్లలకు పాలిచ్చి పెంచుతాయుట. పావురాలలో మగ పావురాలకూ పాలు వస్తాయుట. ఎటొచ్చీ అవి స్తన్యమివ్వవట. పాలు వాటికి నోటిలోంచి వూరుతాయనీ, ఆ పాలను తమ నోట్లోంచి పిల్లల నోట్లోకి తల్లి, తండ్రి పావురాలు వొదులుతాయనీ, యీ పాలలో గింజలు నోట్లో నానేసి, అవి తమ పిల్లల కిస్తాయని కూడా విజ్ఞానం బయట పెట్టింది.

### భార్య ప్రాణం తీసిన భర్త జ్వరం !

గుంటూరు అరండల్ పేటలో 60 ఏళ్ళ వృద్ధుడయి నొకాయనకు జ్వరం వచ్చేసరికి తన భార్యను పిలిచి, తన పని అయిపోయిందని, వూరు పొమ్మని, కాడు రమ్మంటోందనీ తెలియ జెప్పాడట. దాని కాయన భార్య తాను పతివియోగాన్ని భరించననీ, వైధవ్యం అసలే భరించే ప్రసక్తి లేదనీ చెప్పి ఆరాత్రి నూతిలో దూకి ఆత్మ హత్య చేసుకున్నదట. ఇంతకీ ఆమె భర్త తేరుకుని, ఆరోగ్యవంతుడయ్యాడట.

### ప్రాణాలు తీసిన కడుపు నొప్పి !

ధర్మవరం గ్రామానికి చెందిన 22 ఏళ్ళ మేరీ అనే ఒకామె కడుపునొప్పి భరించలేక ఏ వైద్యము, ఏ మందూ, ఏ మంత్రమూ పనిచేయుక, యిహ మార్గాంతరంలేక, జీవితాన్నినెట్టలేక ఆత్మ హత్య చేసుకున్నదట మొన్న 22 వ తేదీన. ఏం సైన్సో ఏంపాడో !

### భగ్గుమన్న భగ్న ప్రేమ !

ఈరోడ్డు పెద్ద పోస్టాఫీసులో పని చేస్తున్న 28 ఏళ్ళ జ్ఞానమణి అదే ఆఫీసులో స్టెనోగా పని చేస్తున్న 25ఏళ్ళ నాగేశ్వరి అనేఆమెను తలమునకలుగా ప్రేమించి ఆమె లేనిదే తనజీవితమే లేదనే సుస్థిర నిశ్చయానికి వచ్చేసి, ఆమె కా విషయం చెప్పేసరికి ఏబ్బావ్ పోవోయ్ చవలాయా అన్నదట. దాంతో అతని హృదయం భగ్నమై భగ్గుమని పగిలిందట. కోపావేశాలతో బాత్‌రూముకు వెళ్ళిన ఆమెను అక్కడే ఆ ఆపీసు బాత్‌రూములోనే పొడిచి చంపేసి, తన జేబులో రెడీగా వున్న విషం తాను నోట్లో వేసేసుకుని, నింపాదిగా ఆసుపత్రిలో చనిపోయాడట.

### వరుడు నచ్చక ఆత్మాహుతి !

తంజావూరులోని బర్మా కాలనీలో వుంటున్న 20 ఏళ్ళ ముత్తుమణికి ఫెర్టిలైజర్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియాలో వో చక్కని వుద్యోగం వచ్చిందట. దాంతో ఆమె తల్లిదండ్రులు లావెక్కో చక్కని సంబంధం చూసి ఫిబ్రవరి 2 వ తేదీన ముహూర్తం పెట్టే, తనకా వరుడు నచ్చలేదని చెప్పిందటామె. దాని కామె తల్లిదండ్రులు టట్ అన్నారట. దాంతో ఆమె పడగ్గదిలో వురేసుకుని 28 (జనవరి) న చనిపోయిందట.

### జయలలిత రాజకీయ రంగ ప్రవేశం !

అలనాటి నటి జయలలిత వెండి తెరను వదలి కొన్నాళ్ళు తెరమరుగై టకాల్న తమిళనాడు రాజకీయాలలో అన్నా డి. యం. కె. లో ప్రవేశించి, వెంటనే యం. జి. ఆర్. కు కుడిభుజమై, యీమె యే భావి ముఖ్యమంత్రిణి అని జనం చెవులు కొరుక్కునేలా అయిపోయారు. ఈమె పేదపిల్లల మధ్యాహ్న భోజన విభాగాలకు, కార్యకలాపాలకు కొన్నాళ్ళు హైలెవెల్ కమిటీ మెంబరుగా పనిచేసి, యిప్పుడు పార్టీ ప్రాపగాండా సెక్రటరీ పదవి చేపట్టారట — జనవాక్యం కర్తవ్యం. *

---

టూరా ? పెట్టుకోరు. సాయుధ సంరక్షణ కావలిసిన మతం మతమేనా ?

బ్రిటన్ ఒక క్రయిస్తవ దేశం. జపాన్ ఒక బౌద్ధదేశం. అలాగే భారతదేశం ఒక హిందూదేశం. లండన్ దగ్గర వోకింగ్ అనే ఊరుంది. అక్కడ ఒక మసీదు వుంది. స్థానిక మహమ్మదీయులు అక్కడి క్రయిస్తవుల కట్టడాల మీద దాడి జరిపితే ఏమవుతుంది; అక్కడ కొందరు (క్రయిస్తవ గీతాలు) పాడటం పనికిరాదంటూ ? బ్రిటన్‌లో క్రయిస్తవులుకానివాళ్లువుంటారు.

## న్యూఢిల్లీ లేఖ

(7వ పేజీ తరువాయి)

అలాగే జపాన్‌లో బౌద్ధులు కానివాళ్ళు ఉంటారు. భారతదేశంలో హిందువులు కాని వాళ్ళూ వుండవచ్చు. అయితే, హిందువుల వ్యతిరేకులు వుంటే ఎలాగ ? కళ్యాణ్ అనే వూరిలో కొందరు శివాజీ విగ్రహాన్ని వూరేగిస్తే మహమ్మదీయులు తమ అభ్యంతరాన్ని తెలిపారు. జపాన్‌లో బౌద్ధుల వూరేగింపుని ఎవరయినా వద్దంటారా ? శివాజీ భారతీయుడు కాడా ? భారతదేశంలో ఒక భారతీయుడి గౌరవార్థం వూరేగింపు పనికిరాదనే వాళ్లని ఏమనాలి ? వాళ్ళు నిజమయిన భారతీయులా ?

"జె. ఆర్. డి." తాను భారతీయుడనని చెప్పుకోవటానికి గర్వపడుతున్నానన్నాడు. అదే విధంగా భారతదేశంలోని మహమ్మదీయులు తాము భారతీయులమని సగర్వంగాచెప్పుకోవాలి. అలాగ చెప్పుకోలేకపోతే వారి భారతీయతని శంకించవలసి వస్తుంది.

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**ఆంగ్లంలో మృచ్ఛకటికం :**

ప్రాచీన సంస్కృత నాటకాలు సహస్రాబ్దాలు గడచినా, సమాజాన్ని తీర్చి దిద్దడానికి ఎలా ఉపయోగపడుతున్నాయో జనవరి 23, 24 తేదీలలో 'డ్రమటిక్ సర్కిల్ హైదరాబాద్' సంస్థ ప్రదర్శించిన 'లిటిల్ క్లేకార్ట్' మృచ్ఛ కటికం ఆంగ్ల నాటకం మరొకసారి నిరూపించింది. ఆమధ్య మిత్రులు శ్రీ ఎ. ఆర్. కృష్ణ ప్రదర్శించిన అభిజ్ఞాన శాకుంతలం ప్రస్తుత సమాజానికి ఎంత కనువిప్పు కలిగించిందో ఆయనే సూత్రధారుని ద్వారా వివరించారు. (మృచ్ఛకటిక) నాటకం ఉత్తమోత్తమ ప్రపంచ నాటకాల్లో ఒకటి, దేశ కాలాలకు అతీతంగా సమాజంలోని అవినీతిని దుయ్యబట్టేదిని. దీనిని మిత్రులు, ఉస్మానియా విశ్వ విద్యాలయం రంగస్థల శాస్త్ర శాఖాధ్యక్షులు ఆచార్య డాక్టర్ మొదలి నాగభూషణ శర్మ వివిధాంగ్లానువాదాలను సంప్రతించి, ముఖ్యంగా శ్రీయుతులు పి. లాల్, బ్యాటెలిన్, రైడర్ల అనువాదాలను మేళవించి నాటకీయత మరింతగా వుండేట్టు సంస్కరించుకొని డ్రమటిక్ సర్కిల్ హైదరాబాద్ పక్షాన దర్శకులుగా ప్రదర్శించారు. డాక్టర్ శర్మ అలనాటి రంగస్థలం, పాత్రలఆహార్యం మున్నగువాటికోసం విశేష పరిశోధనలు జరిపి వాటిని తీర్చిదిద్దారు. భరతుడు మూడు విధాల రంగస్థలాలను నిర్వచించాడు. త్రికోణ, చతురస్ర, విక్రస్త మధ్యమ— అని. మూడవ దాని మధ్య రంగశీర్షమని ఒక ఎత్తైన వేదిక, దాని కిరుప్రక్కలా మత్త వారణాలనే రంగశీర్షానికి కొంచెంతక్కువఎత్తున్నవేదికలువుంటాయి. డాక్టర్ శర్మ మూడవ దానిని కొంత సవరణలతో వాడుకొన్నారు. మృచ్ఛకటికం గుప్త చక్రవర్తుల కాలం నాటిదికదా. కనుక మూడు నాలుగు శతాబ్దాల శిల్పచిత్రాలను, పల్నాడులోని పోలిగ్రామ దేవాలయం మొదలు అజంతా స్తూపం వరకు విభిన్న వేషభాషలను, విదేశ యాత్రికులు ఆనాటి మన వేషధారణ గురించి చెప్పిన వివరాలను కూలంకషంగా పరిశీలించి ఈ నాటక పాత్రలను తీర్చారు. అప్పటి నటనను అనుకరించడానికి ప్రయత్నించారు—ఎలా నిలబడాలి ఎలాలేవాలి, మైమ్ మొదలయి. సంగీతానికి మయూర వీణను, వేణువును, మృదంగాన్ని వాడారు. రాగాలలో మొదట హంస ధ్వని, అమృత వర్షిణి, పోరాటం వంటి ఉద్రిక్త సన్నివేశాలకు ఖరహరప్రియను వాడారు. రంగుల విషయంలోను డాక్టర్ శర్మ శ్రద్ధ వహించారు. నాటకీయ సంకేతాలలోను అలాగే వసంత సేనా చారుదత్తుల స్థైర్యాన్ని చూపడానికి వారి గృహ బాహ్య పరిసరాలకు నీలిమను, వారి మన శ్శుద్ధిని చూపడానికి అభ్యంతర భాగాలకు శ్వేతిమను, న్యాయ స్థానాల నీతి బాహ్యతకు పతనావస్థకు సూచకంగా ధూసరం వాడారు. చారుదత్తుని ఇంటి ముంగిట మోడువారిన చెట్టు క్రమంగా పూచటం గొప్ప ప్రతీక. వేయేల? నాటక ప్రదర్శనం ప్రతివిషయంలోను డాక్టర్ శర్మ దర్శకనైపుణి ఉట్టిపడింది. ఇక పాత్రలు కొమ్ములు తిరిగిన నటులను మరపించారు. (నేను నాలుగు దశాబ్దాల క్రితం రాజా శాండో శకారుడుగా నటించిన వసంత సేనను చూచాను.) చారుదత్తుడుగా సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీషు లెక్చరర్ శ్రీ జి. రాజగోపాల్ చారుదత్తునిలోని క్రమపరిణామాన్ని గొప్పగా చూపారు. వసంతసేనగా సెయింట్ ఫ్రాన్సిస్ కాలేజీ విద్యార్థిని నందినీ బేడి వసంతసేనను తలపించారు. శకారుడుగా ప్రియా ఫుడ్స్ మార్కెటింగ్ మేనేజర్ శ్రీ శంకర్ మేల్‌కోటే రాజా శాండోను మరపించారు. మైత్రేయుడుగా నటించిన వర్తక ప్రముఖుడు శ్రీ జషీర్ బాబ్ ఖాన్ బ్రాహ్మణాచార వ్యవహారాలను కుప్పగాపోశారు. చాల గొప్పగా నటించారు. బవుద్ధ భిక్షువుగా డాక్టర్ రామకుమార్, ఆర్యకుడుగా ఇంజనీర్ శ్రీ ప్రదీప్ సిన్హా, స్థావరకుడుగా ఇంజనీరు శ్రీ ప్రణవ్ పింగల్, సూత్రధారుడుగా శ్రీ బి. ఎస్ ప్రకాశ్, (శ్రీ బుర్రా సుబ్రహ్మణ్యం కుమారుడు) ప్రేక్షక రంజకంగా నటించారు. ఈ సంస్థ డాక్టర్ శర్మ దర్శకత్వంలో ఇంతవరకు 64 నాటకాలు ప్రదర్శించింది. ఏటా ఒక భారతీయాదినాటక ఆంగ్లానువాదం ప్రదర్శిస్తుంది. హయవదన, తుగ్లక్, మున్నగు భారతీయ నాటకాల అనువాదం ప్రదర్శించింది. ఈ నాటకసంస్థ కృషిని, డాక్టర్ నాగభూషణ శర్మ దర్శక నైపుణిని, నటుల నటన పరిపాకాన్ని ప్రశంసిస్తున్నాను.

**వసంతసేనను చంపడానికి ప్రయత్నిస్తున్న శకారుడు – శ్రీ శంకర్ మేల్కోట్,**

**వసంత సేన కుమారి నందిని బేడీ**



# హైదరాబాద్ నోట్ బుక్

**మేధావుల శాంతి యాత్ర :**

మత కల్లోలాలకు నిరసనగా దాదాపు 20( మంది మేధావులు, కవులు, రచయితలు, సాహిత్య వేత్తలు, విద్యార్థులు, సంఘ సేవకులు జనవరి 26న హైదరాబాద్ పాత బస్తీలో శాంతియాత్ర జరిపారు. ఈ యాత్ర చార్మినార్ నుంచి ప్రారంభమై షాలీబండా, మీర్ చౌక్, మీర్ జుమ్లా, అలీజా కోట్లా, యాకుత్‌పురాలలో జరిగింది. పిదప ధర్మవంత్ కాలేజీలో సమావేశంగా పరిణమించింది. శ్రీ కాళోజీ నారాయణరావు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు చుండి జగన్నాథం, వెంకటసుబ్బమ్మ, డాక్టర్ వీణ, జీలానీబానో, అస్వర్ మొలజ్జ, సురవరపు, డాక్టర్ బల్వంత్‌రెడ్డి, కేశవరావ్ జాదవ్ ప్రసంగించారు. యాత్రలో ప్రముఖకవి శ్రీకాళోజీ నారాయణరావు, సర్వోదయ నాయకుడు శ్రీమగన్ చంద్‌వేదీ, చుండిజగన్నాథంమున్నగువారు, ఉరుదు, తెలుగు కవులు, కళాకారులు పాల్గొన్నారు. మత కల్లోలాలపై విచారణజరుపాలని నినాదాలు చేశారు. నినాదాలున్న అట్టలను, బ్యానర్లను పట్టుకొన్నారు. పాతబస్తీని అభివృద్ధి చేయాలనికూడ వారు కోరారు.

**ప్రపంచ బాల ఛాయాచిత్ర ప్రదర్శనం :**

"ఈ ప్రపంచ బాలబాలికలు అనే శీర్షిక కింద వివిధదేశాల బాలబాలికల, ముఖ్యంగా వర్ధమాన దేశాల బాలబాలికల ఆరోగ్య విద్యాభివృద్ధి దశలను తెలిపే 515 ఛాయాచిత్రాల ప్రదర్శనం కళాభవన్‌లో జనవరి 13 నుండి 22 వరకు జరిగింది. ప్రముఖ ఛాయాచిత్రకారులు తీసిన ఫోటోల నుంచి 52 దేశాల చిత్రాలను ఎంపిక చేసి ప్రదర్శించారు. ఈ ప్రదర్శనం భారతదేశమంతటా సంచరిస్తుంది. దీనిని మాక్స్‌ముల్లర్ భవన్, ఆంధ్రప్రదేశ్ ఫోటోగ్రాఫిక్ సొసైటీ, జవహర్‌లాల్ భవన్‌ల సంయుక్త యాజమాన్యంలో నిర్వహించాయి. ప్రదర్శనంలోని ప్రాచ్యదేశాల పిల్లలఛాయాచిత్రాలు ఎక్కువగా దారిద్ర్యాన్ని చూపేవే వుండడం నగర ప్రేక్షకులకు కొంత బాధ కలిగించింది.

**ఉపశ్రుతి :**

"'ఆ రాజకీయ నాయకుడు ఏమీ చేయను' అనంటున్నాడు గదా! ఇంకా అనుమాన మెందుకు?" అన్నాను, ఒక సంశయాత్ముడైన నాయకునితో. 'స్వామీ, రాజీవలోచనలు, రాజనీతిజ్ఞులు ఒకకోవ వారు. చేయను అంటే చేస్తానని వారి మాటలకు అర్థం' అన్నాడు ఆ నాయకుడు. ఆయనా ఆ కోవ వాడే. రాజనీతిజ్ఞుల గోత్రాలు ఆయనకే తెలియాలి— అనుకున్నాను. 


**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street**

# పాల నుంచి ఘన పదార్థాలకి
# మీ పాప సులభంగా మారేలా చూడండి...
# నెస్‌టమ్: సున్నితమైన మార్పుకోసం
# ప్రత్యేకంగా రూపొందించిన బేబీ సీరియల్



మీ పాపకి మీరు ఎంతో మంచి ఆహారం యివ్వాలనుకుంటారు. అందుకే మీరు పాపకి చనుపాలు యిస్తారు. మీరు యివ్వగలిగిన వాటిలో ఎంతో పోషకత్వం కలిగి, సులభంగా జీర్ణమయే ఆహారం అదే.

పాపకి నాలుగు నెలలు నిండాక, పాప ఆహారంలో ఘన పదార్థాలు వుండాలి. కాని పాప జీర్ణం చేసుకునే విధానం యింకా సున్నితంగా వుంటుంది. అందుకే పాపకి సులభంగా జీర్ణమయే సీరియల్ కావాలి నెస్‌టమ్ వంటిది. ప్రత్యేకంగా రూపొందించినది కావటంతో మొదటగా ప్రవేశపెట్టే ఘన పదార్థంగా నెస్‌టమ్ సరియైనది. ఇది బియ్యంతో తయారు చేయబడింది. గ్లూటెన్ లేకపోవడం వలన దీనిని సులభంగా జీర్ణమయే సీరియల్‌గా పోషకాహార నిపుణులు అంగీకరించారు.

మీ పాప పోషకాహారానికి ఆధారంగా వుండే 11 విటమిన్లతోనూ, ఇనుము మరియు కాల్షియంతోనూ బలపరచబడినది కావడంతో నెస్‌టమ్ "కావాలి" అని పోషకాహారం విలువ తెలిసిన మీ వంటి తల్లులు అంటారు. విటమిన్లు పాప చర్మానికి మెరుపుని ఇస్తాయి. కళ్లలో కాంతులు తెస్తాయి. రోగ నిరోధక శక్తిని కలిగిస్తాయి. ఆరోగ్యవంతమైన రక్తం కోసం ఇనుము, దృఢమైన ఎముకలు, పండ్లకోసం కాల్షియం అవసరం.

పాప ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టడం ఎప్పుడూ సులభమైన పద్ధతి కాదు. కాని నెస్‌టమ్ పాలనుంచి ఘన పదార్థాలకి మార్పు సున్నితంగా వుండడానికి మీకు సహాయం చేస్తుంది




ఇనుము మరియు
11 విటమిన్లతో
బలపరచబడింది

# నెస్‌టమ్®
## రైస్

SAA/FSL/N/2671 TEL

తయారు చేయడం సులభం



ముందుగ మరిగిన వెచ్చని పాలు పోయండి



నెస్‌టమ్ చేర్చండి కలపండి



తినిపించుటకు తయారు

NESTLÉ.